


## మైసూరు స్త్రీల వారసత్వపు హక్కుల బిల్లు

మైసూరుస్త్రీల వారసత్వపుహక్కులను పెంపొందించుటకొకబిల్లు మైసూరుశాసన సభలో ప్రవేశపెట్టబడినదనియు, అది పూర్తివిచారణనిమిత్తము ఒక ఉపసంఘమువారికి పంపబడినదనియు గృహలక్ష్మిపాఠకు లెఱుగుదురు. ఆఉపసంఘమువారి నివేదిక ఈనడుమ ప్రచురింపబడినది. అది స్త్రీలోకమునకు గొప్ప ఆశాభంగమును కలిగించునదిగాఉన్నదని చెప్పుటకువిచారించుచున్నాము. తొలుతబిల్లు ఉపపాదింపబడిన తరుణమున మైసూరుస్త్రీలు సమావేశమై ఆబిల్లునందు చేయవలసినకొన్ని మార్పులను సూచించుచు తీర్మానించిరి. ఆతీర్మానములను ప్రభుత్వమువారికి పంపిరిగూడను. ఈతీర్మానములను బాగుగచర్చించి ఉపసంఘము వారు బిల్లులోని అంశములను విశాలపఱచి స్త్రీజనోపయోగకరములగునట్లు గావింతురని స్త్రీలు ఆశించిరి. స్త్రీల ఈఆశయము నెఱవేఱలేదు సరికదా ఉపసంఘమువారినివేదిక తొలుత ఉపపాదింపబడిన బిల్లులోని నియమములనే మఱింత సంకుచితపఱచుచు స్త్రీలకు మితిలేని ఆశాభంగమును కలిగించుచున్నది.

బిల్లులో మగవానిహక్కులు మంచికట్టుదిట్టములతో పరిరక్షింపబడినవి. ఆడువారికి ఏవోకొన్ని అందిపొందనిహక్కులు ఈయబడినవి. అవియైనను పూర్ణచిత్తముతో ఈయబడినట్లు కనుపించవు—గొణుగుచుకొన్ని, సణుగుచుకొన్ని. కుడిచేతితో ఇచ్చి ఎడమచేతితో లాగుకొను గారడివిద్యలో మగవాడు అందెవేసినచేయియనుటకు ఈబిల్లు నియమములలోని తికమకలేచాలియున్నవి. ఒక నిదర్శనమునుచూపెదము. తండ్రిఆస్తిలో కుమారునితోబాటు కూతురికి సమానభాగమీయబడలేదు. వివాహముచేసికొననికూతురికి కుమారుని భాగములో నాలగవవంతు; వివాహముచేసికొనినకూతురికి ఎట్టిభాగమును లేదు. వివాహము చేసికొననికూతురికి ఈకొద్దిహక్కు ఇచ్చినందులకుగాను తల్లిఆస్తిలో కుమారునకు సమాన

సమైనభాగమీయబడవలయునని సూచింపబడినది. స్త్రీలకు ఇపుడున్న వారసత్వపుహక్కుల వలన తల్లిఆస్తియంతయు వారికి చెందుచున్నది. ఈక్రొత్తబిల్లుమూలమున తల్లిఆస్తిలో కూతురితోబాటు కుమారునకును భాగముకలుగుచున్నది. తండ్రిఆస్తిలో కూతురికి సరియైన భాగములేదు. తనదైయింతవఱకుండిన తల్లిఆస్తిలో కూతురికి ఇపుడు సగముహక్కే. తల్లి ఆస్తిలో కుమారునకును, కుమార్తెకును సమానమైనభాగము. తండ్రిఆస్తిలో కుమారునిది హెచ్చుభాగము. క్రొత్తచట్టము గావింపనున్నమార్పుఇది. స్త్రీలకిది లాభకరమైనదని మతిపోయినవాడే మాటవరుసకైన అనజాలడు.

వివాహముచేసికొనని కూతురికి తండ్రిఆస్తిలో ఈయబడుభాగము అసంతృప్తిని కలిగించునదిగానున్నది. ఇక వివాహముచేసికొనుకూతురికి తండ్రిఆస్తిలో భాగమేలేకుండుట ఘోరమైన అన్యాయము. వివాహమైనంతమాత్రమున తండ్రిఆస్తిలో భాగముఅక్కఱలేకుండునంత స్వాతంత్ర్యస్థితి స్త్రీకిగలుగదు. వివాహమైన పలుసంవత్సరములవఱకు స్త్రీ ధనమునకు మగనిపైనను, అత్తింటివారిపైనను ఆధారపడవలసియుండును. హిందూబాలిక అసౌఖ్యమునకు అతిబాల్యవివాహములే కారణమని పలువురుతలంచుచున్నారు. కాని అంతకంటె ధనవిషయమున ఆమెకుగల నిస్సహాయస్థితియే ఆమె అసౌఖ్యమునకు ముఖ్యకారణమనుట సత్యసమీపమగును. ఈనడుమ మైసూరుస్త్రీలు టుంకూరునందు సమావేశమై తండ్రిఆస్తిలో తమకుభాగమిచ్చుచో తమ్ము ప్రస్తుతముఆవరించియున్న నిస్సహాయతతొలగిపోవుననియు, కావున తమకీహక్కు ప్రసాదింపవలయుననియు పురుషమహాశయులను ప్రార్థించియున్నారు. విద్య, ధనముఅను రెండుశక్తులకు స్త్రీలను దూరమొనర్చి పురుషులు వారిపై నిరాఘాటమైన అధికారమును చలాయించుచున్నారు. విద్య, ధనముఅను రెండుశక్తులును పొందగలుగుచో స్త్రీలు అచిరకాలముననే పురుషులతో సమానముకాగలరు. వెనుకటివలె ఆశక్తుల రెండింటిని ఇకస్త్రీలనుండి వెలివేయుటకు వీలులేదు. సర్వపథముల యందును, సర్వసత్ప్రయత్నములయందును స్త్రీలు పురుషులకంటె ముందంజవేయుచున్నారు. స్థితి ఇట్టిదికాగా ఈఉపసంఘమువారు కూతురికి, కొడుకునకు ఇట్టివిభేదము కల్పించుట చాల అవకతవకగనున్నది. ఈఉపసంఘమునందు కొందరుస్త్రీలుకూడ సభ్యురాండ్రుగ నియమింపబడియుండుచో స్త్రీలకిట్టిఘోరమైనఅన్యాయము జరుగకుండెడిది. కాని ఇపుడు కాలముమించినది. ఆబిల్లు మైసూరుశాసనసభలో డిసెంబరు 20-వతేదీని ఆమోదింపబడి శాసనమైనది. అగుగాక! అది పురుషనిర్మితముమాత్రమే. ప్రాక్తనాచారప్రియులకు అది కొంతవఱకు తృప్తినీయవచ్చును. కాని యువకులను, సంఘసంస్కర్తలను అది తృప్తిపఱుపజాలదు. వారియలజడిపోట్లు శాసనమునకు తప్పవు. అగుటచే దాని ఆయుర్దాయము నిలకడలేనిదగుచున్నది. స్త్రీలకు ఉపకరించుపద్ధతిలో శాసనము త్వరలో జన్మాంతరమును పొందునుగాక!

# శారద లేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు:—

నెచ్చెలీ! నీవిద్యనుచూచియు, నీవివేకమునుచూచియు, నీదేశభక్తినిచూచియు నీహృదయ మత్యంతవిశాలమైనదనియు, నీభావము లత్యంతోదారములనియు, నీమనం బత్యంతకోమలమనియు భావించుచుంటిని గాని నీహృదయ మింతసంకుచితమనియు, నీభావము లింతయల్పములనియు, నీమానసంబింతకర్కశమనియు, పాఠశాలలలో చదువుకొను నాటి నుండియు నెయ్యురాలనుగానున్న నేనైన తెలిసికొనకపోతినిగదా! మానవహృదయ మెంత అగాధము!

ఆశ్చర్యము! ఆశ్చర్యము! అంటరానితనముండరాదనినందులకు మహాత్ముని నెంత నిందించితివి? ఏమి హిందూమతవిధ్వంసియా! వర్ణాశ్రమాచారవినాశకుడా! శాస్త్రద్రోహియా! ధర్మహీనుడా! శ్రౌతస్మార్తకర్మానుష్ఠానపరులును, యజ్ఞయాజనాదిషట్కర్మనిరతులును నైన సనాతనధర్మపరులను హింసించుచున్న కసాయివాడా! అబ్బా ఆయెఱవాడా యోగిని యెన్నికఱకులాడితివి? అస్పృశ్యతాసమస్య ఆసేతుశీతనగపర్యంతము పరివ్యాప్తమై అగ్రజాతులలో మహాసంచలనము గలిగించువఱకు నీలో నింత జాత్యహంకారము ఘనీభవించియున్నదని తెలిసికొనకపోతినే! ఇంతకును మహాత్ముడుచేసిన దోషమేమి? అంత్యజులను దేవాలయములోనికి రానీయు డనెనా? దానికా నీవింతగా ఆయనను దూషించుట? మన దేవాలయముల కేమి పేరున్నదో తెలియునా? హిందూదేవాలయము లనిపేరు. హిందూదేవాలయములని వానికెప్పుడు పేరువచ్చెనో అవి హిందువు లందఱిసొత్తైయుండుట సామాన్యధర్మమేగదా?

అగ్రజాతులు అంత్యజాతులు అనెడి భేదము లేక హిందువులనబడువారందఱు దేవాలయమున కేగినప్పుడేగదా అది హిందుదేవాలయమనుట కర్హమగును? కొందఱు రావచ్చును, కొందఱురాగూడదు అను యీవికృతపు విపరీతపుసిద్ధాంతము మనహిందూ దేవాలయములకే కలదుగాని మఱియేమతస్థులకైన కలదేమో చూడుము. మహమ్మదీయులెల్లరు ప్రవేశింపరాని మసీదుగాని, క్రైస్తవులెల్లరు ప్రవేశింపరాని చర్చిగాని యెచ్చటనైన నున్నవా? ఏమతస్థులదని యాయాలయము చెప్పబడునో ఆమతస్థులెల్ల రాదేవాలయములోని కేగి స్వామినిసేవించుటకు హక్కుగలిగియుండుట న్యాయమైన హక్కుగదా? జాత్యహంకారముచే వారిలో కొందఱిని నిరసించుట అక్రమనిరోధముగాదా? ఇంతియేగాక అస్పృశ్యులు దేవాలయప్రవేశముచేసినచో దేవునకు పాపము చుట్టుకొనుననియు, ఆయన మైలపడి పోవుననియు, ఆయనలోని కళ తగ్గిపోవుననియు, మఱికొన్ని విపరీతపుప్రశ్నలుగూడ వేసితివి? నీప్రశ్నలు తలచుకొనినంతనే నాకు పొట్ట చెక్కలగునట్లు నవ్వువచ్చుచున్నది. దేవునకే పాపముచుట్టుకొనిన మనపాపములను తొలగించువాడెవడు? దేవుడే మయిలపడిన మనమైలల

బాపువాడెవడు! దేవునియందే కళతొలగిన మనయందు కళనిలుపువాడెవడు? దేవుడు దేవాలయములలో రాతిరూపముననుండుటచే ఆయన హృదయముగూడ రాయియనుకొనుచుంటివా? కాదు. కాదు.

తలిదండ్రులకెప్పుడు దుర్బలసంతానముపై వాత్సల్యమధికముగా నుండునట్టులనే యీవిశాలవిశ్వమునకంతయు తల్లియు, దండ్రియునైన భగవానుడుగూడ దీనులు దరిద్రులునైన వారిపక్షముననే వాత్సల్యము జూపుచుండును. ప్రాచీనపురాణముల శోధించుము. మహాభక్తులగాథ పఠించుము. జాతిమతవివక్షతలేక భగవానుడెంతమంది దీనులను, దరిద్రులను, అవర్ణులను రక్షించినగాథలు కానవచ్చునో? కబీరుదాసు దేవాలయములోనికి రాకుండ నిరోధించినందుకు భద్రాచలదేవాలయములోని సీతారామలక్ష్మణవిగ్రహములు అదృశ్యమైనట్టును, మాలయోబని నిరోధించినందునకు ఒంటిమిట్టదేవాలయములోని స్వామి వానివైపునకే యభిముఖమైనట్టును, ఇట్టి వెన్నియో దృష్టాంతగాథల చదువుచున్నాముగదా. వీనినిబట్టి యేమి తేలుచున్నది? భగవంతుడు గుణశీలములనుబట్టియేగాని జాతిమతవివక్షతను బట్టి నిగ్రహానుగ్రహములు చూపబోడనియేగదా! కావుననే శ్రీమహాభాగవతములో జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపబనిలేదు. శమదమాదివర్ణలక్షణవ్యవహారంబుల గనవలయునని చెప్పబడియున్నది. ఇంతకును దేవుడు ఎవరిపక్షమున నున్నాడని యెక్కడెక్కడి యుదాహరణములనో వెదకనేల? నేడు భగవానుడు కడజాతివారి పక్షమున నుండుటబట్టియేగదా వారి నుద్ధరించుటకై యింత మహోద్యమము భారతదేశమున బయలువెడలుటయు, జగత్పూజ్యుడగు నొకమహావ్యక్తి వారికై యాత్మార్పణము సేయనుండుటయు కనుచున్నారము. ముంజేతికంకణమున కద్దమేల? శ్రోత్రియుల ఆందోళనముగాంచి నీవేల కలవరముజెందెదవు? మనసనాతనధర్మపరులే సంస్కరణమును విశాలబుద్ధితో యోచించి స్వాగతమిచ్చిరి. సహగమనదురాచారము కేవలము నిష్కరుణమైనదిగదా? దానిని మాన్ప యత్నించిన మహానీయుని వీరెంత దూషించిరి? ఎంత వ్యతిరేకాందోళనము చేసిరి? అనదలగు బాలవితంతువులు దయనీయులుగదా? వారిని గాపాడ కంకణము గట్టుకొనిన కారుణ్యమూర్తిని వీరెంతబాధించిరి? ఎంత ప్రతికూలయత్నము చేసిరి? సముద్రయానమనిన సామాన్యవిషయమేగదా! దాని కెంతగడబిడచేసిరి. మొన్నమొన్నటి శారదాశాసన సందర్భమున వీరెంత తీవ్రతరాందోళనచేసి దేశీయులభయపెట్టి పసిపిల్లల గొంతులుకోసినది మనము కన్నులార చూచినదేగదా. ఇంతకును యీశ్రోత్రియంమన్యులుప్రతిసంస్కరమునకు మొదురొడ్డి పోరాడి అలసి డస్సి విరమించుటయేగాని వీరి తిరుగుబాటునకు వెఱచివచ్చిన ఒక సంస్కరణమైన తిరుగుమొగము పెట్టినట్టు కంటిమా? నేటి యస్పృశ్యతాఆందోళనయు నట్టిదే.

ఒకానొకశాస్త్రిగారు చెప్పినట్టుగా శిశిరఋతువులో రాలుఆకులను రాలకుండను, వసంతఋతువులో చిగిర్చుపల్లవములు చిగిర్పకుండను యెట్లు నిరోధింపజాలమో అటులనే కాలప్రభావముచే సంఘములోజరుగు మార్పులును అవిలంఘనీయములు. సనాతనధర్మపరులలో నెంతపండితులైనను వారియందొక్కటే లోపముగలదు. ఎంతకాలమునకు ప్రాతవానిపట్టుకొని ప్రాకులాడుటయేగాని యొక్కక్రొత్తదానిని సమర్థింపలేరు. మనప్రాచీనమహర్షులను స్మరింపుము. ఆహా! ఏమి వారిమేధ! తమపేర ఒక్కొక్కరొక్కొక్క స్మృతినో, సూత్రమునో, రచియించి వేలసంవత్సరములు గడచినను మనపై నెట్లు రాజ్యముచేయుచున్నారో. దేశకాలపాత్రభేదము లాకాలమున గూడగలవనియు, భిన్నాభిప్రాయములు వారికిగూడ నున్నవనియు, వివిధరీతులుగా వారు వ్రాసిన స్మృతులే వివరించుచున్నవిగదా, అట్టిచో మనపండితులుగూడ ప్రస్తుతపరిస్థితుల కనుకూలమగు స్మృతులురచియించి స్థిరకీర్తులుగాక "పూర్వమే మున్నవో ఉన్నవి. వానిని మార్చుటకు వలనుగా"దని పట్టుబట్టి కూర్చుండుటవలన ప్రయోజనమేమి? ఒక మహాసంస్కరణము తలపైకి వచ్చినప్పుడు పండితులు చేయవలసిన పనియేమి? దేశస్థితియు, కాలముతీరును, ప్రజాభిప్రాయమును గమనించవలయును. ప్రాచీనధర్మశాస్త్రములను పరిశోధింపవలయును, ప్రస్తుతపరిస్థితులకు ప్రాచీనధర్మశాస్త్రములు తోడ్పడు విధ మాలోచింపవలయును. అప్పుడు నాయనలారా! మీరీవిధముగా నడుచుకొనుడు. ఈవిధముగా నడచిన మీకు శాస్త్రనిషేధముండదు అని చెప్పవలయునుగాని ప్రాచీనులపొగడి, నవీనులతెగడి జాత్యహంకారముతోను, అసహనముతోను వర్తించిన పండితసన్మదర్శనయనుసూక్తికి దూరులగుదురు. పండితులధిక్కరించి ధర్మశాస్త్రములనుల్లఘించి ప్రజలు ముందుకునడతురు. అప్పుడు స్వగౌరవమును శాస్త్రగౌరవమును నిలబెట్టజాలని యపఖ్యాతి పండితులకు దక్కును.

కల్పలతా! నే నీమధ్య నొకశాస్త్రులవారి యుపన్యాసమును వింటిని. ఆయన యుపన్యాససందర్భమున మొట్టమొదట చండాలస్పర్శగలిగిన గృహము నిప్పుపెట్టుమని శాస్త్రములలో వ్రాయబడియున్నదనియు, తరువాతివారు దానిని గృహశుద్ధి, దేహశుద్ధి, వస్త్రశుద్ధి చేసికొనిన చాలునన్నట్లుగా సంకుచితమొనర్చిరనియు చెప్పిరి. నిజముగా ఆతొల్లిటిధర్మమే యిప్పటికిని ఉన్నచో ఆపండితులగృహము లేమికావలయును? మఱుగుదొడ్ల మూలమున నిప్పుడు నిత్యము చండాలస్పర్శలేని గృహములేదుగదా. ఎంత శాస్త్రాభిమానముగల పరమశ్రోత్రియశిఖామణియైనను నిత్యము కొంపను అగ్నిదాహముగావించుటకు సమ్మతించునా? అదిగాదు. ఆపాకీపెరడునుమాత్రము శుద్ధిచేయుట కేమాత్రము ప్రయత్నించుచున్నారు. 'ఏమిచేస్తాము, తప్పని సరి'యని సరిపుచ్చుకొనుటలేదా? ఆవిధముగనే నేడు దేశోపద్రవము వచ్చినప్పుడు ఆప్రాచీనాచారముల మఱికొంత సడలించుకొనిన ఎంతబాగుగానుండును? ఇంతకును మనలోగల గొప్పలోపమేమనగా ఒక్కవిషయమందైన బుద్ధిపూర్వ

కముగా ఔదార్యము చూపజాలము. అదియే బలవంతముగా వచ్చి తలపైబడిన చచ్చినట్టు లూరుకొందుము. పంచముల పిల్లలతో బాటు మనబాలబాలికలు పాఠశాలలలో చదువుకొనుటకు సమ్మతించుచున్నాము. మనమగవారు కచ్చేరీలలో వారితో కలిసిమెలిసి వ్యవహారములు నడుపుచుండిన హర్షించుచున్నాము. రైళ్ళలో, పడవలలో, బస్సులలో వారితో బాటు ప్రయాణముచేయుచున్నాము. ఆసుపత్రులలో వారితో బాటు మందు తెచ్చుకొనుచున్నాము. ఒకానొకప్పుడు మందుయిచ్చువారుగూడ వారేఅయినను మాట్లాడకుండ తెచ్చుకొనుచున్నాము. నాటకములలో, సినీమాలలో వారితో బాటు గూర్చుండి ప్రదర్శనములుగాంచి వచ్చుచున్నాము. కాని యివన్నియు తప్పనిసరి. వీనిలో వేనికైన వర్ణముల బట్టి ప్రత్యేకవసతియున్నగాని లేక మనలను సలహాఅడిగిగాని యున్నచో మనము చండాలురవిషయమై ఔదార్యము చూపియుందుమా? సాగితే నాయకు, సాగకబోతే బోయకు.

కల్పలతా! అస్పృశ్యతాసమస్య అత్యంతవిశాలహృదయముతో విచారింపదగినది. ఏమాత్రము సంకుచితత్వము మనయందున్నను మనమీవిషయమై ఔదార్యముతో వర్తింపజాలము. ఔదార్యమును శ్రోత్రియులు చూపజాలరు, పండితులు చూపజాలరు, జాత్యహంకారులు చూపజాలరు, ఆచారపరులు చూపజాలరు, శుష్కవేదాంతులు చూపజాలరు, భజనపరులు చూపజాలరు, భక్తవేషులు చూపజాలరు, నిరుపమానజ్ఞానప్రభావముచే ప్రత్యణువునందును పరమాత్మను దర్శింపగల బ్రహ్మవేత్తలుమాత్రమే యీవిషయమున నౌదార్యము చూపగలరు.

నాల్గుజాతులవారితో దేవాలయమున కేగుచునే యున్నాముగదా. ఇక అయిదవజాతి వారితోగూడ నేగినచో నా ప్రమాదము? ఇది యేమంత గొప్పవిషయము. ఇంతకును దేవాలయములోని దేవుని పంచములు చూడకుండనున్నారాయనిన నదియులేదు. ఉత్సవాదులలో స్వామి పురవీథులలో నూరేగుటయు నప్పుడు చాతుర్వర్ణులతో బాటు పంచములుగూడ చూచుటయు సంభవించుచునేయున్నది. ఇక నిషేధమెవరికి? రాయిసున్నములతో గట్టిన ఆలయమునకా? డబ్బుతీసికొని అర్చనాదులు చేయుచున్న పూజారికా? దేవస్థానము పెత్తనము వహించియున్న ధర్మకర్తకా? చిరకాలమునుండి యనుభవించుచున్న యధికారమును చేతులారవిడువలేక పొందుచున్న ఆరాటమేగాని నిజముగా ఇందు ప్రమాదమేలేదు.

ఇంతకును సంకుచితహృదయులగు మానవులు నిర్మించినవగుట వీనికింత విధినిషేధములుగాని భగవన్నిర్మితములైనచో వీని కిట్టినిషేధమేయుండదు. భగవన్నిర్మితమైన ప్రకృతిని నుపలక్షింపుము. ఏమైన జాతివిభేదముగాన్పించునేమో! సర్వతాపోపశమనమగు చల్లని మలయమారుతమును వీక్షింపుము. చాతుర్వర్ణ్యులగృహములపై వీచి పురబాహ్యమునగల ఆచెప్పరానివారి పర్ణకుటీరములపై వీచుట మానునేమో! ఆసహస్రకిరణుని యెండవెలుగులచూడుము. అగ్రజాతులపై మాత్రమే ప్రసరించి అంత్యజుల బహిష్కరించు

నేమో! అమృతకిరణుని సాంద్రశీతలచంద్రికల కనుము. చండాలవాటికలపై ప్రసరించుట మానునేమో! భగవంతుని దయారసమా ఈరూపమున వెలువడుచున్నది యనునట్లుండు. వర్షధారలగనుము. అస్పృశ్యులసస్యముల వెలిపెట్టునేమో! అవి యివి యననేల దైవదత్తములగు కలిమిలేములేమి, కష్టసుఖములేమి, రోగనిరోగములేమి, చావుపుట్టువులేమి అన్నిట మనకును, వారికిని భేదమున్నదేమో కనుము. దైవము తరువాత దైవమంతవారు గనుకనే మహాత్ములైనవారికిగూడ నిట్టిభేదభావముండదు.

అయంనిజః పరోవేతిగణనా లఘుచేతసాం
ఉదారచరితానాంతువసుధైవకుటుంబకమ్.

మహాసీయులైనవారికి జగత్తే కుటుంబము. కావున వారు మానవులలో కొందరిని హీనులుగా భావింపజాలరు. భావించినవారు మహాత్ములే కారు. నేడు మహాత్ముడు అస్పృశ్యులవిషయమై దాక్షిణ్యమువహించుచున్నాడని యనుచున్నావుగదా! రాముడేమిచేసెను? శబరి యుచ్ఛిష్టమారగించెను. కృష్ణుడేమిచేసెను? అమాయకులగు వెత్తిగొల్లలతో నొకడై తిరిగెను. దాసీపుత్రునియింట ఆతిథ్యముగొనెను. అధికులవిడనాడి అనదలచేపట్టుట, బలవంతుల పీడిబడుగులరక్షించుట, ధనికులధిక్కరించి దరిద్రులప్రోచుట మహాత్ములలక్షణము. కావుననే మహాత్ముడు నేడు అగ్రజాతులపీడి అంత్యజులకు బాసటైనాడు. హిందూమతమును విధ్వంసమొనర్చుటకుగాని, హిందూదేవాలయముల భ్రష్టమొనర్చుటకుగాని, హిందూశాస్త్రములపాడొనర్చుటకుగాని హిందూపండితులనేడ్పించుటకు గాని కాదు. ఎక్కడున్నను, ఏమిచేయుచున్నను, ఎందువర్తించుచున్నను తల్లియొక్కచిత్తము బిడ్డపై లగ్నమై యున్నట్లుగా, ఎందున్నను మహాత్ములహృదయము దీనులపై లగ్నమైయుండును. ఇందు శాస్త్రప్రమాణము లక్కరలేదు. విశాలమై, అనంతమై, దైవస్వరూపమై వెలయుకారుణ్యమే ఉత్కృష్టధర్మశాస్త్రము. గజేంద్రుడు పాహి, పాహిఅని పలవించినప్పుడు; ద్రౌపది హే ద్వారకావాసా! కావుము కావుమన్నప్పుడు; పదునాఱువేల రాచకన్నెలు శ్రీహరీ! ఈ చెఱసాలబాధలు భరింపలేమన్నప్పుడు, శ్రీమహావిష్ణువు ఉరుకులు వెట్టుకొనుచు పరువెత్తుటేగాని యేశ్రుతిస్మృతులు శోధించెను? ఏధర్మశాస్త్రములు తిరుగవైచెను? ఏపండితులతో సంప్రదించెను?

కల్పలతా! నీవేగాదు ఈఅస్పృశ్యతాసమస్య ఆరంభమైనది మొదలు యెందఱో స్త్రీలు యెన్నియోవిధముల మహాత్మునిదూషించుట చెవులారవినుచున్నాను. హిందూసంఘములో స్త్రీలకీయబడిన స్థానమునుచూచినచో అపంచములకంటె మనమెక్కువగా చూడబడలేదు. స్త్రీలు శ్రుతులువినరాదు. స్మృతులుపఠింపరాదు. మంత్రములునేర్చుకొనరాదు. ఒకరికి ఉపదేశముచేయరాదు. భగవద్గీతచదువరాదు. భాష్యములుపఠింపరాదు. మొన్న నీమధ్య నొకబాలికకు వ్యాకరణముచెప్పుమనగా ‘ఆఁ. ఆడవాళ్ళకు వ్యాకరణముచెప్పుదునా,

అని ఒకశాస్త్రులుగారు నిరాకరించెను. దేవాలయములలో పూజాధికము లొనర్చుసమయములో స్త్రీలు అస్పృశ్యులే. ఇదిగాక పెక్కుసందర్భములలో స్త్రీలకు అస్పృశ్యతవిధిగా నేర్పడియున్నది. పాకీపని తమకెంత పరిచయమైనపనియో బిడ్డలుగల తల్లులకెల్లరకు తెలిసియేయున్నది. స్త్రీయన్న కారణమున యెన్నిమతవిధులలో బహిష్కరింపబడియున్నారో మన స్త్రీలకు తెలియనివిషయముగాదు. ఇన్నివిధముల మనము పంచములకు సన్నిహితులమైయుండ మనలో నేమియో ఆధిక్యతయున్నదని గర్వించుట వెఱ్ఱితనము.

భగవంతు డొకప్పుడు మానవుల దయాధర్మముల పరీక్షించుటకు కుంటివానివలెను, గ్రుడ్డివానివలెను, కుష్ఠురోగివలెను, ముసలివానివలెను, పేదవానివలెను వచ్చుచనియు అట్టివానిని అసహ్యపడక యెవరు సమాదరింతురో వారిని అనుగ్రహించునని మనము అష్టాదశపురాణములవల్లను, అసంఖ్యాకశాస్త్రములవల్లను, వ్రతకథలవల్లను, మఱిపెక్కువిధములను వినియున్నాము. అటులనే నేడు భగవానుడు అస్పృశ్యతారూపమున మానవుల దయారసమును వీక్షించుటకు వచ్చియున్నాడు. పురుషులమాటమన కేల? కారుణ్యభావమునకు పేరొందిన మనస్త్రీలైనను ఇందలి సారస్యమును గ్రహించి పంచములకు ప్రేమభిక్ష పెట్టిరేని భగవంతు డనుగ్రహించును. మహాత్ముడు సంతృప్తిజెందును. దీనులు సంతసింతురు. లోకము జయపెట్టును. కావుననే కడచిననెలలో రాజమహేంద్రవరములో జరిగిన రాష్ట్రీయమహిళాసభ స్త్రీలెల్ల రీయుద్యమమునకు సుముఖులుగానుండవలయునని హెచ్చరించినది.

కల్పలతా! నాజబాబు పూర్తియైనది. నీప్రశ్నలకు ప్రతిజబాబు లొసగిన నాపై యనుగ్రహించి కుసుమాక్షతలు జల్లుదువో, ఆగ్రహించి నిందాశిలల రువ్వుదువో రెండిటికిని నాపైటచెఱగునుపట్టియే యుంచితిని. నీచిత్తము. —ఇట్లు మిత్రురాలు, శారద.

## శిథిలప్రేమ

ఓలేటి సీతారామమూర్తిగారు

[వెనుకటిసంచిక తరువాయి]

ప్రకటితప్రేమభావసౌరభమె కురియు
మొదటివేకువ విరజాజి పువుబొడంద
నేకతనవిషహాస్తంబు లీవిధాన
గ్రీష్మదావాగ్ని కీల రగిల్చివైచె?
ఆతపపురేఖ మొఱుఁగని యలరువోలె
ప్రేమదేవత కనురెప్ప విరియునీడ
మోహదీప్తుల సొగయు నాముగ్ధమూర్తి
నెవ్వ రీరాఁతిగోరి బంధించినారు?
నాయనార్కళి ప్రణయవిహాయసమున
గోమువర్షించు తారకాకోరకమ్ము

నాకఠోరతమోవిషాదాభ్రపటలి
క్రమ్ముకొన జీవితమె ధ్వాంతగతులస్రుక్క!
స్పృహయెలేని డెందంబుఁ జీల్చికొనివచ్చు
నామహోగ్రంపు నిశ్వాసధూమశిఖల
ప్రావృతోష్ణాన బ్రద్దలువాఱు సీస
మాధిలోఁ గాంతునా ప్రేమమధురమూర్తి.
అమృతమందారమృదులశయ్యాతలానఁ
బ్రేమలీలల హావణిల్ల వేడ్కపడితి;
కరకురాగోరిపైని నేప్పురొదతోడ
హతమనోరథార్తిని బొరలాడుచుంటి!

# అదృష్టము

శ్రీ పులి తాయి రత్నమాలగారు

వారిరువురు కలసి వెడుతున్నారు చెట్లసందుగుండా.

అతడు ఎప్పుడూ గొడుగు వేసుకోడు. ఎంచేతో?

ఇతడికి ఎప్పుడూ గొడుగు వుండితీరాల్సిందే.

మట్టమధ్యాహ్నం. అయినా దట్టమైన చెట్లఆకులమధ్యనుండి ప్రభాకరుడు తనవేడికిరణాలు జొప్పించుటకు ప్రయత్నించికూడా కృతకృత్యుడు కాలేకపోతున్నాడు.

అప్పుడు ఇతడికి అవతలికి వెళ్ళాల్సివచ్చింది. అన్నాడుకదా అతనితో ఇదిగో కాస్తంత ఈగొడుగువేసుకో నే నిప్పుడేవస్తానని.

అతడు విసుక్కున్నాడు 'నీవు పట్టుకుపోకూడదూ'అని. మళ్ళా మిత్రుడి మాట దాటలేక మెల్లిగా పట్టుకున్నాడు గొడుగు విలాసంగా కదుపుతూ.

ఇంతలోనేదో "టప్" మని శబ్దం వినిపించింది.

ఏకాయో లేక కర్రముక్కో గొడుగుమీద పడిందనుకున్నాడతడు. గొడుగుదించి దులిపాడు. ఎదురుగా పాకుతోంది పసిరికపాము.

ప్రక్కబాటగుండా వస్తున్నారిద్దరు బాటసారులు. చూచారు పాముని. తమచేతిలోని లాఠీతో చావగొట్టారు రిజర్వుపోలీసుల్లాగ...

అతడు అల్లాచూస్తూనే విభ్రాంతు డయ్యాడు. సంభ్రమాశ్చర్యాలు పెనగొన్నాయి అతనిని.

ఇంతట్లో వచ్చాడు అవతలికివెళ్ళినమిత్రుడు. చూచాడు దృశ్యం "ఎంతలో ఎంతపని జరిగింది? చూచావా! నాగొడుగు నిన్ను రక్షించింది" అన్నాడితడు.

బాటసారు లన్నారుగదా "చూడండీ, ఎవరో ఒకకవికాబోలు చెప్పేడుట: చెట్టుక్రిందగొడుగు నీళ్ళల్లోచెప్పులు_ ఇంకాఏవో మర్చిపోయాము_ తప్పకుండావుండాలని. కవి కలానికి ఎదురులేదు. మీరెంత అదృష్టవంతులూ? ఇంతముప్పుదాటింది. చాలావందనాలు. సెలవు"అన్నారు...

"నువ్వే చాలా అదృష్టవంతుడివిరా" అన్నాడు మిత్రుడు వీపుమీద చరుస్తూ. అప్పుడే యోగనిద్రనుండి లేచాడతడు.

# కాఫీ

పురాణం కుమార రాఘవ శాస్త్రి గారు బి. ఏ.

ప్రతిరోజూ చూస్తున్నానుకదా! నేను మధ్యాహ్నం స్కూలునుంచి ఎఱ్ఱటెండలో దేవుడా అంటూ ఇంటికి నడిచివస్తే తలుపు బిడాయించి వుంటుంది. లోపల రాణీగారు గుఱ్ఱుతీస్తుంటుంది. నేను బయట నిల్చుని "లీలా! లీలా!" అంటూ ఓగంటసేపు తలుపు దగ్గర పాట పాడగా పాడగా "అబ్బ! ఏంగోలచేస్తారండీ!"అని గొణుగుతూ, కళ్లు నులుముకుంటూ, నిద్ర మత్తుమీద పడుతూ, లేస్తూ వచ్చి తలుపుతీస్తుంది. తీసిందే తడవుగా మళ్లీ యథాక్రమంగా పడుకుని ముసుగెట్టుకుంటుంది. ఇంతనిద్ర మత్తుఅయితే ఎలాగబ్బా మరీను.

సాధారణంగా నేను మధ్యాహ్నంఎందుకు వస్తానంటే ఏదో ఇంట్లో కాఫీగట్రా చేస్తుందేమో, ఇంజన్‌లో కాస్త బొగ్గేసి మరీ పోదామని వుద్దేశం. లేకపోతే ప్రొద్దున పదిగంటలకు నాలుగు మెతుకులు తిని పోయి సాయంత్రంవరకూ ఉండలేనుగా. అందులో గుండెలుకరగేటట్లు స్కూల్లో పిల్లలకు బోధ చేయవలసినపని ఒకటి. జాగ్రఫీమాస్టరునుగదూ హైస్కూలులో.

నేనింటికి వచ్చేసరికి లీల ఈవిధంగా నిద్రమత్తు చూపిస్తుంటే నాకుమరీ రానురాను కోపం ఎక్కువౌతున్నది. ఎన్నాళ్లని సహిస్తాను. ఒకరోజా! రెండురోజులా! రోజూ ఇదే వరసైపోయె. నేనాపాటికి వస్తానని తెలుసుకదా! కాస్త ఫలహారంచేసి, ఇన్ని కాఫీనీళ్ళుకాచి వుంచకూడదూ! దున్నపోతులాగా నిద్రపోకపోతే.

పాపంగదా అని నేను చనువు చూపించిన కొద్దీ దానికి నిర్లక్ష్యం బలిసిపోయింది. ఎంతసేపటికీ ఆడదాన్ని కాళ్ళ రాయాలండీ అంటారు కొంతమంది. ఆమాటలునాకు రుచించవుగాని కొంతవరకు సత్యముండేమోనని అనుమానపడతాను అప్పుడప్పుడు.

వచ్చిన ఆవస్థఏమిటయ్యాఅంటే నేను దాన్ని మందలించడానికికూడా వీల్లేకుండా వచ్చింది. కారణమేమంటే— మేమొకరియింట్లో దక్షిణభాగంలో అద్దెకు కాపురమున్నాం. అవతలిభాగంలో ఇంటివారున్నారు. ఆయింటిఆవిడ పెద్దముత్తైదువ. మాయిద్దరికేసి హాల్లో అనవసరంగా జోక్యం కలిగించుకుంటుంది. నేనెప్పుడైనా లీలను కోపంచేస్తుంటే ఆమె దుడదుడా దానికి వత్తాసివచ్చి నన్నంటుందిగదా! 'అబ్బాయీ! ఆ అమ్మాయి నెందుకు కోపపడతావూ?. చిన్నపిల్ల. కాపురానికివచ్చి ఏడాదైనా కాలేదు సరిగ్గా. ఏదైనా దానివల్ల తప్పువస్తే మగవాడివి నీవే సర్దుకుపోవాలి." అంటుంది. ఈవిడవత్తాసి చూచుకుని మరింత నిర్లక్ష్యం జాస్తిఅయింది లీలకు. కూరల్లో మరి కాస్త వుప్పువేయడం సాగించింది. బడివేళకు వంట కావడములేదు. నాగదిలో నేను కాల్చి పారవేసిన సిగరెట్టుముక్కలసంఖ్య ఎక్కువౌతున్నది; ఎప్పుడైనా ఊడ్పించినపాపాన పోతేనా మరి!

ఇన్నితప్పులూ క్షమించేస్తాను లీలగనుక నేను మధ్యాహ్నం స్కూలునుంచిరాగానే తాను కాఫీచేసివుంచిందంటే. కాని అదిలేదుగా! ప్రతిరోజూ వచ్చినట్లు నేనే చేసుకొనేవాణ్ణి కాఫీ అప్పటికప్పుడు. పైగా ఇంకోతమాషా. ఇంత కష్టపడి నేను కాఫీచేసుకుంటూనా! చివరకు చల్లారపోనే సమయానికి నిద్ర ఎక్కడకుపోతుందో చల్లగావచ్చి దగ్గరకూర్చుంటుంది తనభాగంకోసం చిలిపినవ్వు నవ్వుకుంటూ. పాపంగదాఅని ఒకగిన్నెడు దానిముఖాన పోసి మిగతాది నేను తాగి స్కూలుకుపోతా. ఇదీ రోజూ జరిగేఘట్టం.

నాకీస్కూలుమాస్టరీవుద్యోగం దొరికిన ఆరునెల్ల నుంచీ ఇదేవిధంగా రోజూ కాఫీ చేయడంలో 'ప్రొఫెసర్'నైపోయాను. ఐనా నన్నొక అభిమానం బాధిస్తూనేవున్నది. ఇవ్వాళ కాఫీచేసుకోటంతో నే సరిపోయింది. రేపు వంటకూడా చేయలేనని [illegible] కుంటుంది. దేవుడాఅంటూ నేనుకోవాలిసిందేనా?. ఇంకా నాలుగురోజులుపోతే "నావిస్టల్లోకూడా

కాస్త వడ్డించి మరీ మీరు భోజనం చేయండి" అంటుంది. ఏముంది! స్త్రీకి అలుసిచ్చినకొద్దీ నెత్తికెక్కి కూర్చునే ప్రకృతిలాగుంది. నాకేమీ పాలుపోవడంలేదు. ఒక నాడు స్కూలునుంచి మధ్యాహ్నం ఇంటికివస్తూ ఆలోచించుకున్నాను: "ఛా! ఛా! భార్యను లొంగదీసుకోలేని నా బ్రతుకంతా నీచమైపోతున్నది. ఇంకా ఈ నా అసమర్థత బడిపిల్లల కెవరికీ తెలియకపోవడంచేత డాబుసరితో మర్యాద నిలబెట్టుకుంటున్నాను. వాళ్లకుగనుక తెలిసెనా, నా బ్రతుకు స్కూల్లో, బయటాకూడా కడిగిపోస్తారు; ఏకేస్తారు దూదిపింజలాగా." ఇంకా ఏమేమో ఆలోచించుకున్నాను. చివరకు తేలిందేమంటే "ఇకనుంచి ఈజన్మలో ఎప్పుడూ కుంపటి రాజేసి నేను కాఫీ చేయను" అని నిశ్చయించుకున్నాను.

తిన్నగా ఇంటికిపోయి తలుపుతట్టాను. కొంతసేపటికి తలుపులు తెరుచుకున్నవి. నాముఖంలో ఒక గంభీరత తెచ్చిపెట్టుకున్నాను. ఐనా లాభంలేకపోయింది. లీల నాముఖం వేపు చూస్తేగా. తలుపు తీసింది. మళ్లీ వెళ్లి గాఢనిద్రలో మునిగిపోయింది.

నాకేమీ తోచడములేదు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అక్కడ ఒక గూట్లో ప్రొద్దున కాఫీచేసుకోగా మిగిలినపాలు పోసివున్న వెండిగ్లాసు యథాస్థానంలోవుంది. అక్కడే ఆమూల సగానికిబొగ్గులు పోసివున్న కుంపటి చిరకాల స్నేహభావంతో నన్నాహ్వానిస్తున్నట్లు కనుపిస్తున్నది. అక్కడ ముక్కాలిపీటమీద మామిడికాయమార్కు అగ్గిపెట్టె కూడా నాదృక్పథం తప్పించుకునిపోలేదు.

ఎలాగా ఇప్పుడు లీలను లేపి కాఫీ చేయించడం?. గుఱ్ఱుకూడా తీస్తున్నదిసన్నగా. నాప్రయోజకత్వం పరీక్షచేసేసమయం అది. లీలను లేపి కాఫీచేయమని దబాయిద్దామా అంటే ఒకవేళ అది నిద్రమత్తుమీద కిముక్కని లేవకపోతే యథాప్రకారంగా నేనే చేసుకోవలసి వస్తుందేమో. అది మరీ అవమానకరమైంది. కనుక కిక్కురుమనకుండా రోజుకు మల్లే నేనే కుంపటి రాజేసుకుంటే బాగుండేలాగుంది.

కుంపటి అంటించుకున్నాను నేనే. డికాక్షన్ నీళ్లు కాగుతున్నవి. నేను అటూ, ఇటూ పచారుచేస్తున్నాను సాయంత్రం వాల్గవఘారం వాళ్లకు చెప్పవలసిన జాగ్రఫీపాఠం నెమరుకు తెచ్చుకుంటూ. డికాక్షన్ నీళ్ళు సలసలా కాగినై. నేను చప్పుడుకాకుండా దొంగతనంగా వంటయింట్లో పాలుత్రాగబోయే మార్జాలంలాగా అడుగులు వేసుకుంటూపోయి లీల మెడలో మంగళసూత్రానికి కట్టివున్న తాళపుచెవి విప్పుకుని పెట్టెతీసి అందులోవున్న కాఫీపొడుం డబ్బా తెచ్చుకున్నాను. లీలకు నిద్రాభంగం కాకుండా జాగ్రత్తపడ్డాను.

కాఫీ తయారైంది దేవలోకంలో అమృతంలాగా. ఇక చల్లార్చుకోవాలి. ఒకగిన్నెలోంచి మరోగిన్నెలోకి ఎత్తిపోస్తూ చల్లార్చటం మొదలెట్టేనంటే చప్పుడౌతుంది. చప్పుడౌతే లీలకు మెలకువ వస్తుందేమో. ఇప్పుడు దాన్ని లేపకూడదు. తగినశాస్తి చేయాలి. ఈ కాఫీలో ఒక్కచుక్కకూడా దానికివ్వను. విసనకఱ్ఱతో విసురుతూ కాఫీ చల్లార్చుకుంటున్నా.

నిజంగా కాఫీయొక్క ఆమనోహరమైన రంగులోనేవుంది కొంతమజా. అందుకనే కాఫీరంగు చీరలంటే ఆడవాళ్లకు చాలాయిష్టం. రంగుకేంగాని నేనిప్పుడు తయారుచేసిన కాఫీయొక్క ఘుమఘుమాయింపుమాత్రం ఘాటుగావుండి మాయిల్లంతా ఆవరించింది. ఈసౌరభానికి లీలయొక్కనిద్ర తెరలువిచ్చిపోతుందేమోనని నాభయం. అందుచేత ఆలస్యంగాకుండా తొందర తొందరగా కాఫీత్రాగేశాను, పెదవులూ, నాలుకా కొంచెం కాలుతున్నా ఓర్చుకుంటూ. కాఫీగిన్నెలు అక్కడే వదలివేశాను. లీల నిద్రపోతూనేవుంది పాపం.

స్కూలునుంచిరాగానే విడిచి వంకెకుతగిలించిన కోటు మళ్లీ ధరించుకున్నా. అద్దంలోచూచుకుని తలగుడ్డ చుట్టుకున్నా. ఉపాధ్యాయవేషం పూర్తిఐంది. జాగ్రఫీపుస్తకం చేతపట్టుకుని స్కూలుకు వెళ్లబోతూ లీలను లేపి "స్కూలుకుపోతున్నాను. తలుపువేసుకో" అనిచెప్పి వాకిలిగడప దాటేను. లీలలేచి గుమ్మం

దాకావచ్చింది. అక్కడేవున్నవిగా ఖాళీగిన్నెలన్నీ చూచింది. మళ్లీ నావేపు చూచింది. ఆమె ముఖం చూస్తే కొద్దిగా కోపంవచ్చిందేమో ననుకున్నాను. మాట్లాడకుండా స్కూలుకు వెళ్లేను.

లీలభాగంకూడా ఆనాడు నేనే త్రాగివందుచేత 'కాఫీడోసు' ఎక్కువై పాకం బాగా నేనప్పేను. పిల్లలెవరూ అల్లరిచేయకుండా విన్నారు. కాఫీఅంటే మంచివుద్రేకం కలిగించేవస్తువు సుమండీ!

* * *

మళ్లీమర్నాడు స్కూలు వదలిపెట్టినతర్వాత ఇంటికివచ్చాను మధ్యాహ్నం. రోజుకుమల్లేలేదు ఆనాటి వ్యవహారం. తలుపులు తెరచుకొనేవున్నవి. లీల నిద్రపోవడంలేదు. హాల్లో పడక కుర్చీలో వయ్యారంగా పడుకుని ఊలుతో విసనకఱ్ఱ అల్లుతున్నది. నేనురాగానే మర్యాదార్థంగా లేచి నాకోసం కుర్చీఖాళీచేసి అక్కడనిల్చున్నది అల్లుతూన్న విసనకఱ్ఱ చేతుల్లో పట్టుకుని. ఆమెకన్నుల్లో నిద్రమత్తు కనుపించడములేదు. సహజమైనకాంతితో జ్యోతుల్లాగా మెరుస్తున్నవి. తెల్లనిచీర కట్టుకున్నది. అప్పుడే తలదువ్వుకుని అల్లుకున్న నల్లత్రాచులాంటి ఆపొడుగాటిజడ భుజముమీదుగా ముందరకు తీసుకున్నది. ఉన్నతవక్షంమీద నాట్యంచేస్తూ అదోసొగసుగావున్నది. సహజంగా అందమైనపిల్ల లీల. అందులో ఆనుస్తాలు మీద నాకళ్లు మెరిసిపోయి ఒక్కసారి ఈచేతుల్లో నులిమివేద్దామా అనిపించింది ఆసౌందర్యకుసుమాన్ని.

కాని ఏమీమాట్లాడకుండా గంభీరంగా కుర్చీలో పడుకున్నా. సహజంగా వాగుడుకత్తెకాని లీలకూడా మౌనంలోనే వుంది. ఆమెవిశాలనేత్రాలలో నల్లగ్రుడ్లుచపలంగా అటూ ఇటూ పరుగెత్తుతున్నవి. చివరకు ఆక్కడ క్రిందపరచివున్న చిరిచాపమీద గోడ కానుకుని కూర్చున్నది.

“కూర్చుంటావేం. వేగిరం కాఫీచెయ్యి. స్కూలువేళౌతున్నది”.

“రోజూ మీరే చేసుకుంటున్నారుగా. ఇవ్వాళ నేనెందుకు?”.

“అనవసరపువాదం పెంచక. చేస్తావా? చేయవా?”.

“కోపపడకండి, పాలు లేవివ్వాళ”.

“ఎందుచేత?”.

“ఇప్పుడే కాఫీచేసుకుని తాగేశాను.”

చల్లారిన కుంపటీ, మసిపట్టిన ఒకగిన్నె ఆమూల నాకు కనుపించినవి. నిండా కోపంవచ్చింది నాకు. ఒళ్లంతా జలదరించింది.

“అయితే నామాట మరపువచ్చిందా నీకు.?” అని అడిగాను.

“నామాటమాత్రం మీకు జ్ఞాపకంవుందా నిన్న?”

“నేను స్కూల్లో వాగివాగి ఈపాటికివస్తానని ఎఱుగుదువుకదా! కాఫీఅంతా నీవేచేసుకుని త్రాగేస్తే ఏమనుకున్నావు?”

“ఇంట్లో చాకిరీచేసిచేసి అలసిపోయి వుంటాను కదా! నిన్నకాఫీఅంతా, ఒక్కచుక్కైనా నాకుమిగిల్చకుండా త్రాగేశారే ఏమిటో మీఅభిప్రాయం?”

“అభిప్రాయమేమిటి? నేను చేసుకున్నాను; త్రాగేశాను. నీవుచేశావా?”

“నేనుచేసుకొనేగా. నేనూ త్రాగేనూ!”

“తెలివితేటలు చూపించకు. నీవుచేసినపనిలో నీ నిర్లక్ష్యస్వభావం వెల్లడౌతున్నది.”

“నిన్న మీరుచేసినపనిలో మీకు నామీదవున్న ప్రేమ వ్యక్తమౌతున్నది కాబోలు.”

“సంతోషించాను. నోరుమూసుకో. చేసిన తప్పుకు పశ్చాత్తాపపడక సమర్థించుకో ప్రయత్నిస్తావెందుకు? చూస్తున్నానుకదా! రానురాను మాటల్లో, చేతల్లో, అన్నిట్లో నిర్లక్ష్యం కనుపిస్తూనేవుంది. అల్లాంటివేషాలు సాగవుసుమా! నేను సహించేవాణ్ణి గాదు.” నాపెదవులదరినై. కనుబొమలు ముడిపడినై. కన్ను లెఱ్ఱబడ్డట్టుకూడా వున్నవి.

లీల చలించలేదు. ప్రశాంతంగావున్నది ముఖం. పెదవులమీద లేతనవ్వు కదలాడుతూనే వున్నది. దాన్నిచూచినకొద్దీ నాకోపం మఱింత ఎక్కువౌతున్నది. కాని లీలమాత్రం నాకోపానికి తానేమీ వెరవ

నట్లుగా నావేపే చూస్తున్నది నవ్వుతూ. నాకోపానికి భయపడి గడగడ లాడేటందుకు బడిపిల్లవాడైతేనా. చేసుకున్న భార్య. నేనుపంతులునైనా, నాకే పంతులమ్మగావుంది.

ఆకోపంమీద కుర్చీలోంచి చివాలునలేచి, దబదబా పెట్టెతీసి నాలుగు చిల్లరడబ్బులు జేబులోవేసుకుని పోబోతున్నాను. నావుద్దేశమేమంటే స్కూలుకు పోయేదారిలో అనేక కాఫీభవనాలు వున్నాయికదా, ఏదో ఒకదానిలో దూరి కప్పో, రెండు కప్పులో కాఫీత్రాగి వెళ్లుదామని. కాఫీ లేకపోతే స్కూల్లో పాఠంచెప్పటం కష్టం. నాది అందులో కాఫీగతప్రాణం.

పోబోతున్నా. ఇంతలో లీలవచ్చి నా చేయిపట్టుకున్నది. "కాఫీత్రాగి వెళ్లరూ?"

"ఏమిటి మరీచమత్కారంగావుంది నీ వేషం ఇవ్వాళ. పాలన్నీ కాఫీచేసికొని త్రాగేశావ్."

"మరి కాఫీలేకుండా నేవెళ్ళుతారా స్కూలుకు?"

"అయితే ఏమిచేయమంటావు?"

"ఏమీలేదు. అప్పుడే స్కూలువేళ కాలేదుగా. కాస్సేపు కూర్చొని వెళ్లండి."

"ఇంతవరకు చాల సంతోషించాను నీవేషానికి. ఇంకా ఏముంది?"

"రండి తెలుస్తుంది" అని కుర్చీవేపులాగటం మొదలెట్టింది. ఆమెలేతచేతిపట్టు విడిపించుకోలేక పోయాను. మొదలువచ్చినకోపంకూడా చాలవరకు తగ్గింది. పోనీ ఇంకా టైము కాలేదుకదా అని మళ్లీ కుర్చీలో దేహంవాల్చాను. లీల వంటయింట్లోకి పోయి మూతపెట్టివున్న ఒకగిన్నెతో ప్రత్యక్షమైంది. నేనలాచూస్తూ ఊరుకున్నాను. "ఏమిటదీ!" అనికూడా అడగలేదు. అంతా నాటకంలావుంది.

"ఐతే మీలాంటిదాన్నే నేనుకూడా అని తలుస్తున్నారుకాబోలు మీరు. మీరంటే నిన్న కాఫీఅంతా సొకులేకుండా త్రాగేయగలిగినారుకాని, నాకలా ప్రాణంపోప్పదు సుమండీ! హిందూ స్త్రీకి భర్తే దైవం. అతన్నే ఎల్లప్పుడూ ఆరాధించుకుంటుంది. ఆయన చేత అనుభవింపబడని దేదిన్నీ ఆమెముట్టనేముట్టదు. నాథుని ఉచ్ఛిష్టమే ఆమెకు పంచభక్ష్యపరమాన్నాలు. మీదృష్టిలో నేనొకనీచురాలినిగా కనబడి వుంటాను ఈరోజున. కాని అంత అభాగ్యురాలను కాదు. నన్నుమీరు బాగా గుర్తెరుగకున్నందుకు నాకు దుఃఖంగావున్నది."

"పెద్దవుపన్యాసం చెప్పేవుకాని, హిందూ స్త్రీ భర్తచేత కాఫీచేయించుకుంటుందా రోజూ?"

"అదేకాబోలు ఇవ్వాళ మీకు నా మీద వచ్చిన కోపానికికారణం. సరదాగా మీరేచేసుకుంటున్నారనుకుంటున్నాను గాని నేను చేయనన్నానా?"

"మగవాడికి వంటచేయడంకూడా సర్దేనా?"

"ఇంతకోపం మనసులో వుంచుకోకపోతే నాకు చెప్పివుండ గూడదూ? నాకు తెలియదయ్యె." ఈలోగా తాను తెచ్చిన గిన్నెలోంచి, సేమ్యాపాయసం ఒక పింగాణీగిన్నెలోపోసి నాకందిస్తూ చిర్నవ్వుతో "ఇకనుంచి నేనే కాఫీచేస్తుంటాను. మీరు కుంపటి ముట్టుకోనేవద్దు. నన్ను క్షమించండి" అంది.

ఇప్పటికి కోపమంతా చల్లారిపోయింది నాకు. పాయసం చప్పరిస్తూ "ఇవ్వాళ ఈ ఆహారంమీద మనసుపోయిందా నీకు?" అన్నాను.

లీల కుర్చీదగ్గర నిల్చుని శరీరలత కొంచెంవంచి నాకోటు 'కాలర్' తడుముతూ నాకళ్లలోకిచూస్తూ "క్షమించారా?" అంది. నవ్వుతూన్న నాకళ్లే ప్రత్యుత్తరం చెప్పినై.

లీల శరీరమేకాదు, మనస్సుకూడా అందమైందనుమా అనుకున్నా. రెండుగిన్నెలపాయసం త్రాగేసి స్కూలుకు పోవడానికిలేచాను.

"ఇంతకూ మీకోపమంతా పోయిందా?" మధురంగా ప్రశ్నించింది లీల.

ప్రసన్నంగా చూస్తూ లీలను దగ్గరకు లాక్కున్నాను.

* * *

నాడు మొదలు ఈరోజువరకూ నా చేతిమీదుగా కాఫీచేసుకొని ఎఱుగను. ఎప్పుడైనా కాఫీలో పంచదార కలపటానికిగాని, చల్లారపోయడానికిగాని నేనువెళ్లితే "ఊరుకోండి. మీరు చేయిచేసుకోకండి" అంటుంది. పూర్వపు నిద్రమత్తంతా ఏమైందో?

# శిశువాత్సల్యము

ఆకుండి సత్యనారాయణగారు

మూడేండ్ల బాలికయగు లలిత కిలకిలనవ్వులయందు, అల్లరిచేయుట యందు మిగుల సమర్థురాలు. చేతనున్న రబ్బరుచేపను మాటిమాటికి ముద్దుకొనుచు వరండాలో నిలువబడిన తల్లిచెంతకు పరుగుపరుగున నరిగి "అమ్మా! చేపలెక్కడుంటాయి?" అని ప్రశ్నించినది. ప్రేమమయియగు తల్లి లలితను దరికి జేర్చుకొని, చిఱునవ్వు జిలుకుచుండెడి యామెపాలబుగ్గల నొక్కసారి ముద్దాడి ప్రేమమధురస్వరముతో "కన్నతల్లీ! చెఱువులోనుండునమ్మా!" అనియెను. "వాటిని పైకితీసిన—" అనియింకను లలిత మాటముగింపకుండనే "చనిపోతవి తల్లీ!" అనుచు నానందమయి (లలితతల్లి) పనిమీాద చటాలున నింటి లోనికి వెడలిపోయినది. తల్లిమాటవిని లలిత గుండె గుభిల్లుమనియెను. ఇంత వఱకు నామె హృదయమున వెలుగుచున్న యానందతేజోలేశ మొక్కసారిగా నంతర్ధానమైపోయెను. తనచిన్నిచేప పైనుండిన చనిపోవునుకదాయని యాయ మాయిక బాలికకు చాలవిచారము కలిగినది. వెంటనే లలిత తనముద్దు చేపను యింటికెదురుగనున్న చెఱువునకు తీసుకొనిపోయినది. మనసార మఱి యొకసారి ముద్దిడుకొనినది. తుదకు విడువలేక విడువలేక తనమృదుహస్తములతోడనే చెఱువులో విడచినది. ఒడ్డునకొట్టుచున్న పిల్లకెఱటములచే త్రోయబడి చేప రెండుమూడుసారులు ముందునకు వచ్చినది. అదిచూచి లలిత "చిన్నా! నాపద్దకువచ్చెదవా? వలదు, వలదు. వచ్చిన చచ్చిపోయెదవుసుమీ!" అనియెను. కొంతసేపటికి చేప చెఱువుమధ్యకు వెడలిపోయినది. తోడనే లలిత పీడితహృదయముతో నింటికి మరలిపోయినది.

దినములు గడచినవి. అది వేసవికాలము. ఒకనాటి సంధ్యాసమయమున ఆనందమయి చెఱువుమధ్యకుపోయి నీరము ముంచుచున్నది. పార్శ్వముననే బురదలో రబ్బరుచేపను చూచినది. ఆమె ప్రేమపూర్ణహృదయము చలించిపోయినది. ఆమె నయనములనుండి కన్నీరు పొంగి పొరలిపోవుచుండెను. "తల్లీ!—లలితా!—నీచిన్నిచేప సుఖముగా జీవించవలయునని యిందు విడచితివా?" అనిదుఃఖించుచు నాచేపను మెల్లగా పైకితీసినది. పిదప దానినింటికి గొనిపోయి యద్దపుబీరువాలో నునిచి చూచినపుడెల్ల దుఃఖజనితాశ్రుకణముల జలజలరాల్చుచుండెడిది—పాపము లలిత మాత్రము తన చిన్నిచేపను జూచుట కొక్కసారియైన మఱిరాలేదు.

# స్త్రీలు:ఉపాధ్యాయవృత్తి

మారేమండ రామారావు గారు ఎం. ఏ.

విద్యనుగూర్చియు, విద్యావిషయమునుగూర్చియు, బోధనాపద్ధతులనుగూర్చియు నిటీవల ననేక నూతనాభిప్రాయములు వెలువడినవి. ప్రజాస్వామ్యభావాభివృద్ధియు (Democracy) మనశ్శాస్త్రాభివృద్ధియు (Psychology) నిందులకు ముఖ్యకారణములు. "విద్యయన జ్ఞానము; పాఠ్యవిషయములన్నియు తదనుగుణ్యములుగ నుండవలెను; ఉపాధ్యాయు డేమి చెప్పునో దానిని గ్రహించుటయే విద్యార్థికి ప్రధానకర్తవ్యము" అను పూర్వాభిప్రాయములెల్ల మార్పుఁజెందినవి. మనశ్శాస్త్రపరిశోధనల మూలమున విద్యార్థికిఁగల వ్యక్తిత్వమును ఎక్కుడుగ గౌరవించి, యాతని మానసికపరివర్తనమున కనుగుణ్యముగ విద్య నాతని స్వయంకృషిమూలముననే నేర్పవలసియుండునను సిద్ధాంతములు బయల్వెడలినవి. అటులనే ప్రకృతకాలమునం దార్థికరాజకీయములే దేశక్షేమమున కాధారములుగ నుండుటఁజేసి నిర్దుష్టమగు సాంఘికజీవితమును గడపుటకును, దమ కృషిమూలమున స్వోదరపోషణ మొనర్చుకొనుటకును శక్తిఁగలిగి సచ్ఛీలురుగనుండు పౌరులను నిర్మించుటయే విద్యావిధానమున కాదర్శముగ నెంచఁబడుచున్నది. ఇటుల మానసికపరివర్తనముల ననుసరించి ప్రతి వ్యక్తియొక్కయు బుద్ధిని, శక్తిని, పటుత్వమును వికసింపజేయువిద్య శైశవమునుండియే ప్రారంభింపవలసియున్నది. అనగా సుమారు రెండవసంవత్సరమునుండియు విద్యను నేర్పు మనబాలురు నూతనాభిప్రాయముల ననుసరించి మూడవయేటినుండియే యాత్మవికాసమునందవలసి యుండును. ఇట్టి విధానమున నుపాధ్యాయపదవి స్త్రీలపై నెక్కుడుగ నాధారపడియుండును. దీని కనేక కారణములు గలవు.

మానసికతత్త్వవేత్తలలో స్త్రీ లగ్రగణ్యులు. స్వాభావికముగనే వారలకు మనఃపరిణామమునందలి వివిధమార్గములును, తత్కారణఫలితములునుఁగూడ సుగ్రాహ్యములుగ నుండును. తల్లిగను, ప్రౌఢగనుగూడ స్త్రీ మానసికావస్థలను బరీక్షించి సాధనాంతరములచే వానిని నియమించుచుండును. తనబిడ్డ కేసమయమునం దేమికావలసియుండునో ముందుగనే నిర్ణయింపగల్గు తల్లియు, ప్రియుని మనమును గ్రహించి తదనుగుణ్యముగ బ్రవర్తించి క్రమముగ దానిని స్వాధీనమొనర్చుకొను ప్రౌఢయు నిందుకు దార్కాణములు.

విద్యగఱపునెడ గృహిణీత్వము స్త్రీలకు పురుషులకు లేని యవకాశముల నొసంగుచున్నది. పురుషులకు పాఠశాలలలోదప్ప నితరసమయములలో బాలబాలికలతోడి సాంగత్యము గలుగదు. గృహమునఁగూడ ననేక కార్యాసక్తుడగు దండ్రికంటె సర్వాధికారిణియై సదాప్రసన్నయైయుండు దల్లితోడనే పిల్లలకుఁ బరిచయాభిమానములు మెండుగనుండును. దానఁజేసి యామె మాటలను వారలు సాదరముగను, సగౌరవముగను గ్రహింతురు. అదియునుగాక సహజముగ స్త్రీలకు సరళమగు హృదయమును, చక్కని సానుభూతియు నుండుటచే వార లితరుల ఇష్టానిష్టముల నతిసులభముగ గుర్తింపగల్గుదురు. ఇటుల గృహమే మానవజీవితమునందలి ప్రథమ పాఠశాల. స్త్రీయే ప్రథమోపాధ్యాయిని.

సాధారణముగ శిశువులకు మూడవయేట జ్ఞానోదయమగునదియు నప్పటినుండి ప్రతిక్షణమును వార లనేకవిధముల బ్రపంచతత్త్వమును గ్రహించుచుందురనియు తత్త్వవేత్తల యభిప్రాయమైయున్నది. ఈబాహ్యప్రపంచమునందలి చేతనాచేతనవస్తువులన్నిటినిగూడ మనము పంచేంద్రియముల మూలముననే తెలిసికొనుచున్నాము. మనతో నింద్రియమూలమున సంబంధించు ప్రతివస్తువును మనమనస్సులలో నొకవిధమగు చిహ్నము నేర్పఱచి యొకవిధమగు నుద్రేకమును (Feeling) కలిగించును. అట్టిది తృప్తికరముగ నుండినచో కరచరణాద్యవయవముల మూలమున మన మా వస్తువులను విశేషముగ నాదరింతుము. లేనిచోఁ బరిత్యజింతుము.

ఈ విధమున వస్తువులకు, వానివలన మనకగు సుఖదుఃఖములకు నొకవిధమగు సంబంధమేర్పడి వస్తుతత్త్వము మనకు గ్రాహ్యమగును. ఇదియే మానవులు నేర్చెడి ప్రథమవిద్య. దీని కింద్రియములే ముఖ్యసాధనములు. సర్వేంద్రియములును పూర్తిగ నభివృద్ధినందినచో మనజ్ఞానము సర్వతోముఖముగనుండి మనమును సర్వవిధముల నభివృద్ధి నందింపగలదు. ప్రపంచమునందలి మన జీవితమే యింద్రియవ్యాపారములపై నాధారపడియుండినప్పుడు, విద్యావిషయమున వేఱుగ చెప్పనక్కరలేదు. కావున ప్రతిశిశువునకును మూడవసంవత్సరము నుండి యాఱవసంవత్సరము వరకును గలకాలమున నింద్రియపటుత్వము నభివృద్ధిపఱచి తన్మూలమున బాహ్యవస్తుజ్ఞానము నభివృద్ధిపఱచుట ముఖ్యావసరమై యున్నది. ఈసందర్భమున వారి కితరసాహాయ్య మవసరము. రంగులయందును, శబ్దములందును గల భేదములను, వస్తువుల యాకారమును, శీతోష్ణములను చక్కగ గుర్తెఱిగి వానిని సరిపోల్చుటయే పిల్ల లీ సమయమున నేర్చవలసిన విద్య. ఇట్టి విద్యను గఱపువారలకు శాంతము, సానుభూతి మున్నగు సద్గుణములును శిశువుల యందభిరుచియు ముఖ్యముగ నుండవలెను. మాతాశిశువులకుఁ బరస్పరప్రేమను మించినది మఱియొకటి లేదు. కాన మానవజీవితమునకును, జ్ఞానాభివృద్ధికిని మూలస్తంభమగు నీనైంద్రియజ్ఞానము నొసగూర్చునెడ స్త్రీలే యర్హతములు. ప్రకృతి తమయందారోపించిన ఈకర్తవ్యమును స్త్రీలెల్లరును గ్రహింపవలసి యున్నది. ఫ్రొబెల్, మాంటెస్సోరి మున్నగు విద్యాసంస్కర్తలీసూత్రముల నాచరణలోనికిఁ దెచ్చుటకై ప్రత్యేకపాఠశాలలను నిర్మించి స్త్రీలనే వానియం దుపాధ్యాయినులుగ నియమించియున్నారు.

పాఠశాలలలోగూడ ప్రైమరీతరగతివరకును విద్యనేర్పుటకు స్త్రీలే తగినవారు. ఇచటనే పిల్లల శీలము లేర్పడును. ఈతరగతుల యందలి విద్య విద్యార్థుల యాదరమునకుఁ బాత్రమైయుండవలెను. వారికేవిషయముల నుత్సాహ మెక్కుడుగనుండునో యట్టి విషయములనే వారలఁ బ్రవేశింపఁజేసి క్రమముగ నాయుత్సాహము నితరవిషయములకుఁ బ్రసరింపజేసి వారి జ్ఞానము నభివృద్ధిపఱచుట ఇచ్చటి యుపాధ్యాయులకు కర్తవ్యము. దీనితోపాటుగ పిల్లల కుత్కృష్టాదర్శములను గల్పించి తన్మూలమున వారి శీలమునుగూడ సన్మార్గగామిగ నొనర్పవలసియున్నది. కథలనినచో బాలబాలికల కభిరుచి మెండుగ నుండును. తన్మూలమున వారి యభిరుచిని జీవచరిత్రములకును, చరిత్రమునకును మరలించి వారలకు దేశచరిత్రమును బోధించి యందలి యాదర్శపురుషుల జీవితములను వారలనుగమించునటుల ప్రోత్సహించి వారల శీలమునుగూడ నేర్పఱుప నవకాశము గలుగుచున్నది. ఈసందర్భమున నుపాధ్యాయులు ప్రతివ్యక్తియొక్కయు మనఃపరివర్తనము నుపలక్షించి తమ బోధనమును దానికి సరిచేయవలసి యుండును. కాన నిట్టి శిశుమానసాకర్షణ విద్యాంకురార్పణాది కార్యముల స్త్రీలే యప్రతిమలు. ప్రైమరివిద్యాబోధనమునకు గూడ వారలే తగినవారు.

మన దేశమునం దొకనూతనయుగ మారంభమయినది. జీవితమునందలి ప్రతిరంగమునందును పరివర్తనములొదవుచున్నవి. వానియందెల్ల స్త్రీలెక్కుడుగ పాల్గొని తమ వ్యక్తిత్వమును స్థిరపఱచుకొనుచున్నారు. విద్యావిధానము దేశమున కాత్మవంటిది. ఆత్మపరివర్తనము లేనిదే భౌతికపరివర్తన మెంతయుండినను నిష్ప్రయోజనము. కావున మన విద్యావిధానమును సంస్కరించు టత్యంతావసరమైయున్నది. ఇతర సంస్థలకన్న నీవిషయమున నెక్కుడుగ పాల్గొనవలసిన బాధ్యత స్త్రీలపై నున్నదని ఈవ్యాసమున నిరూపించియుంటిమి. తమ బిడ్డల పురోభివృద్ధినిఁ గోరు గృహిణులును, ఉన్నతవిద్యాభ్యాసమొనర్చి యుత్కృష్టాదర్శములుగల సోదరీమణులును శిశుపరిణామతత్త్వమును తెలిసికొని, నవీనములును మనశ్శాస్త్రసమ్మతములునగు పద్ధతులపై దేశీయవిద్యను సాగించు నుద్యమమున తప్పక పాల్గొనవలసియున్నది.

# అరుంధతీవిషాదము

శ్రీ పి. ఆంజనేయులుగారు

పేరరుంధతి; పుట్టినయూరు గుత్తి;
తండ్రి కలుములచెలిదొర; తల్లి లచ్చి;
మగఁడు మధుపాయి; బిడ్డలు నెగడువారు;
ఒంట నొకపూసలే; దింట గొంటునున్న.
కడిమివేసవరై తింటఁ గసవుచిమ్మి,
కాఁపుకొట్టాన వడిఁ బేఁడకళ్ళుద్రోసి,
వెలమదొరపాలమ్మున మేలికలుపుదీసి,
యువలఁ బోలిసెట్టియింట బియ్యంబు దంచి,
మరల బీఁనుపట్టుల మునిమాపుదనుక
గటికచెక్కి, యద్దానిఁ జిక్కమునవించి
తెచ్చి, చీఁకటిపడుదాఁకఁ దిరిగి యూర
నొక యణాకమ్మి, కోమటింటికిఁ జనంగ,
సెట్టి రూకచేకొని, యిది చెల్ల దనుచుఁ
బొఱవైచె, నెవ్వఁడో యొకపాలసుండు
పిక్కసేయుటగని, యేది దిక్కటంచు
వనటఁ బొందుచు, నిలుసేరవచ్చినాను.
నిదురకన్నుల నన్నంటి నినుఁగులెల్ల
తిండి లేకున్కిఁ గడుపులు మండి కుములఁ
గాంచుచుండియు, నినుమంత కబళమేనిఁ
బెట్టఁ, జేయాడ లేదొక్కపెద్దకైన.
మాకడను బనులెల్ల సమ్మతిని గొనుచు,
నవలఁ గన్నెత్తిచూడ రావంతకరుణ;
నేమొనర్చిన దుష్కృతి కేదికతమొ?
మాలకోలమునఁ బొడమురే మూలమగునొ?
ఇటులె మాకులమునఁ బుట్టి, యెమ్మెలెనయ
నితరమతములచెల్వ మెక్కింతకొనిన,
క్రైస్తవాదులఁగాంచు చొక్కంపుఁ గనుల
నరయ రేలకో? హైందవసరణిఁ జనమొ?
ఇఁకను రాఁడయ్యెఁబతి; చెల్లె నేమొ డబ్బు!

కొలుచు లేదింట; బుడుతలగోల హెచ్చె;
రాత్రిమీఱెడు; నికఁ బ్రోయిరాచనైతి;
తమియెసంగెను; ప్రమిదకుఁ జమురులేదు.
గుండె పగిలెడు బిడ్డలగోడుఁ జూడ;
అప్పుపుట్టదు; లేరెవ్వ రాదరింపఁ;
గాఁపుకడ-దొరకడ-సెట్టికడను-వడ్డి
కాసులైనను దీఱ వేకాలమునకు.
లబ్బె* యిప్పుడెవచ్చి, యుల్లరియొనర్చి
పోయె; తనకీయఁ దగినయప్పునకుఁ గొంప
చాలదని పెద్దరైతు రోసమున నెడలె;
నెట్టు లీరాయిడిని భరియించుదాన?
ఊరకయు భీతిహెచ్చెడు; నొక్కమొగిని
కడుపులోఁ జేయిదూరిచి కలఁచినట్లు
సంకటము మీఱు; నా విభుజాడఁ దెలుప
రేరు; నేఋణదాత భంగింపఁగనెనొ!
వెళ్ళి చూచెద నిపుడ; యూవీథిచివర
వెలఁదు లొలయుచు వెలుఁగుననిలిచి, మిపుల
సంభ్రమముఁబొందువార; లాసడికి నెద్ది
కారణమొ? వైళమునఁబాసి, కాంతుఁగాక.
కొలఁదిరొఱుఁగక త్రావి యాగోతియందుఁ
గూలి, గుండెప్రీల నుసురుఁగోలుపోయి
రెవ్వరో! కాదు—హా! యింక నేది తెరువు?
చనియె నాభర్త! నాదు జీవనపుఁగర్త!!
అక్కటా! యిట్టిఘోరదుఃఖానలమున
నేను బుగ్గియౌదునటంచు నెంచనైతి;
ఘనసురాపానభూత మొక్కటియు, నాదు
మేలిగొనములరాసికి మృత్యువయ్యె.
ప్రాణనాథుని నెడఁబాసి; పడఁతి యవలఁ

* మహమ్మదీయుఁడగు తోళ్ళవ్యాపారి.

గడించి జీవితవిజయమ్ముఁ గాంచఁగలదె?
కాదె యాత్మేశుతోడి లోకంబు నతికి
శాంతిదము-ధర్మయుక్తము-సౌఖ్యకరము?
అరుగుదాసను మిముఁబిడి యన్నలార!
కాను నేనిఁకఁ దల్లిని; కన్నసంతుఁ
గాఁగఁ జూచెడు మాతలుగలరు; కొనుఁడు
వారి కూరిమిమేల్మి నవారి గాఁగ.
అర్థమునకును నీతికి నాయఁ వునకుఁ
దొలఁచి, లోకంబు ముప్పునఁద్రోయఁజాలుఁ
బెనుపిశాచంబనంగ నొప్పినదిగాన.
మదిర మెదఁగదియింపక పొదలుఁడీరు.
మీపురోవృద్ధి నడఁగించి మిమ్మునెందు
నంటరానివారినిఁ గను నలఁతులఁ గను
జేసె గోవధ-యఘములరాసి, దానిఁ
గని, యహింసావ్రతమ్మునుగొని మనుండు.
అనిశమును గాయశుచిఁ గనునాత్మశుద్ధి
నలరి, యార్యులుచూపినయట్టి పథము
నంటి హిందూమతాభిమానాభిరతిని
నెనసి, యాంధ్రలక్ష్మిసేవఁ గనుఁడు సుగము.
ఆంధ్రగృహలక్ష్మిగార! నాయాత్మశాంతి
తనరు నిరతంబు మీమహోదరవుఁగల్మి;
ననదలగు నాదుసుతుల మీహస్తకోటి
నునిచి, చనుచున్నదాన నెట్లోమఁ గలరో?

## మా చిట్టిపలుకులు

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

ఏమిరాగమొ? తాళమొ? యెరుగకున్న
బాడుచున్నది తెలియనిబాసనయిన
హాయిమనిపింపదే శ్రవఃప్రేయమగుచు
చిత్తమలరించు భవ్యసంగీతమెపుడు?
కూసినదె కూయుచున్నను గూల కర్థ
మించుకయు బోధపడకున్న నేమిగోటు?
మనసురంజింపదే? మధురఫణితి
గూజితం బొనరించెడి కోకిలంబు?
పొదలు వెన్నునిపొక్కిటపువ్వుగాన్పు
పదనమున దొల్తవెలువడ్డ మొదటినుడుల
భావమెఱుగగ రాకున్న బ్రమదమిడవె?
శ్రుతిహితస్వరశబ్దసంయుతములగుచు.
పదము లస్పష్ట, మర్థసంపదయు నేమి
కుదురకుండిన నద్దాన గొరతయేమి?
తొట్టిలో నున్న మాచిట్టితొక్కునుడుల
బుట్టతేనియకాలువ లుట్టిపడవె?

## నలుగుపాట

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి. ఏ; బి. యల్.

నలుగు పెట్ట రమ్మ
చెలులు సీతమ్మకు
పసుపు పచ్చగరాసి
బంగారు పందిట్లొ—నలుగు.
బాజాలు తూతూలు
వాయించమనిచెప్పి
పన్నీరు లత్తర్లు
పరిమళంబులతోడ—నలుగు.

చెక్కులపై దృష్టి
చుక్కను తగిలించి
కళ్యాణతిలకంబు
కమ్మగనుంతాము—నలుగు.
ఆశీర్వాదములతో
అక్షతల్ జల్లుచు
దేవి మాహేశ్వరిని
దీవనల్ వేడుచు—నలుగు.

*

*　*

# శీలవతి



విద్వాన్
నూరిగుచ్చి
కృష్ణమూర్తి గారు

*

*　*

పడఁతివై విశ్వవిద్యాలయపట్టములందియు, అధికారమునను అర్థమునను అతిశయితవడసియు నీపదవికి నీవ సాటియయ్యు బహిరభ్యంతరముల నాడంబరరహితమగు జీవితముగల నీవు పరమపవిత్రవు. ధన్యవునగు మాతృదేవతామూర్తివి.

అభ్యసించినది ప్రతీచీవిద్యయయ్యు నీయెడ మూర్తీభవించినవి ప్రాచ్యసాంప్రదాయములు. చేసెడిది దాస్యమేయయ్యు పదుగురకుఁ జేకూర్చుచున్నది విజ్ఞానము. వైరాగ్యము మూచూడని యూవనవతివయ్యు జీవితము క్షణికము, నశ్వరము లైశ్వర్యములనియెడివి నీభావములు.

అధికారపూరితములగు నీదృక్కులలోఁ గరుణామృతస్రావము గనుంగొనఁజాలనివ్యక్తి యధన్య. సారవంతములగు నీయుపదేశములు పురోభివృద్ధికాంక్షులకు అవశ్యగ్రాహ్యములు. అర్థవంతములగు నీయాదర్శములు అందఱకు ననుసరణీయములు. విద్యైకమాత్రభూషణముగల నీమూర్తి మాతృభక్త్యుత్పాదకము.

విద్యావతి, శాంతమతి, సహనశీల, విజ్ఞానవతియునగు తనూజాతను జూచికొనుచు మురియుచు గృహము నిత్యకల్యాణము పచ్చతోరణముగ భావించికొనుచుండెడి నీముదుసలిజనకుఁడు ఇతోధికబ్రహ్మానందము కలనైన గాంచఁజాలఁడుగదా.

సీతాసావిత్రులను దలఁపించెడి నీపవిత్రవర్తనము, ఘనాలీలావతుల మఱపించెడి నీవైదుష్యము, ప్రాక్తనభారతీయపురంధ్రులకుఁ బెట్టని యాభరణమగు నీసహనశీలమును, తల్లీ! భారతమాతృభాగ్యోదయాభివృద్ధిసూచకములు. మాతృస్వరూపిణీ! నమస్కారము. ఇతోధికమగు నాయురారోగ్యైశ్వర్యముల నీశ్వరేశ్వరుఁడు నీకుఁ బ్రసాదించుఁగాక!

# సతీధర్మము

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

మానవకళ్యాణసాధనిర్మాణమునకు సతీధర్మము గొప్పపునాదిగా నున్నయది. ఇదెంత దృఢముగా నున్నదంతశాశ్వతముగా నీకళ్యాణసౌధము నిలచియుండును. అట్లు సంరక్షింపక యుపేక్షించుచో నీసౌధము పునాదిసడలిన మేడవలె నేలఁగూలును. కావుననే ప్రాజ్ఞులిట్లు తెలిపియున్నారు: "యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రసంపదః। యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః। శోచంతి జామయోయత్ర వినశ్యత్యాశుతత్ కులం। నశోచంతి యత్రైతా వర్ధతే తత్కులం సదా॥" అని.

మఱియు సతీత్వము దోషదూషితమగుచో మానవోన్నతి మటుమాయమగునని, వ్యాసమహర్షి తెలిపియున్నాఁడు. "స్త్రీషుదుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః। సంకరో నరకాయైవ కులఘ్నానాంకులస్యచ" అని.

మానవుఁడైహికానందసంపన్నుఁడై, ధర్మమార్గమునఁ బ్రవర్తించి, ముక్తినిఁబడయఁగోరుచో సుగుణాలంకృతయగుసతిని కరగ్రహణ మొనర్పవలయును. కాంతిలేకున్న నేత్రభాగ్యము వ్యర్థమగుకరణి, కాంతలేకున్నఁబురుషసంపద నిరర్థకమగును. కావుననే "సంపన్నరమణీ శ్రీలా సంపన్నరమణీంవినా। ఇత్యూహ్యైవ వాన్న రమణీ రమణీం రుక్మిణీం హరిః॥" అని తెలుపఁబడినది. అనఁగా సుగుణసంపన్నయగు కులకాంత చెంతలేకున్న సంపద సమకూరనేరదని, పురుషోత్తముఁడగు శ్రీకృష్ణుఁడు రుక్మిణీరమణీమణినిఁ బెండ్లియాడెనని భావము.

సమస్తాశ్రమములలోను గృహస్థాశ్రమము మూర్ధన్యమై వెలయుచున్నయది. ఇందులకుఁ గారణమేమి? భక్తివైరాగ్యములతోఁ బతిధర్మములకుఁ బ్రోత్సాహినియై, సర్వసౌఖ్యముల కాలవాలమై, వెలయు కాంతారత్నము కళత్రముగా సమకూరుటయే. "భార్యామూలం గృహస్థస్య భార్యామూలం సుఖస్యచ। భార్యాధర్మఫలావాప్త్యై భార్యాసంతానవృద్ధయే॥ గృహాశ్రమాత్పరోనాస్తి యది భార్యాసతీవరా" అని పెద్దలు తెలిపియున్నారు. అనఁగా గృహాభివృద్ధికిని, సంతోషప్రాప్తికిని, ధర్మఫలాప్తికిని, సంతానవృద్ధికిని, భార్య ముఖ్యసాధనమనియు, గృహస్థాశ్రమమును మించిన యాశ్రమము లేదనియు భావము.

సతీలలామయగు కాంత యర్ధాంగిగాఁ జేకూరుటకుఁ బురుషుఁడెంతయో పుణ్యాత్ముఁడుగా నుండవలయును. "గృహే గృహే వకిం నార్యో రూపలావణ్యగర్వితాః। పరంపుణ్యవశేనైవ లభ్యతే స్త్రీ పతివ్రతా" అనఁగాఁ బతివ్రతయగు నిల్లాలు దొరకుటకు పూర్వపుణ్యమే హేతువు అని భావము.

ఈభావమునే భవభూతిమహాకవి యిట్లు వర్ణించియున్నాఁడు; "అద్వైతం సుఖదుఃఖయోరనుగుణం సర్వాస్వవస్థాసుయద్విశ్రామో హృదయస్యయత్ర జరసాయస్మిన్నహార్యోరసః। కాలేనావరణాత్యయాత్ పరిణతేయత్ స్నేహసారేస్థితం భద్రం ప్రేమసుమానుషస్య కథమప్యేకం హితత్ ప్రాప్యతే॥" అనఁగా నెయ్యది సుఖదుఃఖముల సమభాగమై వింపుఁగొలుపుచుండునో, మఱియెయ్యది సర్వావస్థలఁ దోడునీడయై తేజరిల్లుచుండునో, ఇఁక నెద్ది చిత్తవిశ్రాంతి నొసంగి శోభించుచుండునో, యెయ్యది ముదిమిచే నపహరింపరాని ప్రేమతళుకొత్తుచుండునో, యెద్ది కాలము గడచిన కొలఁది పరిణతస్నేహరసభాసురమగుచుండునో, యేది కళ్యాణదమో, మఱియెయ్యది యద్వితీయమో యట్టి మనోహరమగు కళత్రప్రేమ యతికష్టముపై, నేపుణ్యాత్మునకో లభ్యమగును అని భావము.

ఈయర్థమునే కాళిదాసుఁడిట్లు తెలిపియున్నాఁడు: "అఖండం పుణ్యానాం ఫలమివచతద్రూపమనఘం" అనఁగా నెవ్వఁడో యమేయపుణ్యఫలసంపన్నునకు నట్టి పావనసౌందర్యవతి యగు కాంత లభ్యమగునని భావము.

సతీవిరహితునకు సంసార మంధకారబంధురమగు నరణ్యమువంటిదే యగును. "సతి ప్రదీపే సత్యగ్నౌ సత్సుతారామణీందుషు। వినామే మృగశాబాక్ష్యా తమోభూతమిదం జగత్" అనఁగా ధన కాంతు



శ్రీమతి జోరినా కన్య : సినీమా నటి

లెన్నియున్నను సుకాంతలేనున్నచో జగమంతయు నంధకారముగా మారునని భావము. సతీసహితుఁడగు మానవునకు నడవి నాకముగా భాసిల్లును. "కాంతారేష్వపి విశ్రామో జనస్యాధ్వనికస్య వై। యస్య దారస్య విశ్వాస్య స్తస్మాద్దారాః పరాగతిః॥ అనుకూలకళత్రో యస్తస్య స్వర్గ ఇహైవహి" అనఁగా సతీసహితునకు నరణ్యమునందుఁగూడ సౌఖ్యము చేకూరుననియు, భార్యాసహితునే జనులు విశ్వసింతురనియు, బతికి గతి సతియేయనియు, సత్కళత్రవంతునకు స్వర్గసుఖ మీలోకముననే సంప్రాప్తమగుననియు భావము.

కష్టకాలముల ధైర్యోత్సాహముల నిడక, స్వసుఖముల నరకుసేయక, తమ వారల కానందము సమకూర్చుటకై సంగీతసాహిత్యాదికళలఁ బ్రదర్శించుచు, సమయానుసారము పతులకు హితములఁ దెలుపుచు, ఇటుల నిజజీవితాదిసర్వసంపదల నొసంగి, తమనాథుల నిజానురాగనౌకలపై దుఃఖసాగరములనుండి దాటించి కృతార్థలైన సతీమణు లెందఱో భారతమాతృగర్భమున జనించియున్నారు. కనుఁడు.

మృచ్ఛకటికయందుఁ జారుదత్తుఁడను నాయకుఁడు వాణిజ్యనైపుణ్యముచే దరిద్రుఁడై వసంతసేనయను వారకాంత తనచెంత దాచనిచ్చిన యలంకారములను చోరులపహరింప, లోకులు తన్ను దూషింతురనియు, లోకనిందల వినుటకంటె మృతిచెందుటే మేలనియు, నిటుల వేశ్యకు విత్తమొసంగ నేరక, విచారించుచున్నతఱిని సాధ్వీలలామయగు సౌభాగ్యశాలిభార్య తనకంఠమునను న్న యమూల్యమగు రత్నహారమును దన నాథునికడ కంపఁగ, నాతఁడు మొదట నిట్టు భార్యచేఁ గరుణింపఁదగిన దశకు వచ్చితినిక దాయని విలపించి, పిమ్మట నిట్లు సంతసించెను. "అథవా నాహం దరిద్రః యస్య మమ విభవానుగతా భార్యా" అని తన్ను గొప్పభాగ్యవంతునిగా నెంచుకొనెను.

కోటీశ్వరునకుఁ గొమరితయగు నిందిరయను నొక వణిక్సతీతిలకము కుష్ఠరోగియగు భర్తకు దివారాత్రములు ఏమరక దాస్యముచేయుచు నొక నిశీథమున నిజనాథుని దుర్భరవేదనలం జూడఁజాలక దయామయుఁడగు శ్రీరామచంద్రుని మానసమున నిడుకొని, భక్తినమెలుక వీణాగానమొనర్చుచు భక్తిపారవశ్యముచే దేహమెఱుంగక యున్నతఱి భక్తవరదుఁడగు శ్రీరాముఁ డాసాధ్వీమణి పావనపాతివ్రత్యభక్తులకు మెచ్చి యటకువచ్చి యామెపతి భర్త కారోగ్యమొసంగి యంతర్ధానమయ్యెను. ఇట్టి పుణ్యకథలెన్నియో మన యార్యసారస్వతమునఁగలవు.

సతీమణియగు కాంత పతిప్రేమ కగ్రస్థానమును, సుతప్రేమకు ద్వితీయస్థానమును నొసఁగును. కావుననే దమయంతి నిజసంతానము వెంటఁబోవక పతితో నడవులకేగెను. పుత్త్రాదులకంటె సతికి పతియే ప్రియతముఁడు దైవసమునునై యున్నాఁడు. "నపితా నాత్మజో నాత్మా నమాతా నసఖీజనః। ఇహ ప్రేత్యచ నారీణాం పతిరేకోగతిస్సదా" అని వాల్మీకి మహర్షి తెలిపియున్నాఁడు. పతిసౌఖ్యమును మించి పతివ్రత కోరఁదగిన హృద్యవస్తు వీజగత్త్రయమునను వేఱొండు కానరాదు. "సుతం పతంతం ప్రసమీక్ష్య పావకే నబోధయామాస పతిం పతివ్రతా। పతివ్రతా శాపభయేన శంకితో హుతాశనః చందన పంకశీతలః॥" అనఁగాఁ బతిసేవాపరాయణయగు పతివ్రత యగ్నిలోఁ బడనున్న సుతునివిపత్తిని సరకుచేయదాయెననియు, ఆపతివ్రతాశాపభయముచే నగ్ని మంచిగంధమువలెఁ జల్లనాయెననియు భావము.

సతీమణుల ప్రభావము లత్యాశ్చర్యజనకములు. కన్నెత్తి పాపపుతలంపుతో వీరింజూడ శక్యము కాదు. నలుఁడు దమయంతి నొంటరిగ వీడుచు నిట్లనియెను: "నచైషా తేజసా శక్యా కైశ్చిద్ధర్షయితుం పథి। యశస్వినీ మహాభాగా మద్భక్తేయం పతివ్రతా॥"

సాధ్వీమణియగు నొక ద్విజకాంత యాకటిబాధతో దనవాకిట నిలచియున్న దైవసముఁడగు బ్రహ్మచారిని బ్రథమమునఁ బూజింపక, నిజపతిసేవానంతరము వానికి మధుకరమిడఁబోవ నావటుఁడు ఆమె

జాగుసేతకుఁగినిసి నేత్రము లెత్తిఁజేసిచూడ ఇట్లు పలికెను: "నాహం బలాకా విప్రేంద్ర............" అనఁగా "నోద్విజమాలీ! నేఁబక్క కొక్కెరనుగానుసుమీ!" ఈయుపాఖ్యానము భారతమున కలదు.

రత్నచూడుఁడను గంధర్వుఁడు పద్మావతియను సాధ్వినిఁజూచి మోహితుఁడై, యామెపతివ్రతాశిరోమణియని తెలిసియు, కామాంధతచే నొకనాఁడాసాధ్వి విగతవస్త్రయై కొలనిలో స్నానముచేయుచున్న సంగతినివిని, యాకసమునకెగసి యాపుణ్యాంగనను జూడఁబోవ వెంటనే కండ్లురెండును గ్రుడ్డివయ్యెను. నారదుఁడు వానిఁజూచి జాలిచెంది, వానితో పర్ణశాలకేగి, సీతాస్నానపుణ్యోదకయగు గోదావరిలో స్నానముచేసినఁ గండ్లువచ్చునని యుపదేశింప, వాఁడట్లు పర్ణశాలకుఁబోయి గోదావరిలోమునిఁగిన వెంటనే యంధత తొలఁగెను. ఇప్పటికిని 'గ్రుడ్డిమెట్ట'యను దిబ్బ యటఁగలదఁట.

సతీలలామల చరితము లెంతవినినను తనివితీరదు. వినుకుపుట్టదు. రుచితగ్గదు. కావుననే "ఆదిత్యస్యోదయం రాజన్ సువర్ణం భారతీకథాః! సాధ్వీభార్యా సుమిత్రంచ అపూర్వాణి దినేదినే॥"అనగా(1)సూర్యోదయము. (2) సువర్ణము, (3) భారతకథలు, (4) సాధ్వియగునిల్లాలు, (5) సన్మిత్రుఁడు నిత్యసుందరములగు వస్తురాజములని భావము.

సనాతనసతీచరితములఁ బరిశీలించి చూచినచో స్త్రీల హృదయముల నిండియున్న ప్రేమకును, పురుషుల హృత్కరండముల నిమిడియున్న స్నేహమునకును హెచ్చుతగ్గులున్నట్లు పొడగట్టును. కావుననే "ఆశాబంధః కుసుమసదృశం ప్రాయశోహ్యంగనానాం సద్యః పాతిప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి॥" అని స్త్రీల ప్రేమనుగూర్చి కాళిదాసుఁడు ప్రశంసించియున్నాఁడు. పతివ్రతా నియమముల దెలకించినచో నీభావమే పొడగట్టుచున్నది. కనుఁడు, "ఆర్తార్తే ముదితే హృష్టా ప్రోషితే మలినాకృశా। మృతే మ్రియేత యా పత్యౌ సాహిజ్ఞేయా పతివ్రతా.॥"

ఈలక్షణములు పురుషులవిషయమున వివరింపఁబడియుండలేదు. మఱియుఁ బ్రేమకు నిజమగుస్థానములు స్త్రీల హృదయములేయని చెప్పనగును. తల్లులు తమపిల్లలకై యెట్టిత్యాగమునైనఁ జూపుదురు. కావుననే యొకమహాకవి యిట్లు తెలిపెను. "శక్తశ్చాహం పరిగణయితుం వ్యోమ్ని నక్షత్రమాలాం। శక్తశ్చాహం పరిగణయితుం వారిబిందూన్సముద్రే। శక్తశ్చాహం పరిగణయితుం సైకతే రేణుపూరాన్। నాహం శక్తః పరిగణయితుం మాతృకుక్షౌ దయౌఘం॥" అనఁగా నక్షత్రజాలములను, సముద్రోదకబిందువులను, ఇసుకనలుసులను లెక్కింప సాధ్యమగును కాని మాతృగర్భమున నిండియున్న ప్రేమనుగణింపఁ దరముకాదు అని భావము.

మాతృస్థాన మింతఘనమై, యింతటిపావనమై, వెలయుచుండుటచేతనే "నమాతుః పరదైవతం." తల్లిని మించినదైవతము వేఱెద్దియులేదని పెద్దలు బోధించియున్నారు.

తమ సంతానమునిట్లు ఘనముగాఁ బ్రేమించుట యొక్క మానవజాతిస్త్రీలయందే కాక పశుపక్ష్యాది తిర్యక్స్త్రీసంతతులయందుఁగూడ ప్రత్యక్షమగుచున్నది. కనుఁడు: అప్పుడే ప్రసవించిన యొకయాఁడులేడి యాఁకలిబాధకు నోర్వఁజాలక తనశిశువుల నొకచెట్టుక్రిందనిడి యాహారార్థ మరణ్యమధ్యమునకేగ నొకబోయి దానిం జంపఁబోవ నామృగాంగన యానిషాదునిట్లు ప్రార్థించినది: "ఆదాయ మాంసమఖిలం స్తనవర్జ్యమంగాత్ మాంముంచ వాగురికయామి కురుప్రసాదం। సీదంతి శష్పకబళా నభిజ్ఞా మన్మార్గ దత్తనయనా శిశవో మదీయాః॥" అనఁగా ఓ బోయనాయకుఁడా! నాపొదుగును విడచి నా దేహమునయున్న మాంసమునంతను గోసి దీసికొని, దయయుంచి నన్ను విడువుము. పోరుచ. ఎందుకిట్లు ప్రార్థింతునందువా? ప్రస్తుతము నాపిల్లలు గడ్డిపరకల స్వయముగాఁ గొఱుకనేరవు, సరికదా, దయామయులు కోసి నోటికందిచ్చినను తిననేరవు. పాప మా పసికూనలు నాదారివైపు చూపులసారించి, నారాక కాతురపడుచుండును, అనిభావము.

పతిని వినా సతీమణి సుఖములఁబడయఁగోరదు. సాధ్వీలలామయగు దమయంతీజీవితమును వినుఁడు: ఈసుకుమారగాత్రి భర్త తన్ను పుట్టినింటికేగి సుఖింపుమని యెన్నివిధముల బోధించినను వినక, నలునితో వడ పులకేగి యరణ్యమధ్యమున నర్ధరాత్రమునఁ దన్నువీడి తనదారిఁదేగఁ గొంతవడికిఁ బ్రబుద్ధయై నిజకాంతునిఁ గానకేరక యిట్లు విలపించెను: "నశోచామ్యహమాత్మానం నచాన్యదపికించన। శ్రాంతస్య క్షుధార్తస్య పరిమ్లానస్య నైషధః। శ్రమం నరశార్దూల నాశయిష్యతి మాం వినా" అని మృగయానక్తిచే నెండయనక, వానయనక సదా యరణ్యములఁదిరుగుట కలవాటుపడిన దృఢగాత్రుఁడగు నలుఁడు తన్నెడఁబాయుటచే విపిన మధ్యమునఁ గాసిచెందుననియు, దానున్నచో నట్టి శ్రమలేకుండుననియుఁ దలపోయఁ జొచ్చినది.

ఓహో! యీసాధ్వీమణి మానససరోజ మెట్టియనురాగామోదభరితమై వెలయుచున్నదిరో! తిలకింపుఁడు: అంతఃపురమున హంసతూలికలపై సంచరింప నర్హమగు తనమృదుపాదములు విపినవీథులఁ దిరుగుటచేఁ గంది పొక్కులెక్కుచున్న మాటనుమఱచి, నలునిగతి యేమగునోయని విలపించినది. ఇదికదా యవ్యాజానురాగలక్షణము! ఇయ్యదియేకదా సనాతనార్యసతీధర్మస్వరూపము!

ఆర్యదంపతుల కలయికలు ఇహలోకముతోనే ముగియక, పరలోకమునఁగూడ సమ్మిళితము లగుచుండును: "ఇహలోకేచ పితృభిర్యా స్త్రీయస్యమహామతే। అద్భిర్దత్తాస్వధర్మేణ ప్రేత్యభావేపితస్యసా" అని సీతాదేవి తెలిపియున్నది.

మన భారతదేశమున ధీరోదారులగు పుత్త్రులును, సద్గుణసంపన్నలగు కన్నియలును, సంతోషస్వాంతులగు సంసారులును సమృద్ధిగా సంభవింపఁ గోరికయున్నచో పురాణసతీమణుల పావనచారిత్రములఁ బఠనీయములుగా విరచింపఁజేసి దేశము నలుగడల వ్యాపింపఁజేయవలయును.

దేశాభ్యుదయమునకు సతీధర్మ సంరక్షణము ముఖ్యసాధనమనుటకు సందియము లేదు. కావుననే మన్వాదిధర్మశాస్త్రకారులు, సర్వప్రయత్నముల స్త్రీలు సతీధర్మముల జవదాటకుండునట్లు పాటుపడవలయుననియు, స్త్రీలు భావిసంతానాంకురోత్పత్తికి క్షేత్రములనియు, అట్టి క్షేత్రములు దోషదూషితములగునో వానియందు బయలుదేరు ప్రజాసస్యములుకూడ నీరసములగుననియు, అట్టిదుర్బలసంతానము సంఘవినాశహేతువగును కాని, సంఘౌన్నత్యమునకుఁ దోడ్పడఁజాలదనియు బోధించియున్నారు.

భారతభాగవతాదిపురాణగ్రంథములును నమూల్యములగు నుపాఖ్యానములతో నీసతీధర్మములఁ జక్కగాఁ దెలుపుచున్నవి. శ్రీమద్రామాయణమున వాల్మీకిమహర్షి మాటిమాటికి నార్యరమాగుణవైభవోన్నతిని ఘనముగాఁ బ్రశంసించియున్నాఁడు.

ఈవిధముగా మనమన్వాదిధర్మనిర్మాతలేకాక యనేకులగు పాశ్చాత్యపండితులుగూడ ఈయభిప్రాయమునే బలపరచియున్నారు. సావిత్రి, దమయంతి, వైదేహిలోనగు చంద్రవదన లెల్లరును నిజకీర్తిచంద్రికలచే నాచంద్రార్కముగ దేజరిల్లుచుండుటకు ప్రధానకారణము ధర్మశాస్త్రమర్యాదల జవదాటక, సతీధర్మములఁ బాటించియుండుటయేయని స్మరింపఁగోరుచున్నాను. కావున భారతసోదరసోదరీమణులెల్లరును సతీధర్మములఁ జెడకుండ సంరక్షించుచుఁ, దన్మూలమున మానవకళ్యాణసౌధమును శాశ్వతముగా నిలువఁబెట్టుదురుకావుతయని శ్రీ రామచంద్రునిఁ బ్రార్థించుచున్నాఁడను.

పాతివ్రత్యపరాః స్త్రియః ప్రసువతాం పుత్త్రాన్ప్రశస్తాశయాన్।
మార్గం దర్శిత మాశ్రయంతు మనుజా మన్వాదిభిః శ్రేయసే।
రాజానస్సత నిర్విశేషమధునా పశ్యంతు నిత్యం ప్రజాః॥
భూయాదవ్యభిచారిణీకలిహరా భక్తిశ్చ నారాయణే.

* * *

# మించు



ఆమెతలనుండి కుసుమమొకటి నేలరాలినది.— హృదయకుసుమమునందలి రేకొకటి తలవంచినది. —ఆమె ముకురమును సమీపించినది, ఫాలము నందలంకరించిన కుంకుమ సగము మాత్రమే నిలచి యున్నది.

ఇంతలో ద్వారముకడ చప్పుడు —తలుపులు తెరువబడినవి. అవనతముఖుడై ప్రాణవిభుడు గుఱ్ఱము నుండి దిగుచున్నాడు.—ఆమె దారితొలగి నిలచి నది.—పళ్లెరమున నీరాజనములేదు—పెదవులపై లేనగవునులేదు.

కొలది నిమిషములు గడచినవి. అతడు జలక మాడ నేగను.........పళ్లెరమున పసుపుముద్ద .........అడ్డముగా నులకమంచము —దేహము నందలి రక్తమంతయు తృటికాలము చల్లబడెను.— పిలచి ప్రశ్నించెను—'మురాడగువారమైతిమి వగ పేటికి జలకమాడనచ్చిచోటన్'—అనిజవాబు.

ఖడ్గతిక్కన తలయూచెను. జారిపోనున్న జయ లక్ష్మిని సాధింప వెనుదిరిగి వెడలిపోయెను.

రెండుగంటలు గడచెను.—అదిగో జయభేరి మ్రోగినది—ఆ మ్రోతయదరును ఆమెఫాలభాగము నందున్న సగము కుంకుమబొట్టు, నాటితో నేల రాలినది.

భారతరమణీమణులు ఏరమెరుగని అబలలని, పలుకువారి యజ్ఞానతిమిరమును పటాపంచ లొన రించుటకీసంఘటనమే యొకమించు.

చిరుమామిళ్ల
శివరామకృష్ణ
ప్రసాదుగారు బి. ఏ.

* * *

# భక్తి

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

దేవాలయమున విద్యుద్దీపములు దేదీప్యమానములై యుండ నిశ్శబ్దముగ భృత్యవర్గములు నియమితకృత్యముల నతిదీక్షతో నొనర్చుచుండెను. జగత్పతితోఁబాటు జగత్పతి నారాధించు భూపతికిని జామరాదికైంకర్యములు జరుగుచున్నవి. సువర్ణపుష్పములతోఁ బూజలు. ప్రణవప్రతిధ్వనులతోఁ బ్రార్థనలు. రాజాధిరాజు పూజచేయఁదలంపఁ గొదువయేమి? కాని రాజర్పించు నీభోగము లాదేవదేవుని హృదయమును గరఁగించినట్లు లేదు.

* * *

త్యాగశీలుఁడగు నొకభక్తుఁ డాత్మార్పణపురస్సరముగ దేవు నారాధించెను; పూజకువలయుఁ బరికరములు లోపించెను; భక్తుఁడు నేత్రపద్మమును బెకలించి దానిచేఁ బూజించి రక్తధారలను నివేదన మొనర్చెను. భక్తుని యీప్రదర్శనమునకు భగవంతుఁడు చకితుఁడైనట్లు తోఁచెను. ఏమి? త్యాగమునకా? కాదు. మఱిదేనికి?............... ఇట్టిత్యాగములా దయామూర్తియగు దేవదేవుని హృదయమును ద్రవింపఁజేయునవి?

* * *

రాగియు, రసపిపాసువునగు భక్తశిరోమణి యొకఁడు దేవుని పాదములపై వ్రాలి కన్నీరునించుచు "నాథా! ప్రాణనాథా! నిన్నేతప్ప యొండుప్రపంచమెఱుంగని నాపై నలుకపూనితివా? ఏదీ! నీప్రణయినిపై దయారసబిందువునైన వర్షింపుము. నాథా! తొల్లింటిప్రేమ నశించెనా? నాతప్పేమి కలదు? నాథా! ఉన్నచో నెఱింగింపుము. నీపై యదార్థమగు ననురాగము కలదో లేదో—నా యీహృదయమును జీల్చి పరిశీలించిన నీకే తెలియఁగలదు. అమృతము చిల్కునట్లు కాకపోయె—హాలాహలము చిల్కుచున్న నేగాని—యీయవమానమును సహింపఁజాలను. ఈవిరహమును భరింపఁజాలను." అని యుద్రేకించిన రాగమున "నీవు నన్నాదరింపకున్ననుసరే! నిష్కల్మషయగు నీప్రణయినికి నీయెడఁ గొంతయధికారముకలదు" అని యావిగ్రహమును గాఢముగ నాలింగనముచేసి కొనెను. ఆ యాలింగనసౌఖ్యములో నాభక్తుఁడు మైమఱచెను.

"ప్రేయసీ!" అనుపిలుపు మఱల నాతనికిఁ దెలివితెప్పించెను! అపలికిన దెవరు? ఆలయమున నల్గడల నాతఁడు పరికించెను. వేఱెవ్వరును లేరు. ప్రత్యక్షదైవమగు తన ప్రణయమూర్తి తప్ప—అంత మధురముగఁ దన్ను సంబోధించువారెవ్వరు? ఏమైనదో యెవ రెఱుంగుదురు? కాని దేవతావిగ్రహవిశాలవిలోచనములనుండి యమృతదృష్టులా భక్తునిపై—ప్రణయినిపై—ప్రసరించినవి. దరమందహాస మాచీకటిగుడికిఁ గొంత

వెల్లవేసినట్లయినది. ఇఁక భక్తునికిఁ గావలసినదేమి? "ధన్యోస్మి ధన్యోస్మి" అని యతఁడానందమున విలీనుఁడైపోయెను.

* * *

భోగమునకు, త్యాగమునకు లొంగని దేవదేవుఁడు పాషాణమయుఁడు ..హృదయపూర్వకమగు రాగమునకు లొంగిపోయెను. ప్రణయమునకు దాసుఁడు కానివాఁడు ప్రకృతియందు మృగ్యుఁడు.

భగవంతుని వశము చేసికొనుటలో—ప్రణయినిగా మాఱిపోవుటకంటె—భక్తునికి వేఱొకమార్గము లేనేలేదు. ప్రణయమే భక్తి. ప్రణయము లేని భక్తి యెన్నఁటికిని భక్తి కాఁజాలదు—నిజమగుభక్తి.........

## మానవతి

శ్రీమతి యలమంచిలి అచ్చమాంబగారు

తరుణీ! యెవ్వరిదానవమ్మ చలిలో దైనందినంబిట్లు దు
ర్భరజీవాంబుధి నీదులాడెదవు కాసైనన్ శ్రమన్ జేయ కె
వ్వరి నాసింపవు మంజులాకృతి కృశింపై తేజమున్ గ్రక్క పే
దరికంబిట్టుల వీల్చి పిప్పిసలుపన్ దైవానికై యేడ్తువో.
కలకాలంబును చెమ్మటల్ దొనుక నీకాయంబు ఘర్మార్కదీ
ప్తుల గ్రాగింతువు స్వశ్రమార్జితఫలంబున్ సంతతి మ్మన్ను గు
ఱ్ఱల దిన్పింతువు నేర్పు జూతు వసిధారాయోగసిద్ధాంత మో
కలికీ! నీకు సమానులెవ్వరు, జగత్కైంకర్యసేవారతిన్!
పెళ్ళల్ రాలిన పాడుగోడలు నినున్ పీడింప, క్షుద్బాధమై
పిల్లల్ గొల్లన వానమబ్బు కసరవ్వేళన్ రాలుగుప్పింప మే
నెల్లన్ గాఱియవొంద ప్రాణపతిరా నేముత్యముల్ రాల్చెనో?
తల్లీ! ధాన్యములేదు గంజికని సంతాపార్తి నీరైతివో?

## ప్రార్థన

శ్రీమతి బెల్లంకొండ కనకమ్మగారు

పారముగానరాని భవవారధినింబడి యీదియీది యే
తీరునగానకైతి నవధిన్ భవదీయపదద్వయంబుపై
చేరిచితింక భారమును శ్రీరఘురామ! విచారవీచికా
వారమునుండి నన్ బయలవైతువో ముంతువో నీదుచిత్తమే.

# భారతదేశమున ఘోషా

శ్రీమతులు పరుచూరి భువనేశ్వరీదేవి, అన్నపూర్ణాదేవి గార్లు

భారతవర్షమున "ఘోషా" యాచారము ప్రప్రథమమున లేదని సామాజిక లేఖకులు తఱచుగా వ్రాయుచుందురు. మహమ్మదీయుల పరిపాలనా కాలమున హిందూసుందరీమణులయెడ వారొనర్చుదుష్కార్యాదుల వలన ఈయాచారము మనదేశమున మొలకలెత్తినది. మహమ్మదీయులలో "ఘోషా" ప్రబలియుండుటచే, వారు మనదేశమును 7-8 పందల సంవత్సరములు పరిపాలించియుండుటచే వారి ఆచారవ్యవహారములు మనకు గూడ సంక్రమించినవి. ఈలేఖకుల యభిప్రాయానుకూలముగనే బీహారు, బంగాళా, రాజపుతానా, సంయుక్తపరగణాల ప్రాంతమున ఈయాచారము ప్రబలముగా నుండుటయు-మద్రాసు, ఆంధ్ర, కేరళ, కర్ణాట, మహారాష్ట్రమున నీయాచారము లేకుండుటయుజూడ వారి యాశయములను స్థిరీకరించుచున్నది. బీహారు, బంగాళ, సంయుక్తప్రాంతములు తత్పరిపాలితములు. ఆంధ్రకేరళకర్ణాటాదిప్రాంతములను వారు విశేషముగా పరిపాలించియుండలేదు. ఈఆశయమే సత్యమయిన సింధు, పంజాబు మొదలగు ప్రదేశములలో ఈయాచారము గాఢముగా నుండుట తటస్థింపవలసినది.

ఆ ప్రాంతములందు మొదటినుండియు వారిశాసనము నిరంకుశమగుటచే-అట్లు పందలకొలది సంవత్సరములు జరుగుటచేతను, మరియు దక్షిణప్రాంతమున హైదరాబాదు, బీజపూర్, మైసూర్ మొదలగు ప్రాంతములలో ప్రతాపవంతులైన మహమ్మదీయుల రాజ్యములు స్థాపింపబడియుండుటచే ఆప్రాంతములందు ఘోషా యాచారమునకు ప్రచారము ప్రబలము కావలసియుండును. సింధు పంజాబు మొదలగు ప్రాంతముల ఆయాచారము బొత్తుగా శిథిలము. దక్షిణప్రాంతమున ప్రచారమే యగపడదు. అందువలన ఆ ఆశయము యదార్థమని నిర్వచింప అశక్తులము.

ఒకజాతియొక్క ఆచారవ్యవహారములు వారి ఆధ్యాత్మిక, నైతికగ్రంథములనుండియు, ఇతిహాసముల కావ్యములనుండియు తెలియనగుచుండును. అవకాశాభావమువలన అధికముగ బహుగ్రంథావలోకనముచేసి నిరూపింప అసమర్థులము. రామాయణభారతములు ప్రాచీనములగుటచే, పావనములగుటచే హిందువులకు విశేషతః మతగ్రంథతుల్యములగుటచే ప్రమాణములుగా స్వీకరించుట సర్వజనులకు సంతోషకరమైన విషయము. సంశయమునకు స్థానముండునా? ఉండదు. వ్యాసరచితమగు శ్రీమహాభారతము నేటికి 5 వేల సంవత్సరముల నాటిది. అంతకంటెను ప్రాచీనతమము వాల్మీకి విరచితము శ్రీరామాయణము.

నేటి పరిస్థితులలో నూత్నసభ్యతాపేక్షకులు విశ్వసించజాలని వేలకొలది వర్షములనాటి పూర్వసభ్యత గదా ఇది. మహాభారతమున పూర్వకాలమున "ఘోషా" యాచారము ప్రచారమునందుండెడిదని తెలియజేయు ప్రమాణములున్నవి. కాని దీనికంటె ప్రాచీనమైన రామాయణమునుండి ఈవ్యాసమున ఈవిషయకోదాహరణల నివేదించుచున్నారము.

మహారాజుల, అగర్భశ్రీమంతుల స్త్రీలవిషయమున మనప్రాచీనగ్రంథములు వారిని "అసూర్యంపశ్యాః" ఇత్యాదిశబ్దములతో నుపవర్ణించుట చూడ పూర్వకాలమున గొప్పయింటివడుచులు పరదానవలంబించియుంట సువ్యక్తమగును. రామునివెంట సీతాదేవి యడవులకేగునపుడు అయోధ్యానగరవాసులు ఈవిషయమైన తలంపుతో నిటుల తలపోసిరి:

యానశక్యాపురాద్రష్టుం భూతైరాకాశగైరపి
తామద్యసీతాంపశ్యన్తి రాజమార్గగతాజనాః॥

(ఆకాశగాములచే, భూతములచేగూడ చూడశక్యముకాని ఆసీతాసతి నిప్పుడు రాజమార్గగతులైన నుజలు కనుచున్నారు.) అని.

దీనివలన రామాయణకాలమున ఘోషా యుండెనని యూహించుట కవకాశము చిక్కుచున్నది.

ఈఆచారము ఆర్యులలోగూడ నుండియే యుండును. లంకానివాసులైన, అనార్యులైన దుష్టరాక్షసు లకుగూడ ఈఆచారమున్నటుల కానవగును.

ఈవిషయమున ప్రమాదములెవ్వియైన సంభవించినచో మహారాణులసైతము గాఢముగా దండించుట పరిపాటియనుమీ. రణరంగమున రావణుడు నిహతుడైనసమయమున వాని రాణులు నాథునిఅంతిమదర్శనార్థము యుద్ధభూమికి చేరి విలపింపసాగిరి. అందు మందోదరి ప్రాణప్రభుతో

దృష్ట్వాసఖల్వసి క్రుద్ధోమామిహానవగుంఠితామ్
నిర్గతాంనగరద్వారాత్ పద్భ్యామేవా గతాం ప్రభో?

(ఓప్రభూ! అవగుంఠమును విడనాడి నగరమునుండి బయలుదేరి వచ్చిన నను చూచియు కోపింప వేమి?) అని పలుకగా మాట్లాడకుంట జూచి ఘోషాభంగమును చూపించుచు రావణుని క్రోధమూర్తిగా జేయ మరల

దృష్ట్వాదారదారాంస్తే భ్రష్టలజ్జావగుంఠితాన్
బహిర్నిష్పతితాన్ సర్వాన్కథందృష్ట్వానకుప్యసి.

(లజ్జవిడచి, ముసుగుదీసి బయటికివచ్చిన నీప్రియపత్నీవర్గమును చూచుచు ఎటులకోపింపకుంటివి?) ఇటులపలికెను. దీనివలన నిశాచరాంగనలకు సైతము ఘోషాయున్నదని తెలియుచున్నదిగదా?

రావణుని యంత్యకర్మలు సమాప్తియయినవెంటనే విభీషణుడు రాజ్యాధికారియయ్యెను. అప్పుడు రాముడు విభీషణు నాహ్వానించి యథావిధిగ సమ్మానించి—తనసతిని పిలిపింపుమనియెను.

ఆరోప్యశిబికాందీప్తాం పరార్ధ్యాంబరసంవృతాం
రక్షోభిర్బహుభిర్గుప్తాం ఆజహారవిభీషణః.

(విభీషణుడు పైనవస్త్రమును ఆచ్ఛాదనమొనర్చి మిక్కుటంబైన రక్కసులదండుతో రక్షింపబడు చున్న ప్రకాశమానమైన పాలకీలో నెక్కించి తీసికొనివచ్చెను) సీతను తీసికొనివచ్చి విభీషణుడు శ్రీరాము నకు కబురంపెను. సీతను తనసన్నిధికి తీసికొనిరా యాజ్ఞనుపొంది విభీషణుడు—ప్రయత్నమును సాగింపు చుండెను.

సతద్వచనమాజ్ఞాయ రాఘవస్యవిభీషణః
తూర్ణముత్సారణేయత్నం కారయామాససర్వతః.

శ్రీరామునిమాట వాలించి విభీషణుడు వేగముగ (జనుల) తొలగించుపనిని యంతటచేయించుచుం డెను. వానరులందరు తొలగింపబడుచుండిరి. వారు సీతను చూడగోరుచుండిరి. వారు తొలగింపబడినను గోలపెట్టుచుండిరి. ఆకారణమున గొప్పకల్లోల ముదయించెను. విభీషణుడు బలవంతముచేయవలసివచ్చెను. అప్పుడు ఘోషా లేకుండగనే సీతను తీసికొనిరా యాజ్ఞనిచ్చెను. పతిసమీపమున–సమరాంగణమున ఘోషా యనవసరము అనియు నిరూపించెను. ఈసమయమునగూడ విభీషణుడు ఘోషానుగూర్చి విచారించుచునే యుండెను.

ఏవము క్తస్తురామేణ సవిమర్శోవిభీషణః
రామస్యోపాయవత్సీతాం సన్నికర్షంవినీతవత్.

(రాముడిట్లు చెప్పగా విభీషణుడు సవిమర్శతో—వినీతునివలె రామసన్నిధిని సీతను పొందించెను.) స్త్రీలకు సహజమైన సిగ్గువలన, ఘోషా యలవాటువలన సీత రామునిదగ్గఱకు వెళ్లలేకపోయెను. రాముని దగ్గఱకు సీత సంకోచించుచు, మునుగుపై చుకొని వెళ్లి—

సావస్త్రసంరుద్ధముఖీ లజ్జయాజనసంసది
రురోదాసాద్యభర్తారం ఆర్యపుత్త్రేతిభాషిణీ.

(ఆసభలో సిగ్గుచేత వస్త్రసంరుద్ధముఖియై సీత భర్తనుచేరి "ఆర్యపుత్త్ర!" అని పలుకుచు ఏడ్చుచుండెను.) ఈప్రమాణనిరూపణమువలన పురాతనమున పరదాయున్నటుల తేటతెల్లముగదా?

అది మసల్మానులనుండి ఎరవు తీసికొన్నదిగాదు. పారతంత్ర్యసంసూచకమైన ఆత్మరక్షణకొఱకు పుట్టినదియుగాదు. ఇది ఉత్తరదక్షిణదేశములలోనేగాక ఆర్యులు, అనార్యులుఅను వారియందుగూడ ప్రచలితమై యుండెను. ఇది ఇతరమనుష్యులసన్నిధినేగాక తమ యింటివారిముందుగూడ నవలంబించుట స్త్రీలకు పరిపాటియని తెలియుచున్నది. ఎందుకనఁగా రావణుఁడు సీతనుహరించి వెళ్లుచుండగా సీత దుఃఖాకులితయై తనభూషణములను తనభర్త తన్ను వెదకుచు యిటువచ్చినప్పుడు వీనినిగాంచి తనవృత్తాంతమును గ్రహింపగలఁడని యూహించి సుగ్రీవాదులున్నప్రాంతమున పడవైచెను. వానినిగ్రహించి భద్రముగ సుగ్రీవుడు దాచియుంచినాడు. శ్రీరామలక్ష్మణులు సీతాన్వేషణతత్పరులై సుగ్రీవాదులసన్నిధికేతెంచ సుగ్రీవుడు ఆనగలమూటను కోతులచేదెప్పించి వారికి సమర్పించెను. వానినిగురుతింపుమని రాముడు లక్ష్మణునకివ్వగా లక్ష్మణుడు రామునితో—

నాహంజానామి కేయూరే నాహంజానామికుండలే
నూపురేత్వభిజానామి నిత్యంపాదాభివందనాత్.

(కేయూరముల నెరుగను—కుండలముల నెరుగను. నిత్యపాదార్చనములవలన నూపురములమాత్ర మెరుగుదును) అని బదులుపలికెను. మరియు

జనాపవాదమువలన శ్రీరాముడు సీతను ఋషివాటికల చూడునెపమున లక్ష్మణునివెంట వనమునకు పంపినపుడు సీతను లక్ష్మణుడు వనమునదిగవిడచి తిరిగిరాదలంచి సెలవుదీసికొనునపుడు సీత లక్ష్మణునితో "ఓలక్ష్మణా! నేను ఈసమయమున గర్భవతినైయుంట చూచివెళ్లుము" అని పలుకగా సీతతో లక్ష్మణుడు—

ఏవంబ్రువంత్యాంసీతాయాం లక్ష్మణోదీనచేతనః
శిరసావంద్యధరణీం వ్యాహర్తుంనశశాకహ
ప్రదక్షణంచతాంకృత్వా రుదన్నేవమహాస్వనః
ధ్యాత్వాముహూర్తం తామహాకింమాంవక్ష్యసిశోభనే
దృష్టపూర్వం నతేరూపం పాదౌదృష్టౌతవానఘే
కథమత్రహిపశ్యామి రామే నరహితాంవనే.
ఇత్యుక్త్వాతాం నమస్కృత్య పునర్నావముపారుహాత్.

(ఇట్లు సీత పలుకగా లక్ష్మణుఁడు దీనచేతనుడై ధరణికి శిరసుతో ప్రణమిల్లి చెప్పజాలకపోయెను. సీతకు ప్రదక్షణమాచరించి బిగ్గరగా నేడ్చుచునే ముహూర్తకాలము ధ్యానించి సీతతోనిట్లు పలికెను: పావన

చరితా! సీతా! నీరూపమును పూర్వముచూడలేదు. పూజ్యురాలా! నీపాదములమాత్రమే చూచియుంటిని. రాముడులేని ఈవనమున నిన్నెట్లుచూడగలవాడను." అని పలికి మరలసీతకు భక్తితో నమస్కరించి వానరయోక్కను) ఈవాక్యముల నుడివెను.

ఈ ఉదాహరణాదులవలన పూర్వకాలమున ఘోషాయాచారము లోపలను, బయటను ప్రచారమున నున్నటుల తేటతెల్లము.

ఇది మునల్మానులవలన భారతదేశమునకు వచ్చియుండలేదని నొక్కి వక్కాణింపవచ్చును. బీహార్ బెంగాల్ సంయుక్తప్రాంతముల ప్రబలముగా ఉన్న ఈయాచారమే పరస్పరము స్త్రీలకుగూడ యలవాటు పడుట ముసల్మానులవలన కావచ్చును. స్త్రీలు స్వభావతః లజ్జాశీలలు. వారికి ఆవశ్యక స్వేచ్ఛాదులు లేవు. ఈపరదా ప్రతిసమయమున యుండవలెనని లేదు. ఈపరదావల్ల బీహార్, బెంగాల్, సంయుక్తప్రాంతములలో స్త్రీసమాజములు నిరుపయోగములు, నిరుద్యోగములయినవి. ఇందువలన వారిలో ధైర్యకార్యనిర్వహణము, ఆత్మరక్షణానిపుణత్వము శూన్యమయినది. వీరు రబ్బరుబొమ్మలకంటె నిరుపయోగులై యున్నారనుట పొరబాటుగాదు. తీర్థయాత్రలందు, దేవదర్శనసమయములందుగూడ నిట్టి యేర్పాటులుండుటచే వారిని బయటికి తీసికొనివెళ్లుటకు కష్టముగానున్నది. అందువలన ఇట్టి పరదాపద్ధతి శ్రేయస్సునకు కారణము గాజాలదు.

లజ్జానివారణము శీలసంరక్షణము జరుగుచుండగనే ధార్మిక సామాజిక సార్వజనిక కామములందు యథావసరముగ స్త్రీలుగూడ పాల్గొనుటకు వారికి స్వతంత్రముండవలయును. ఇట్టిది పూర్వమున ఆచారమున ఉన్నటుల తెలియుచున్నది. విభీషణుడు ఘోషాయాచారమును నిర్వర్తించుటకై వానరసేనను మందలించునపుడు శ్రీరామచంద్రుడు ఇట్టియాచార మనవసరమని సద్వివేచనచేసి వారికి బోధించినాడు:—

వ్యసనేషు నచకృచ్ఛ్రేషు నయుద్ధేషు స్వయంవరే
నక్రతౌ నవివాహేచ దర్శనందుష్యతి స్త్రియాః॥

గొప్ప వ్యసనసమయములందు, యుద్ధములందు, స్వయంవరమునందు, యాగమునందు, వివాహములందు పరదాలేదు. ఈసమయములలో స్త్రీలకు పరదా యనవసరమనియు, తక్కుంగల సమయములందు యవసరమనియు దీనిచే ధ్వనితము. ఈవిధముగనే పూర్వమున ఆచారమునగూడ అవలంబించియుంట ప్రమాణములవలన నుస్పష్టము. మరియు నారీసమాజమున గొంతమంది తమ ప్రియులగూడి బయటికి వెళ్లుటగూడ కానబడుచున్నవి. శ్రీరామచంద్రుడు పిత్రాజ్ఞాపరిపాలనార్థము వనమునకేగుసమయమున సీత తానుగూడవత్తునని బలవంతపెట్టిన సమయమున శ్రీరాముడు వనవాసములవలనగలుగు యిడుమల నుడివినను వానిని పెడచెవిని బెట్టి భర్తవెంట యడవులకేగ సంసిద్ధయైనప్పుడు ఘోషాగలసీత పతివెంట యెటులవెళ్లగలదని నిర్బంధించినవారుండిరా? ఇంతియగాక ఇంటికి వనయునకు లెవరైన వచ్చినచో స్త్రీలు మూలదాగువారుకారు. దశరథాజ్ఞ గైకొని సుమంత్రుడు శ్రీరామునన్నిధి కేతెంచినపుడు సీత రామునిపార్శ్వమున ఉన్నట్లు దీనివలన తెలియుచున్నది.

సీతయా పార్శ్వస్థితశ్చాపి బాలవ్యజనహస్తయా
ఉపేతంసీతయాభూయః చిత్రయాశశినంయథా.

(పార్శ్వస్థితయైన, బాలవ్యజనహస్తయైన సీతతోగూడినరాముని చిత్రాసహితుడైన చంద్రునివలె గాంచినాడు.) శ్రీరామచంద్రుడు సుమంత్రసహితుడై జనకునిదగ్గఱకు బయలుదేర సీత వారిని సాగనంపినట్లు కన్పట్టుచున్నది.

పతిసమ్మానితా సీతా భర్తారమసితేక్షణా
ఆద్వారమనువవ్రాజమంగలాన్యభిదధ్యుషీ.

(అని తీక్షణిరై పతిసంమానితయగు సీత మంగళములు పలుకుచు ఆద్వారమునంబడించెను.) శ్రీరాముఁడు సుమంత్రునితో బయలుదేరి వెళ్లుచుండ మార్గమధ్యమున పౌరనారీమణులు పుష్పముల కురియించిరనియు, రాముని పాదములకు ప్రణమిల్లిరనియు ఓ శ్రీరామచంద్ర! నేడు నిక్కముగా నీతల్లి మిక్కిలి ధన్యురాలని వచించిరనియు గ్రంథము వలన తెలియుచున్నది. మరియు గురుపుత్రుఁడైన సుయజ్ఞుఁడు శ్రీరాముని దగ్గఱకు వచ్చినప్పుడుగూడ సీత పతిసమీపమునయే యుండినది. గురుకుమారుని ఆశీర్వాదము శ్రీరామునితో పాటు సీతయు లేచి నిలువంబడియెను. అదియునుంగాక శ్రీరాముఁడు సతీసోదరసహితుఁడై కానలకు పోవునపుడు కౌసల్య దుఃఖావేశముతో పురబహిఃప్రదేశమువరకు కాలినడకతో వచ్చి రాముని కనుచూపు దాటు వరకు చూచుచు నిలుచుండెను. ఆ కాలమున విపత్సమయములగూడ ఘోషాయున్నచో ఇట్లు వచ్చుట జరిగి యుండదు గనుక అట్టిసమయములలో ఘోషాకు పాటింపులేదని వచింపవచ్చును. మఱియు స్త్రీలు తమ నాథులతో విహారము సలుపుటగూడ గ్రంథముల కానబడుచున్నది.

రావణుఁడు చంపబడినతరువాత మండోదరి దుఃఖించుచు తనప్రియునితో—

కైలాసే మందరే మేరౌ తథా చైత్రరథే వనే
దేవోద్యానేషు సర్వేషు విహృత్య సహితా త్వయా.

(కైలాసమందరమేరుపర్వతముల, చైత్రరథమున, సమస్త దేవోద్యానముల నీతోగూడ విహరించితి,) అని పలికినట్లుల దీనివలన తెలియుచున్నది.

ఈ ప్రమాణముల నిరూపణమువలన ప్రాచీనకాలమున ఘోషాయాచారము కొన్ని సమయములబట్టి యుండెననియు, ఎల్లప్పుడు స్త్రీలు దానిని అమలులో పెట్టుట అవసరములేదనియు విదితమగుచున్నది.

మహిళోన్నతి మాటుపడగా, ఆరోగ్యము భంగముకాగా, కష్టనష్టములు కలుగుచుండగా పరదా నవలంబించుట పొరపాటు. తద్ధేతుకమైన పరదా యనవసరము.

అప్పుడప్పుడు ఘోషాక్షయకాందోళనములు కలుగుచున్నవి. ఘోషానుతొలగించుటకై మహాత్ముని ప్రోత్సాహముగూడ లభించుచున్నది.

—అనువాదము.

# విప్రలంభము

సామవేదం జానకీరామశర్మగారు

౧

రమ్యమైపాల్చు నీశరద్రాత్రులందు
ప్రణయముబికెడు నీలేఁతప్రాయమకట!
వ్యర్థముగుకీతి, దినములవ్యయమొనర్చి,
అబల! పటికెయిట్టు లాయాసపడెదు?

౨

పూవులనఁబోవు, గంధముపొంతఁ జనవు
హారముల కాసపడవు, విహారమనవు
రుచులఁగోరవు, నైదాఘరూక్షభాను
తప్తలతికాంగివై తేలతలిరుఁబోఁడి?

౩

అపుడపలిచిన లేఁజివు ళ్లతివ! నీదు
వేడినిట్టూర్పుగాళుల వాడిపోయె
అపుడకట్టిన యీయాదుకూలాంచలములు
బాష్పధారలఁ దడుపఁగాబడియెమిగుల.

౪

ఈవియోగాగ్ని నీహృదినెల్లఁగాల్చి
వేయునోయని బాష్పాంబువితతి, కాల్వ
లయి హృదయసీమఁదడుపు,నొక్కఁణువుశాంతి
కలుగకయు, ప్రజ్వరిల్లు నే కారణంబొ?

౫

ఎంతప్రణయమొ! నాథుపై నింతచిక్క
శల్యమయినావు! చెలిమాట సరకుగొనవు
ప్రణయతల్పమెటిఁగిన పండితుండె
అయిన, నిష్కరుణుండాత డంబుజాక్షి!

# పునస్సంధానము

బొడ్డు బాపిరాజుగారు

ఇదివర కెన్నడో కలిసె నీహృదయమ్ములు రెండు జీవితా
భ్యుదయపరంపరాప్తి కయి పూవునుతావియు పోలె.—నేడు న
మ్మనులకదించుకొన్న యసమాననవప్రణయార్ద్రభావసం
పదలనుకూడబల్కుకొను భాగ్యముగల్గె పరస్పరమ్మునన్.
అతివ! ఎరుంగరాక హృదయాలను దాగిన రాగవాహినుల్
పొతపొతకంటికోనలను పొంగుచు నిర్వ్యెడ దేహమెల్ల ప్లా
వితమొనరించె; ముద్దుపెదవిన్ తెరిపించని సిగ్గుమబ్బు లు
ద్ధతిమెయి నావరించె; ఎడదల్ బిగహత్తి సుఖంతమిట్టులే!
లలిమధుమాసవాసరములన్ వికచాంబుజహేమపాత్రలం
జెలగు మరందమాని వివశీకృతచిత్తములొప్ప తీగయు
య్యెలల విలాసగీతికల నేకగళమ్మున బాడు రాగమూ
ర్తులవలె ప్రేమడోలికలలో సుఖయింత మనూనవైఖరిన్.
మానవసంకులమ్మగు సమస్తజగమ్మును విస్మరించి ప్రే
మానుభవాభిలాష లలరారగ చేతులు గల్పుకొంచు స్వే
చ్ఛానుగతిన్ జరింతము;—విహాయసవీథుల నాత్మలైక్యము
బూనగమించు పుల్గుకవపోలిక—నిత్యసుఖానురక్తలన్:
మూగినసిగ్గుదొంతరలువోలె నతాస్యమునందు ముంగురుల్
దోగగ నల్లనల్ల వెనుదోయపలంచియు నన్నుజూచి య
ట్లాగితివేల ; దాగదు రహస్యము సీతలలోని పూవు లే
లాగునుమానునే వలపులన్ వెలిబుచ్చక ? ఓ సుహాసినీ !
కమ్మనిడెమ్మ వాసనలు గ్రమ్మెడి నిద్దపుమోవి, లోనిరా
గమ్ము విధమ్ము దెల్పగ వికస్వరనేత్రములందలర్చు హా
సమ్మున మోముదమ్మి నటు జాటొనరించెదవేల? ఇద్ది యో
గ్యమ్మగువేళ చిత్తమున హత్తిన యూహలు విప్పిచెప్పుకోన్.

ఈశరద్వేళ ప్రేమపండించుకొనిన
వారె పూర్వరహస్స్మృతు లేరుచుండ ;
ఆగి సహియింపగలమె యుద్వేగభరము
లలితభావాలుగల యెడందలను మనము ?

# దుఃఖమయ ప్రపంచము

ప్రశాంతముగనున్న ఆకసముపై కారుమొగిలు కానవచ్చినది. క్షణములో జగమంతయు నంధకారావృతమైనది. ప్రళయఝంఝామారుతమున మహావృక్షములు తారుమారైనవి. గంభీరభీషణ మేఘగర్జనల దిక్కుహరములు బీటలువడినవి. మరణశయ్యపై 'గమల' కనరానివేదనపడుచు పంచభూతముల ప్రళయములో దనప్రాణములు విడిచినది. తలిదండ్రులతోపాటు 'విమల' సోదరికొఱకు వక్షముబాదుకొని యేడ్చినది. దుఃఖాశ్రుపాతముతోగూడ బుడమి తూటులుపడ వర్షముకురిసినది.



పదిప్రొద్దులు తిరుగలేదు. మేఘచ్ఛన్నుడై భానుడు పశ్చిమాశను గ్రుంకిపోయినాడు. చిమ్మచీకట్లు నింగి కెగ్రాకినవి. దృశ్యమంతయు గ్రమముగా నదృశ్యమగుచున్నది. మంచమెక్కిన విమల చైతన్యము దక్కినది. గాలి స్తంభించినది విమల శ్వాసయు నాగినది. తళతళ మెఱపులు మెఱసినవి. మెఱపులతో విమలజీవితము మేళవించినది. వీథిని తాడివాన. ఇంటరోదనము.

మొన్న కమలకొఱకు రొమ్ముబాదుకొని యేడ్చినది విమల. నేడు విమల కొఱకు రొమ్ము బాదుకొనుచున్నా రున్నవారు.

కందుకూరి రామభద్రరావుగారు

# గార్గి

తటవర్తి సూర్యనారాయణమూర్తిగారు

ప్రాచీనకాలమందలి జ్ఞానవతులగు విదుషీమణులలో నుచ్చస్థానమును, ప్రతిభను గాంచిన గార్గి చరిత్రము ప్రసిద్ధము.

ఈమె అసలుపేరు "వాచకవి" గాని గర్గమునీశ్వరవంశసంజనితయగుటచే గార్గినామముచే ప్రసిద్ధురాలయ్యెను. వేదప్రచారమగుటతోడనే ఋషీశ్వరులు భిన్నభిన్నస్థానములందుజేరి బ్రహ్మజ్ఞానవిషయమై చర్చ జలుపుచుండిరి. ఈచర్చలన్నియుగల పుస్తకముల "నుపనిషత్తు"లందురు. అజ్ఞానమును నశింపజేసి భగవానుని సమీపమునకేర్చువిద్యలే—దేనియందు వేదములసత్యమగు రహస్యము దాచబడియుండెనో—అవియే యుపనిషత్తులని చెప్పబడుచుండెను. మిథిలదేశాధీశ్వరుఁడు జనకుఁడు బ్రహ్మజ్ఞానియు, విద్యాప్రేమియునై యుండెను. వానిసభయందు జ్ఞానులసభ లనేకము లగుచుండెడివి. అందు విశేషరూపముగ బ్రహ్మజ్ఞానచర్చ జరుగుచుండెడిది. ఇట్టి సభలయందు కేవలము పురుషులేకాక స్త్రీలునుజేరి వాదవివాదము లొనర్పజాలుచుండిరి. కనుక ఈసభలకన్నింటికి గార్గి జనుచు బ్రహ్మతత్వసంబంధమగు వాదనలు చేయుచుండెడిది. ఈవాదవివాదమందు అనేకమునీశ్వరులకంటె నీమె జ్ఞాన మధికమని తలచబడుచుండెడిది.

ఒకసమయమున జనకుఁడొకయజ్ఞమొనర్ప దలఁచెను. అనేకప్రదేశములనుండి బ్రాహ్మణులు, పండితులు, ఋషీశ్వరులు జనుదెంచిరి. గార్గికూడ వచ్చెను. ఉపస్థితబ్రాహ్మణులందు బ్రహ్మజ్ఞానులలో సర్వశ్రేష్ఠుఁడెవఁడాయని నిర్ణయింప జనకుఁడొకగోసహస్రమును దెప్పించి వాటియొక్కొక్క కొమ్మునకు పదిపది చొప్పున బంగారుముద్రలుగట్టి 'సద్బ్రాహ్మణులారా! మీలో సర్వశ్రేష్ఠుఁడగు బ్రహ్మజ్ఞాని యీసువర్ణసహస్రధేనువుల గ్రహింప నర్హుఁడో'ని పలికెను.

యాజ్ఞవల్క్య ఋషీశ్వరుఁడుగూడ నీసభయందు విరాజమానుఁడై యుండెను. ఈతఁడు గొప్పప్రసిద్ధుఁడగు జ్ఞాని. వేదవిద్యయం దితఁ డతిప్రవీణుఁడుగాని సంసారమాయ యితరులయందువలె నీతనియందును గలిగియుండెను. కాన సువర్ణముద్రాసహితగోసహస్రముగాంచి యాతఁడాశించి స్తబ్ధుఁడై కూర్చుండియుండియే ఎట్లు తన్ను సర్వశ్రేష్ఠ బ్రహ్మజ్ఞానిగ జెప్పుకొనుటయని ఆలోచించుచుండెను. ఈతఁడు తనశిష్యునిజూచి ఈగోవుల నీవు మనయింటికి గొనిపొమ్మని పలికెను. దీనిపై ఇతరులకు కష్టమనిపించెను. ఈవిధముగ నాతఁ డొనర్చి మనల బ్రహ్మజ్ఞానమెరుఁగనివారలుగజేసెనని వారు తలంచుచుండిరి. అంత జనకునిఋత్విక్కగు అశ్వలమునీశ్వరుఁడు పలికెను—"ఓయాజ్ఞవల్క్యమునీశ్వరా! ఇంతమందిజనులలో నీవే సర్వశ్రేష్ఠుఁడగు బ్రహ్మనిష్ఠుడవని ఎట్లెరింగితివో?". ఔద్ధత్య—అభిమానముల త్యాగము బ్రహ్మజ్ఞానుల ముఖ్యలక్షణము అని యెరింగి యాజ్ఞవల్క్యుఁడు వానితో "నేను బ్రహ్మనిష్ఠమహానుభావుల పాదములకు నమస్కరింతును కాని యీగోవుల నెవ్వఁడుగొనుటలేదు. నాకు గోవులబెంప నిచ్ఛగలదు. ఇందుచే నేను వీటిని గొనుచుంటిని" అని జవాబిచ్చెను. దీనిపై నశ్వలఋషి యీతనిని బ్రహ్మజ్ఞానపరీక్షకై కొన్నిప్రశ్నముల నడిగెను. మరియు తామడుగుప్రశ్నలకు సంతోషజనకములగు నుత్తరములిచ్చిననే గోవులగొన వీలగునని పలికెను.

అప్పుడు యాజ్ఞవల్క్యుని అనేకప్రశ్నలనడిగిరి. అతఁడు అందరికి సంతోషజనకప్రత్యుత్తరముల నొసంగెను. ఋషులందరు ప్రశ్నలనైచి యలయుటతోడనే గార్గి లేచి యిట్లడిగెను:— "బ్రహ్మదేవతలారా! ఇప్పుడు మీర లాగుఁడు. నేనను యాజ్ఞవల్క్యుని రెండుమూడుప్రశ్నల నిప్పుడడిగెదను. వాటికి దగినసమాధాన మీతఁడొసఁగినచో నీతనికి సమానులగు బ్రహ్మజ్ఞాను లెవ్వరులేరని నేను తలంచెదను."

బ్రాహ్మణులందరు శాంతించిరి. అప్పుడు గార్గియడిగెను:—"ఓయాజ్ఞవల్క్యుఁడా! పార్థివ వస్తువుల న్నియు జలమందోతప్రోతమైయున్నవి. ఇట్లు కానిచో నీటిబుద్బుదములవలె విలీనమైపోవును. కనుక ఏవిధ ముగ ఈపంచభూతాత్మకపృథ్వి జలమందోతప్రోతమైయున్నదో ఆవిధముగనే జల మెందు నోతప్రోతమై యున్నది?"

యాజ్ఞవల్క్యుఁడు:—జలము వాయువందు నోతప్రోతమైయున్నది.

గార్గి—వాయువెందోతప్రోతమైయున్నది?

యాజ్ఞవల్క్యుఁడు—వాయు వాకాశమందోతప్రోతమైయున్నది.

గార్గి—అంతరిక్ష మెందోతప్రోతమైయున్నది?

యాజ్ఞవల్క్యుఁడు—అంతరిక్షము గంధర్వలోకమందు.

గార్గి—ప్రసిద్ధగంధర్వలోక మెందోతప్రోతమైయున్నది?

యాజ్ఞవల్క్యుఁడు—ఆదిత్యలోకములయందు.

గార్గి—ఆదిత్యలోక మెందో తప్రోతమైయున్నది.?

యాజ్ఞవల్క్యుఁడు—చంద్రలోకమందు.

గార్గి—చంద్రలోక మెందు?

యాజ్ఞవల్క్యుఁడు—నక్షత్రలోకమందు.

గార్గి—నక్షత్రలోక మెందు?

యాజ్ఞవల్క్యుఁడు—దేవలోకమందు.

గార్గి—దేవలోక మెందు?

యాజ్ఞవల్క్యుఁడు—ప్రజాపతిలోకమందు.

గార్గి,— విరాట్పురుషశరీరారంభిక పంచీకృతపంచమహాభూతరూపప్రసిద్ధప్రజాపతిలోక మెందోతప్రోతమై యున్నది?

యాజ్ఞవల్క్యుఁడు—అది బ్రహ్మాండముయొక్క ప్రారంభికపంచభూతరూపమగు బ్రహ్మలోకరూపమందో తప్రోతమైయున్నది.

గార్గి—ఆబ్రహ్మలోక మెందోతప్రోతమైయున్నది? కార్యకారణక్రమాళిక ననుసరించి నాకీప్రశ్న నోపర్చ అధికారముగలదు. బ్రహ్మలోకముపరకు పోదితా మెందు కాగిపోయితిరి? బ్రహ్మలోక మెంత సూక్ష్మపరమాణువులతో దయారైనను దాని కొకసూక్ష్మ-అపరిచ్ఛిన్నకారణ మావశ్యకముగ గలుగ లేదు. ఇందు సందేహముగనుక దయయుంచి ఆకారణముయొక్క పేరు స్వరూపము దెలుపుఁడు.

యాజ్ఞవల్క్యుఁ డీమె ప్రశ్నవిని యిట్లు చెప్పదొడంగెను—"దేవీ! ఇప్పు డధికముగ బ్రశ్నింపకుము. నీవెరుఁగదలఁచిన పదార్థము కార్యకారణశృంఖలముచే ముక్తమై భిన్నమై యున్నది. కార్యకారణముల పద్ధతియొక్క ఆధారము తర్కశాస్త్రముపై గలదు. నీవెరుఁగదలఁచినదాని నిర్ణయ మీపద్ధతిపైజరుగుట అసం భవము. బ్రహ్మపదార్థముఅనగా ఏపదార్థమందు జగత్తుయొక్క ఉపాదానమోతప్రోతరూపముగనగలదో అది యూహింప కష్టము. కేవల మాపదార్థనిర్ణయము శ్రుతివచనముచేతనే కాగలదు. ఏప్రమాణములచేతగాని, యుక్తులచేతగానికాదు. ఇందుచే కార్యకారణశృంఖలను మధ్యకుఁగొనివచ్చి ఈవిషయమై యింక బ్రశ్నింప కుము."

యాజ్ఞవల్క్యుఁడు చెప్పినది సత్యము. సాంఖ్యదర్శనకారకుడగు కపిలుండు ఇందుచేతనే "ఈశ్వరాసిద్ధేః" అనఁగా యుక్తులచే పరమాత్మనిర్ణయము కష్టము. జగత్కారణరూపుఁడగు ఈశ్వరుని అస్తిత్వము ఆత్మవిశ్వాసముమీదనే దృఢత్వము చేయవలసియున్నది. నేనున్నాను, ఈమాటకు విరుద్ధముగ నేమియుఁ జెప్పఁబడజాలదు. మరియు దీనియందే విధమగు సందేహము లేనప్పటికి తర్కశాస్త్రప్రమాణములద్వారా దీనిని నిర్ణయము చేయుట మిక్కిలికష్టము. బ్రహ్మవిషయమైగూడ ఈసంగతియే. కాని ప్రాచీనకాలమందు భారతవర్షమందు ఇటువంటి గంభీరవిషయములపైననే వాదవివాదము లగుచుండెడివి. గౌతమబుద్ధునిసమయమువరకు ధార్మికజీవన మూలతత్వములవదలి తత్వజ్ఞానశుష్కప్రశ్నల సంబంధమగు వాదవివాదములగుట హెచ్చిపోయెను. ఇందుచేతనే ఒకసారి బుద్ధభగవానుఁడు తనశిష్యుఁడగు మాలుంక్యపుత్రునితో—"సోదరా! 'జగత్తు నిత్యమా లేక అనిత్యమా? దీని కొకకర్త యెవఁడైనఁగలఁడా లేఁడా? ఒకవేళయున్న అతఁ డెట్లుండును? ఇట్టిప్రశ్నలపై ధార్మికజీవితమాధారపడి యుండలేదు" అని చెప్పియుండెను.

గార్గీయాజ్ఞవల్క్యుల యీసంవాదముచే తత్కాలీన—ఆర్యస్త్రీల జ్ఞానగంభీరత్వము ప్రకటమగుచున్నది. మరియు వారు వాదవివాదములు చేయుటయందు ఎట్టిసుందరమగు తర్కశాస్త్రసమ్మతప్రణాలి నెరుఁగుదురో స్పష్టమగుచున్నది. అస్తు, యాజ్ఞవల్క్యుని ప్రత్యుత్తరములచే సంతుష్టయై గార్గి నిశ్శబ్దముగ తన స్థానమున గూర్చుండెను.

అనంతరమున యాజ్ఞవల్క్యుని యుద్దాలకాది మునులు ప్రశ్నించిరి. యాజ్ఞవల్క్యుఁడును వారందరకు తృప్తిగా సమాధానము లొసంగెను. ఇది గాంచి పండితమండలి కొంచెము లజ్జించెను. అప్పుడు గార్గి మరల లేచి పండితుల సంబోధించి "మహాశయులారా! మహర్షి యాజ్ఞవల్క్యుఁడు మీకందరకు దగిన సమాధానముల నొసంగెను. నేనుకూడ మీమాంసకొరకు వారివద్దనుంచిన తత్వమును దానికి వారొసంగిన సమాధానమును మీరు వినియుంటిరి. కాని ఇప్పుడు మరల రెండుప్రశ్నల వైప సాహసించుచుంటిని. వీటికిగూడ నితఁడు తగిన సమాధానము లొసంగుచో నీసభయం దేపండితుఁ డీతని జయింపజాలఁడని తెలిసికొనవచ్చును. చెప్పుడు. మీకిష్టమున్న నేనడుగ ప్రారంభింతును." అనిపలికెను. ఇది విని ఋషులందరు సంతోషించి ప్రశ్నములవైప గార్గిని ప్రోత్సహించిరి. ఆమెను మిక్కిలి గొనియాడిరి. యాజ్ఞవల్క్యుని వైపునకు దిరిగి గార్గి—"ఓభగవన్! ఈభూమ్యాకాశముల మధ్యస్థానము, మరియు నూర్ధ్వ-అధోదేశములు ఎవని ద్వారా యోతప్రోతభావముతో వ్యాప్తమగుచున్నవి? జనులు దేనిని భూతభవిష్యద్వర్తమానములని చెప్పుచున్నారో ఆకాలముగూడ నోతప్రోతభావముతో దేనియందున్నది?" అని ప్రశ్నించెను.

యాజ్ఞవల్క్యుడు ప్రత్యుత్తరమిచ్చెను—"గార్గీ! నీవు ఖండకాలము (Limited-time) ఖండదేశము (Limited-space) ల విషయమై అడుగుచుంటివి. అవి నా అభిప్రాయములో అఖండాకాశముద్వారా (Infinite-space) యోతప్రోతమైయున్నవి.

గార్గి యిట్లు నుడివెను—"మాన్యవరా! నీవొసంగిన సమాధానముచే నాకు సంతోషమయ్యెను. ఇందుచే తమకు నేను నమస్కారశతము లర్పించుచున్నాను. దయయుంచి యిప్పు డింకొకప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగుము. ఖండదేశము, ఖండకాలము ఈరెండున్ను ఒక నిత్యాకాశము ద్వారా యోతప్రోతభావముతో నున్నవని తమరు చెప్పియుంటిరి. కాని ప్రశ్న మేమనగ? ఈయఖండాకాశ మేయోతప్రోతభావముతో నెందోతప్రోతభావముతో నుండియున్నది?"



అవ్వాయి అనాథ బాలికా శరణాలయము

(రక్షకులు, అనాథబాలికలు)

యాజ్ఞవల్క్యుఁ డిట్లు చెప్పెను—"గార్గీ! ఆకాశ మెందు స్థిరమైయున్నదో దానినియొక అవినాశియగు అక్షరమని చెప్పి పండితులు వర్ణించుచున్నారు. అది స్థూలము గాదు; సూక్ష్మము గాదు; పొడవు గాదు; పొట్టి గాదు. అది వర్ణవిరహితమై, అప్రకాశముచే భిన్నమై, అసంగరసముచే వేఱైనదై, చక్షుః, కర్ణ, వాణీ, మనో, ప్రకాశ, ప్రాణవాయు, ముఖప్రమాణ, ఛిద్ర, ఆదులతో రహితమై, అపరిచ్ఛిన్నమైయున్నది. ఆ అక్షర మేవిధమగు విషయభోగ మొనర్పదు. ఈవిధముగనే ఆ అక్షరమును గూడ ఏమనుష్యుఁడు అనుభవింపజాలఁడు. ఈవిధముగ నది సర్వవిశేషణములతో విరహితమై ఒక్కటే అద్వితీయమైయున్నది.

దేవీ! ఈ ప్రసిద్ధాక్షరాజ్ఞచేతనే సూర్యచంద్రులు దానులవలె నియమపూర్వకముగ తమతమపనుల నిర్వహించుచున్నారు. ఓగార్గీ! ఈ ప్రసిద్ధాక్షరాజ్ఞచేతనే స్వర్గపృథ్వులు ధారణ మొనర్చి స్థిరమైయున్నవి. ఓగార్గీ! ప్రసిద్ధమగు అక్షరాజ్ఞచేతనే హిమనగమునుండి ప్రవహించుచు తూర్పునకు ప్రవహించు గంగాది నదులున్ను; పశ్చిమమునకు ప్రవహించు నర్మదాదినదులున్ను మరి యుత్తరదిక్కులందు ప్రవహించు నదులన్నియును ప్రవృత్తములైయున్నవి. ఓగార్గీ! ఈ ప్రసిద్ధపురుషుని ఆజ్ఞచేతనే జనులు స్వర్ణధనముల నిచ్చువారిని కీర్తించుచున్నారు. ఈ అక్షరపురుషుఁ డందరిని నియమక్రమబద్ధులుగ నొనర్చువాఁడు. ఈతనికి దప్ప మఱియెవ్వరికి స్వతంత్రసత్తా లేదు. గార్గీ! ఈ అక్షరపురుషుఁడే సర్వకర్మలకు యథావిధిగ ఫలములనొసంగువాఁడు. ఈతని శక్తిలేనిదే ఏవిధమగు క్రియయందు ఫలముపొందుటకు స్వాతంత్ర్యాధికారము లేదు. "ఓగార్గీ! ఆ అక్షరపురుషు నెఱుఁగకుండ ననేకవర్షములు తపోయజ్ఞముల నొనర్చిన వాని క్రియలన్నియు వ్యర్థములు. ఈ అక్షరపురుషుని యెఱుఁగకుండ నెవరుమరణింతురో వారు మిక్కిలి దీనదయాపాత్రులు. కాని యెవరు ఈ అక్షరపురుషుని యెరిగి లోకమునుంచి పరలోకమున కేగుదురో అనగా మరణింతురో వారే సత్యమైన బ్రహ్మవేత్తలు, ముక్తులు, బ్రాహ్మణులున్ను. గార్గీ! ఈ అక్షరపురుషుఁడు నేత్రగోచరుడు కాకపోవుటచే నెవ్వరును నాతనిని గాంచజాలరు. శ్రవణగోచరుఁడు కాకపోవుటచే వినజాలరు. ఈతఁడే నిత్యము శ్రోతృరూపమున విరాజమానుఁడైయుండెను. మనోవిషయము కాకపోవుటచే ఎవరును నీతని మననము చేయజాలరు. మరియు బుద్ధివిషయము గాకపోవుటచే నెవ్వరును నిశ్చితరూపముచే నెఱుఁగజాలరు. ఈతఁడు తప్ప చూచువాఁడు, వినువాఁడు, మననము చేయువాఁడు మఱియొకఁడు లేడు. శ్రవణ, మనన, దర్శన, ఇత్యాదిక్రియల మూలమందధికారి కర్తారూపమునందు నెప్పుడీతఁడే స్థిరుఁడైయుండువాఁడు. నీవడిగిన ఆకాశమీ అవినాశీ అక్షరపురుషునియందే యోతప్రోతభావముతో స్థిరమైయున్నది."

యాజ్ఞవల్క్యుని ప్రత్యుత్తరముపై గార్గి సంతుష్టయయ్యెను. మరియిట్లు పలికెను—"ఐశ్వర్యసహిత ద్విజులారా! నామాటవినుఁడు. మీరందరు యాజ్ఞవల్క్యునికి నమస్కరించి సెలవుగొనుటయే మీకుచితము. ఎందుకన వీరొకగొప్పబ్రహ్మజ్ఞానులు. మీచేత నీతఁ డోడింపబడునని మీరెన్నటికి తలఁచకుఁడు. నా రెండు ప్రశ్నలకు సరియైన యుత్తరములొసంగుచో నీతని నెవ్వరు జయింపజాలరని నేను మొదటనే చెప్పియుంటిని. ఇంత వాదవివాదము జరిగినపిదప నాయీ అభిప్రాయ మిప్పుడు సత్యముగ సిద్ధమయ్యెను." ఈవిధముగ బకి 'వచక్ను' మునీశ్వరుని పుత్రికయగు గార్గి నిజస్థానమున నుపవిష్టయయ్యెను.

గార్గి తన జీవితమంతయు వేదాధ్యయనమందు, బ్రహ్మచర్యమందు, తత్కాలీనభారతసంతానములకు జ్ఞానోపదేశ మొనర్చుటయందు గడపియుండెను. మరియు తాను వివాహ మొనర్చుకొనినచో గృహస్థాశ్రమమునడుపుటలో తత్త్వచింతనమందాటంకము గలుగునని ఆజీవితపర్యంతము బ్రహ్మచర్యాశ్రమమందేయుండెను. గార్గీ! నీజన్మము ధన్యము. భారతభూమి నీవంటి బ్రహ్మజ్ఞానతత్త్వవేత్తలగు విదుషీమతల్లుల గాంచుగాత!

—అనువాదము.

# శాంతమతి

కీ. శే. అలూరు వాసు దేవయ్య గారు

"చూచితే భద్రవతీ! "పత్న్యామాంగళ్యయోగేన, పత్యురాయుః ప్రవర్ధతే"అనునట్లు భార్యయదృష్టమువలన భర్త కాయువును, సంపదయును వృద్ధిపొందును. మఱియు నెవ్వరికైనను సరియగుకాలమువచ్చినచో "చట్టుబండపైఁ జెట్టువొడమి ఫలించునట్లు" కాని కార్యంబు లనుకూలించును. శత్రువులు మిత్రులగుదురు. గొప్పవారి సన్మానము గల్గును. కాఁబట్టి శాంతమతి యదృష్టమే యదృష్టము. అయిన నిట్టికాలంబున మనమదృష్టంబునకు దానింటి కేగితిమేని, తొల్లి నేఁజేసినఁ బ్రతిజ్ఞకార్యంబునకుఁ గోపంబులేక ప్రాపుంజేర్చి కాపాడనోపునే? వినాశకాలే విపరీతబుద్ధి యన్నట్లు నాకు నిట్టివినాశకాలము రాకుండినచో విపరీతబుద్ధి యపుడేలగల్గు? అయిననేమి! యీదినము సాయంకాలంబున నందఱాబిడకడకుఁ బోదము." అని నిశ్చయించి సాయంసమయాన శాంతమతియుండు లక్ష్మీవిలాసంబను సుందరమందిరంబు కడ కేగుటంజేసి యమ్మందిరద్వారపాలకుండొకండు వచ్చి చూచి "ఎవరు మీరు? ఏమికార్యార్థంబుగ నిటకువచ్చితిరి? అన్నమడుగుటకు వచ్చితిరా? అట్లయిన నిపుడు సాధ్యపడదు. మాయజమానులవారు దివాణమునుండి వచ్చినపిదప నొకజామురాత్రిమీఁద నన్నముపెట్టఁబడును. అందాక మీరెందైన నూరిలో భిక్షమడుగుకొనిరండు. పొండు. మీరూరక యిందునిలచినందున నొకప్రయోజనములేదు." అనిచెప్పుటంజేసి యచ్యుతగుప్తుండు భార్యతో, "వింటివిగదా! మనదురదృష్టకాలవచనంబులు? మన యదృష్టకాలంబున నిట్లెవఁడైననీచవచనంబులు వచించునె? "బిచ్చమడుగుటకుఁబోఁగాఁ జెచ్చెరలేచి పిచ్చిపట్టినకుక్క కఱవవచ్చినట్లు" మొట్టమొదట శాంతమతి మనదురదృష్టకాలంబునఁ బోతిమేని కాపాడునో కాపాడదోయని సందియంపడుచు వచ్చినందులకు ద్వారపాలకుండువచ్చి యెవరువీరనియుంగూడ నించుక యోచింపక చెప్పె. ఇంతకు నాభటుని నిందింపఁబనిలేదు. మనభాగ్యంబునకుఁ జింతపడవలె. అనఁగ నాభద్రవతి భర్తతో, 'నాథా! భటుఁడు చెప్పినందులకు వితాకుపడరాదు. మనమంచికాలంబున సేవకునివలన నీలాగు చేయించినవారమే? బిచ్చమెత్తువాండ్రని తలంచి చెప్పినవాఁడు. మనమిట్టివారమని వాఁడెఱుంగునే?' యనుచుండఁగా మఱల నాసేవకుఁడువచ్చి యచ్యుతగుప్తుంజూచి, "ఓరీ! ముందుగనేఁజెప్పినమాట వినఁబడ లేదా! యజమానుఁడు వచ్చుసమయంబైనది, యీమొగసాలకడ నిల్వక యెందఱందోఁడొక్కని పొమ్ము. మీరిఁకనిందునిలిచితిరేని దండనపాలగుదురు." అనిచెప్పుచుండ, నిద్దఱు కాఁగడాలు పట్టుకొని బోయలతోఁడఁ బఱుగిడుచుండఁ బల్లకియందు భానుగుప్తుఁడు దివాణంబునుండివచ్చుచు మొగసాల నిలువఁబడిన వారింజూచి మందిరద్వారంబునఁ బల్లకినుండిదిగి గృహంబులోని కేగి రాజచిహ్నవస్త్రాలంకారాదులు తీయుచుండ, శాంతమతి యెప్పటివాఁడుకచొప్పున భర్త రాకయెఱింగి డగ్గఱకువచ్చి సల్లాపంబులు సలుపఁబోవ నాభానుగుప్తుండు శాంతమతింజూచి,

"ప్రేయసీ! మనసల్లాపంబులు మఱల సల్పుకొందము. నేను బల్లకిలోఁగూర్చుండి వచ్చుచు మొగసాలకడ నిలుచుకుని యుండువారింజూచితి. వారు నీతలిదండ్రులవలె నున్నది. మఱి యెవరోకూడ నిద్దఱుండినవారు. నేను వివాహకాలంబున నీతలిదండ్రులం జూచినవాఁడన గుటంజేసి యించుకసందియంబు నొందినవాఁడ. వారెవరో బాగుగవిచారింతము.' అనవు డాశాంతమతి యొకభటునింబిలిచి, "ఓరీ! మొగసాలకడనిల్చిన వారియూరుపేరడిగి తెలిసు కొనిరమ్ము. పొమ్ము'నఁగ నాసేవకుఁడువచ్చి ముందువలె, "ఓరీ! మీయూరుపేరేమి? నీపేరేమి?" అనియడుగ నాయచ్యుతగుప్తుండు, "ఓహో! ముందుగ నీభటుఁడువచ్చి చెప్పినప్పుడు మన మిందుండి యెటకేని పోనైతిమి. ఇందుండిలేని దండనపాలగుదురని చెప్పినహేతువుంబట్టి యూరుపేరు మున్నగునవి యడుగుచున్నాఁడు. చెప్పితిమేని యెట్టిదండనకు లోఁబడుదు మో తెలియదు." అనుకొనుచుండ నాభటుండు "ఓరీ! ఏమినేనడుగుచుండఁగా నూరకున్నా వు? అడిగినందులకు నుత్తరమిమ్ము."అని రాయిడిసేయ నిఁకనూరకుండుట కార్యంబుగాదని "మాయూరు మణిపురంబనియు, నాపేరు అచ్యుతగుప్తుండ"నియుం జెప్పుటంజేసి, యాసేవ కుఁడు శాంతమతికడకేగి, "అమ్మా! అచ్చటవచ్చియుండు వారినడిగితిని. మణిపురంబనియు నచ్యుతగుప్తుండనియు నొకండుసెప్పె." అనవిని శాంతమతి భర్తతో "నాథా! మీరుచెప్పి నమాట నిజంబయ్యె. వారు నాతలిదండ్రులుగాని వేఱుగాదు. అయిన వారీరీతివచ్చుటకు హేతు వింతకుఁ దెలియలేదు. వారిట్లునడచి యుండఁజేలరావలె? కుబేరుని తిరస్కరించు ధన గౌరవమొందిన నాతండ్రికి గుఱ్ఱంబుగాని మఱేదేని శకటంబుగాని లేకపోవునే? చూడఁగ వారందఱువచ్చిన హేతువుంబట్టి యెయ్యదియో యొకకష్టంబువల్ల వచ్చినవారలని తోఁచు చున్నది. నన్నెంతయువారు కేవలముగ నెంచియుండినను విపత్కాలంబున వారి నాదరింప వలయుఁ గావున మనమిద్దఱు వారికడకేగి సమర్యాదపూర్వకంబుగ వారిమనంబులకు సంత సం బతిశయింపఁ దోడ్కొనివత్తము. వారికెట్టి యాపదరానిది యీపగిదివత్తురు? వారు చేసిన నిర్దయకార్యములకు మనమేమియు మాటాడఁ బాడిగాదు"అనియిద్దఱు మొగసాలకడకు వచ్చిచూడఁ దమవారుగ నుండుటంజేసి వారలసాదరంబునఁ దోడ్కొనివచ్చి యుచితాసనా సీనులంజేసి కుశలప్రశ్నలడుగ నచ్యుతగుప్తుండు శాంతమతితోఁ దాఁజేసిన ప్రతిజ్ఞవిషయం బునకు మనంబున దురంతచింతవొడమి కన్నుల నీరుపెట్టుకుని గొంతతడవు మాటాడకుండి యెట్టకేల కిట్లనియె: "క్షమావశీకృతిర్లోకే, క్షమాహి పరమంబలం" అనునట్లు 'అమ్మా! లోకమునందు నోర్పు సర్వమును లోఁబఱచుకొనఁగలదు. దానికంటె గొప్పబలములేదు. మనుష్యున కది మేలైనసొమ్ము. అట్లుండఁగా నీతో నేను బ్రతిజ్ఞ నించుకేనియోర్పులేక యదృష్టము పరికింపఁజేసితిని. ముంజేతికంకణమునకు ముకురమేలనను సామెతవలె నీయ దృష్టము బరికింపనేల? తెలివిలేక నేఁజేసినప్రతిజ్ఞకు నీమనంబున నాయాసపడకు. మాయదృ ష్టము నీతోడవచ్చినది. దురదృష్టదేవత మాకుఁదోడ్పడి సర్వసంపద నశింపఁజేసి యూరూ

దుఁదిరుగునట్లును, కాలంబున కన్నపానాదులు లేకుండునట్లును వసించుటకు గృహంబు లేకుండునట్లును, అన్యులకడఁబోయి యాచించునట్లును చేసినది. 'నబంధుమధ్యే ధనహీనజీవితం' అను నీతివచనమునుబట్టి ధనమంతయుఁ బోఁగొట్టుకొని మిత్రబంధుజనమధ్యంబుననుండి జీవించుటకంటె నడవినుండుట మేలుగదా? బిడ్డా! మాకిట్టి యిక్కట్టువచ్చునని కలనైనం దలంపలేదు. దేవునిచేఁతలకేమి సేయనగు? వచ్చినకష్టంబునకుఁ జింతించినచోఁ దొలంగునె? 'అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభం' అనునట్లు అనుభవించవలసిన సుఖదుఃఖంబు లనుభవించి తీరవలెను. కాఁబట్టి మాకుఁగష్టకాలము వచ్చినదని నీయింటికి రాలేదు. మనవైశ్యకులంబున నెంతదరిద్రులుగనుండినను స్వజనులను వేఁడుటలేదుగదా? మేమీపురమార్గంబున నుజ్జయినికి నేగుచుండి నీకుశలంబు నీపురంబున నొకసత్రంబున దామోదరగుప్తుఁడు వైశ్యకులజునివలన వినంబడుటంజేసి నేఁజేసిన నిర్లక్ష్యకార్యంబునకు నీకెంత కోపముండినను నీవు బిడ్డవుగావున నిన్ను, నీభర్తనుజూడంగోరి యిందఱువచ్చితిమి. కడచిన నాచేఁతలెంచకు"మని చెప్పుటంజేసి శాంతమతి యిట్లనియె:

"తండ్రీ! మనంబునఁ జింతింపకు. క్రిందుమీఁదకిందిరుగు బండిచక్రమువలె నదృష్టదురదృష్టములు దసరారుచుండు. వానిఁదలంపనేల? 'గురుభక్తిం సదాకుర్యా, చ్ఛ్రేయసే భూయసేనరః" అనునట్లు తనయభివృద్ధికొఱకు సౌఖ్యముకొఱకును మనుజుఁడెప్పుడును దండ్రిని గురువును బోషింపవలెఁగదా? వారు హితవచనంబులుచెప్పి విద్యాధనంబునొసంగి సర్వథా శ్రేయముగోరుచుందురు. తల్లి తనగర్భంబుననిడుకొనికనిపెంచిన 'నాస్తిమాతృసమాచ్ఛాయా, నాస్తిమాతృసమాగతిః' అనునట్లు తల్లికిమించిన యాదరువును, ఆపెకు సమానమగు దిక్కుయును, అపెకు నీకురక్షణంబునులేదు. అట్లుండఁగాఁ బుత్త్రులయందుఁ దలిదండ్రులకుఁ బ్రేమయును, పుత్త్రులకుఁ దలిదండ్రులయందుఁ బ్రీతియును, విద్యాబుద్ధులుచెప్పినగురువునందు భక్తియును, లేకపోవునే! ఫలవృక్షంబులు తామెండఁకో నుండినను, దమఫలంబులఁబక్షులకును మనుజులకునొసంగి చల్లనీడనుండఁజేయుచున్నవిగదా! యట్లమీరెంత కష్టపడినను బిడ్డయగు నాయందు ననురాగములేకుండునె? నీవట్టిప్రతిజ్ఞచేసినందులకుఁగదా నాకిట్టిసంపదగల్గినది? సానఁబట్టక యేరత్నముగాని ప్రకాశింపనట్లు నీకునాకుఁగల్గిన వంతంబువలనఁ గీర్తినొందితి. నీవాప్రతిజ్ఞ సేయకుండినచో నేనిట్టికీర్తి పొందఁగలనె? కాఁబట్టి యిఁకెట్టిచింతలు దలంపకుము. మీరిఁకనిఁదుండి యెందులకు నేగకుఁడు. మిమ్ముఁబోషింప నీశ్వరుఁడుండినను, ఆయన కృపవలన మాకు నించుకేని మనశ్చింతలేక మేమాలుమగలు కాపాడువారము, మాకు మిమ్ములఁ బోషించుటకర్తవ్యంబుగాని మఱొంకులేదు. తలిదండ్రుల, నాచార్యులఁగాపాడని పుత్త్రులును, శిష్యులుండి ప్రయోజనంబేమి? వారిరక్షించుటచేఁగల్గు పుణ్యంబుకంటె, వేఱొకండులేదు. మఱియు యజ్ఞంబులును, భూగోదానాదులను జేయుట, దేవాలయములు, సత్రములు, బావులు, చెఱువులు, తోటలు, మండపాదులు,

నిర్మించుటవలన నొకపుణ్యములేదు. జగంబున శరణుచొచ్చినవారినిమాత్రము రక్షిం చుటచేత నెక్కుడు పుణ్యముగల్గకమానదు. మాయిద్దఱకు మీపాదారవిందముల సేవ దక్క మఱొక్క కార్యము మాకుండదు. తలిదండ్రులారా! నేనొకవేళ మీగర్భంబులం బుట్ట లేదని మీరుతలంచినను నాభర్తను మీకుమారునివలెఁ దలంపుఁడు. ఆయన మంచినడ వడింబట్టి యాతని యెదుట మీతోఁ బెక్కులు వక్కాణింపఁజాల. మఱియు నాతనికిఁ దలి దండ్రులు లేరనుసంగతి మీకుఁ దెలిసియేయున్నది. కష్టకాలంబున నిష్టబంధుమిత్రులు గూడఁ గంటఁజూడరనుమాట పెఱవారికేఁగాని మనకేల? పసివాండ్రగుమాకు నింటఁ బెద్ద వాండ్రులేమింజేసి యీశ్వరుండీరీతి మిమ్ముందెచ్చి మాకుఁదోడ్పడఁజేసె' అనివారినింటఁ బెట్టుకుని రక్షించిసదయ్యె. కాఁబట్టి జగంబున స్త్రీలకు విద్యాబుద్ధులు బాల్యమునం గఱపుటవలన నీతియు, ధైర్యము, మాతాపితృగురుదైవపతిభక్తియును, యుక్తాయుక్త పరిజ్ఞానంబును, గౌరవపదవియందాసక్తియును, స్వకుటుంబరక్షణపథంబును, బుద్ధియు, శక్తియు, పరాక్రమమును, రాజభక్తియు, బంధుమిత్రసన్మానప్రేమయు, దీనజనవిశ్వాసం బును, అహింసయు, దేహారోగ్యమార్గవిచారంబును, సత్యధర్మప్రవర్తనంబును, సదా చారంబును, శాంతగుణంబును గల్గియుందురనుటకు సందియంబులేదు. మఱిట్టి గుణంబు లుండినచో దేవుఁడు దయంజూచి వారికిఁదగిన సంపదలీయకమానఁడు. సర్వదావిద్యయ మంచిరూపము, గౌరవము, రహస్యధనము, పరదేశబంధువు, రక్షించుదైవము, బోధించు గురువు, శాశ్వతసుఖము, సర్వజనానురంజకము, యాచకులకుఁ గల్పతరువు, సర్వజనవశీ కరము, జ్ఞానాస్పదము, ఆపత్కాలమునకుఁ దోడునీడ. సన్మార్గప్రవర్తనము కైవల్యసుఖ సంధాయకము, దుర్గుణనిరసనము, సద్గుణాకరము, కరుణారసప్రదము, దుర్జనస్నేహనిరో ధము, సజ్జనసంగమముగల్గి యశోధనపాత్రలగుదురు.

## ఆత్మార్పణము

భమిడి ఉమామహేశ్వరావధానిగారు

నాథ! నీసుందరాకృతి నయనములకుఁ
బ్రీతిగావింపకుండ నేర్చెదవుగాని,
హృదయదర్పణమందున నింపుగులుక
నట్టుప్రతిబింబమును జూడనడ్డఁగలవె?
నీసుధామధురోక్తులు నెమ్మిమీర
నానుభాగ్యంబు లేదయ్యెగాని నాకు
జగదతీతంబు నీదైనసచ్చరితము
వీనులారంగవినఁగ నేవిఘ్న మొలయు?

ఎదుటఁజరియించుచుండి నిన్నెలమితోడ
నాథ!అనిబిల్చుకొనెడు పుణ్యంబులేదు,
కాని నీదునామంబు హెచ్చైనభక్తి
నెల్లకాలంబుజపియింప నేమియడ్డు?
ఒకట సతిభక్తిపాదంబులొత్తి కనుల
కద్దుకొనజాలినట్టి భాగ్యంబులేదు,
పూర్వసంచితపాపంబు వోనఁగె నట్టు
లైనగావింపలేనె! యాత్మార్పణంబు.

# అనుభవమైతేగాని అన్నీ తెలియవు

ఎస్. శేషాచలరావుగారు బి. ఏ.

౧

గణపతిరావుకు యిప్పుడే ఉత్తరమొచ్చింది. పాళిడిలో కూర్చుని చదువుచున్నాడు. ఇంతట్లో అతనిభార్య కమల వచ్చిందక్కడకు. "ఎక్కడనుంచి ఉత్తరం?" అన్నది ఆవిడ. "మా అక్కయ్య వస్తుందట సాయంత్రం బండికి" అని అన్నాడు సంతోషంతో గణపతిరావు.

కమల:—వస్తుంది! ఎక్కడకు? (అన్నది కనుబొమలు ముడుస్తూ)

గణ:—ఎక్కడికేమిటి? ఇక్కడకే.

కమల:—ఇక్కడికికాక యింకెక్కడికి వస్తుంది-వడి ఏటోకి. ఇక్కడికనే నాకూ తెల్సు.

గణ:—చాలాకాలమైంది వచ్చి.

"పోనీ ఎల్లకాలం కూర్చోమనండి. ఎవరొద్దన్నారు? ఎవరుచేస్తారో వీళ్లందరకు చాకిరీలు? లేరగావుండేదాన్ని సేవకతనే దొరికాను గాబోలు. వాళ్ల చెల్లెలుగారు యిచ్చటకువచ్చి మొన్నటివరకు తినిపోసారు. ఇంక యీవిడొస్తుంది. ఈ యిల్లు వాళ్లందరకు నాళంవారిసత్రమయిపోయింది......... ఇదిగో! మీకేచెప్పడం ఈవిడ్ని తెచ్చి కొంపమీద పెడుతున్నారు. చాకిరీచెయ్యడానికి నాకేమివోపిక లేదు. ఒక్కపూటకన్న ఎక్కువుంటే నాపుట్టింటికి నేను వెళ్లిపోతాను. ఆతరువాతసంగతి మీరు చూసుకోండి." అని తుర్రుమంది లోపలకు గణపతిరావు భార్య.

గణపతిరావు నిర్ఘాంతపడిపోయాడు. అయినా అతనికి క్రొత్తగాదు భార్యయొక్క అదలింపులు. మొన్న చెల్లెలిని శ్రావణమాసానికి తీసుకొని వచ్చినందుకు అతడు ముప్పతిప్పలుపడి మూడుచెరువులనీరు త్రాగాడు. ఆ అదురు యింకా అతనికి వదలలేదు. ఇప్పుడు రాకరాకవచ్చే అక్కగారిని రావద్దంటాడా! పెండ్లాముచే మాటలుపడ్తాడా? అన్నిటికి సిద్ధపడాలి అమ్మగారిని చేసుకున్నతరువాత. కనుక తెగింపు తప్పదు గణపతిరావుకు. అక్కను తీసుకొనిరావడం, యిల్లాలిచే తలవాయ చీవాట్లుతినడం అతనికి వ్రాసిపెట్టాడు బ్రహ్మదేవుడు.

అదేమిటో ప్రపంచధర్మం. ఎలుకనుచూస్తే పిల్లికి గిట్టదు. పిల్లినిచూస్తే ఎలుకకు గిట్టదు. అత్తనుచూస్తే కోడలుకు గిట్టదు. కోడల్నిచూస్తే అత్తకు గిట్టదు. అంతకన్నా గిట్టనిది ఆడబడుచులకు, వదినెలకు. పొక్కనివైరము, సాగెడువైరము, లోపల లోపలే రగలెడువైరము వాళ్లలో ప్రబలుతుంది. టప్పటుప్పులతో ఎగిరే ఐరోపాయుద్ధాలు కావవి. లోపలలోపలే కుమిలి కొంపలు కూల్చేవవి. కారణములేని కలహాలు, మనస్సులను కలతపెట్టేవైరాలు. చేసేవారికన్న చూసేవారికెక్కువ ఆయాసం కల్గేవవి. కమలానికి గణపతిరావక్కపై వైరమెట్లు పుట్టిందో, ఎందుకుపుట్టిందో, ఎప్పుడుపుట్టిందో ఎవ్వరికి తెలియదు. కమలానికికూడ తెలియదనుకుంటాను. కాని ఆవిడకు గణపతిరావక్కపై క్రోధమున్నమాటమట్టుకు నిజం. తనభర్తకు ఆవిడ అక్కపుట్టడం ఆవిడకర్మం. దానికి కమలం ఏంచేస్తుంది? ఒక్కటిమట్టుకు కమలం నిశ్చయించుకుంది. గణపతిరావక్కవస్తే ఆవిడ మొగమన్నా చూడకూడదని. అందువల్ల ఎవరికేనష్టం? వచ్చేఆవిడ ఏరెండుమూడురోజులోవుండి పోతుంది కాని ఎల్లకాలం అనుభవించేది ఆవిడతమ్ముడు గణపతిరావు. కార్చిచ్చులమధ్యపడ్డ మిడుతలాగ తను తపించేపంతుంది. అందుకెవ్వరేమి చెయ్యగలరు?

౨

సాయంత్రం అయిదున్నరబండివచ్చేవేళ. గణపతిరావు ఆఫీసునుండే స్టేషనుకు వెళ్తానన్నాడు— రాకరాకవచ్చేఅక్కను ఆహ్వానించడానికి. ఎవరికి

కుతూహలముగాదు తోబుట్టువును చూడ్డానికి—అందులో కల్లంతమనిషి ఆవిడ. నాలుగుగంటలకే ఆతను స్టేషనుకు వెళ్లే ప్రయత్నంలో వున్నాడు.

ఒకరికి యింపైంది యింకొకరికి కంపవుతుంది. గణపతిరావుకు తనఅక్కంటే అభిలాషగాని కమలానికేముంది? "పీపీ! పీపీ! సీదమూస్" అని చంద్రబింబాన్ని కుక్కపిల్లకు చూపెడ్తే "లొళ్లో లొళ్లో" అని మొరిగిందట. అక్కవస్తుందని గణపతిరావు సంబరపడితే, అతనిఆవిడ ఆడబిడ్డకు చాకిరీచెయ్యాలని అయిష్టపడింది రాఘవమ్మమీద-గణపతిరావు అక్కపేరు రాఘవమ్మ; చెప్పడం మర్చిపోయాను.- పుట్టిన అయిష్టం పట్టినేపోతుందా? కలపెట్టుంది మనస్సును వాంతి కడుపును కలపెట్టినట్టు. కోపము, తామసము, ఉక్రోషము, విచారము యివన్నీ అరటిపిలకల క్రింద అంకురించాయి కమలంగారి హృదయంలో. మొహం ధుమధుమ లాడటం, ముక్కువిరుచుకోవడం, మూతివిరుచుకోవడం, యివన్నీ ఆవిడయందు ప్రత్యక్షంగా కనుపించాయి. ఇవన్నీ ఉత్తరంవచ్చినప్పటినుంచి రగుల్తున్నాయి; కాని నేడు మరీ ఎక్కువయాయి. నాలుగుటంగని కొట్టేటప్పటికి కమలం కమలంగాలేదు. "ఆవిడ ఎందుకురావాలె యిక్కడకు"అని కమలానికి గట్టిగాపట్టుకుంది. తనకు అబ్బవంక చుట్టముకాదు, అమ్మవంక చుట్టంకాదావిడ. ఎందుకుతాను చాకరీచెయ్యాలావిడకు? "ఏమి అగత్యంపట్టిందినాకు చాకరీచెయ్యడానికి"అని సీర్థపైన ప్రశ్న వేసుకుంది కమల. అవును తానెవరు? ఆవిడెవరు? "ఎవరికివారే యమునాతీరే" అన్నారు పెద్దలు. 'సరే' అనుకుంది కమల. కోపమొచ్చినప్పుడు, తాపమొచ్చినప్పుడు ఆడవాండ్ర కోకేమాత్రం తెలుసు; తలకు తట్టెడుశొంఠిగంధం పట్టించుకుని మూల్గుతూ పండుకోవడం. ఆమాత్రమే అవలంబించింది కమలం కూడాను.

ఇక్కడీయన అక్కను బండిలోఎక్కించి యోగక్షేమాలడుగుతూ బండివెంట వస్తున్నాడు. కాని అతనికి కడుపులో ఆందోళన లేకపోలేదు. భార్య ఏపేచీపెట్టి తనపరువును బయటపెట్టుందోఅని. సరే యింటికొచ్చారు గణపతిరావు,అతనిఅక్క. మరదలుగారు ఎదురొచ్చి తన్ను లోనికితీసుకొనివెళ్లే యోగం రాఘవమ్మగారికిలేదు. ఇంటిలో ప్రవేశించి మరదలేదని ఆవిడ ప్రశ్నిస్తే ప్రక్కనున్న దాసీది "అమ్మగారు జ్వరమొచ్చి పైనపండుకున్నా"రన్నది. "ఆ! ఆ!" అన్నది ఆదలిపోతూ రాఘవమ్మగారు. (ఆవిడ డోకపిచ్చిమొత్తుకోళ్లు) "గణపతీ! ఏమిరా యింతవరకూ చెప్పలేదు అమ్మాయి జబ్బుగావుందని?" అని ఆవిడతమ్ముణ్ని మందలించింది. దొంగజబ్బులసేమని చెబుతారు? ముంగిలాగ పూరుకున్నాడు గణపతిరావు "ఆహా! యీఎత్తు ఎత్తిందా"అని లోన అనుకుంటూ.

ఆతురతో రాఘవమ్మగారు మేడఎక్కారు. ఆవిడకేమితెల్సు దొంగజబ్బు లక్షణాలు; సత్యకాలపు మనిషి. నిజంగా కమలానికి జబ్బేఅనుకుంది. ఆవిడరాక కనిపెట్టి మరదలుయిటున్న తల అటు త్రిప్పుకుంది. "అమ్మాయి! అమ్మాయి!" అని కమలాన్ని ఆవిడ పలుకరించింది. మాటాలేదు, చూపూలేదు. మొహాన్ని తట్టెడుశొంఠిగంధము మాత్రముంది. "ఏమే! యివాలేమన్నా కొంచం ఆహారమేమన్నా తీసుకుందా?"అని ఆవిడ దాసీదాన్ని ప్రశ్నించింది. "ఏమీ తీసుకోలేదని" దాసీది వ్రేళ్లు మెటికవిరస్తూ జవాబిచ్చింది. కంగారెత్తింది రాఘవమ్మకు. "ఈపూట మందిచ్చారా?" అన్నదిరాఘవమ్మ. "మందూలేదూ, మాకూలేదు" అని దాసీది దీర్ఘంతీస్తూ చెప్పింది. "జబ్బుపడ్డ ఆడదానికి కాస్తమందన్నా తెచ్చిపోరా"!అని తమ్ముణ్ని కోప్పడింది రాఘవమ్మ. తమ్ముడేమని చెప్పతాడు; "అక్కా! యిది దొంగజబ్బక్కా!"అని చెప్పితే తనపరువుకేనష్టం. కమలంమీద చెయ్యివేసింది రాఘవమ్మ. కమలానికి అరికాలుమంట నెత్తికెక్కింది. వొళ్లు నిప్పులుక్రక్కినట్లయింది. "అబ్బా! ఎంతవేడుంది" అని కంగారుపడింది రాఘవమ్మగారు గణపతిరావు వైపుతిరిగి "ఏమిరా గణపతీ! వెళ్లి డాక్టరును తీసుకునిరారా!" అని దీనంగా అన్నది.

అనుమానం పెట్టేనే అన్ని అనుమానాలు పుట్టవి. అక్క అంత కంగారుపడి చెప్పేటప్పటికి తమ్ముడాందోళనలో పడ్డాడు. మానవజీవానికి రోగమెంతలో రావాలె? కంగారుపడి గణపతిరావు గబగబ పరుగెత్తాడు ప్రక్కవీధిలో బల్లకట్టుకున్న డాక్టరుకోసరం. ఇక్కడ రాఘవమ్మగారు విచారంతో మరదళ్ని కనుపెట్టుకుని కూర్చుంది. "పిశాచం! యింకాపోదే" మని మరదలు లోలోపల విసుక్కుంటూంది.

3

ఇంతలో డాక్టరును వెంటబెట్టుకుని గణపతిరావు ప్రవేశించాడు. కమలానికి డాక్టరురావడం విభ్రాంతయిపోయింది. తనమగడు యిదంతా దొంగటక్కరని గ్రహించి పట్టిసేవల్లి పట్టేసే పస్తాడనుకుంది గాని యిలా కంగారుపడి డాక్టరును తెస్తాడనుకోలేదు. డాక్టరురావడం కనిపెట్టి కమల పారిపోవాలనుకుంది. కాని రాఘవమ్మ దెయ్యంలాగ అదిమిపట్టుకుని "నీకేమి భయములేదమ్మా!"అని లేవనిచ్చింది కాదు. "నాది దొంగజబ్బు. ఆడబిడ్డవస్తుందని యిట్లా పండుకున్నాను. నన్ను వదలెయ్యండి"అని యిప్పుడు కమల ఏమని చెపుతుంది? 'రోటిలోతలపెట్టి రోకలిపోటుకు వెరుచుటా?' అయినా జబ్బేమిలేనప్పుడు డాక్టరేమని చెబుతాడుఅని అనుకుంది కమల. డాక్టరుగారు ధర్మామీటరు నోటికితగిలించారు, నాడిచూసారు, రోగిని పరిశీలించి "మలేరియాజ్వరము, ఒకక్వైనైన్ ఇంజక్షనుతో తగ్గిపోతుంది" అన్నారు. ధర్మామీటరుచూడగా జ్వరము కనుపించదు. "ఇపుడు పైకి ఉష్ణములేదు. అయినాఒకఇంజక్షన్ ఇచ్చుటమంచిది" అన్నాడాయన. దొరికినజీవిని పాముకాటెయ్యక మానదు, కనుపించినరోగికి డాక్టరు సూదిమందెయ్యక మానడు. మనడాక్టరుగారు కమలకు మలేరియాయిన్ జెక్షన్ యివ్వప్రయత్నము చేస్తున్నారు. కమలకేమి ప్రాలుబోవుట లేదు. "ఏమో నిజంగా రోగముందేమో" అనుకుంది కమల:అవును. ఆడబిడ్డపై మండిపాటుకూడా ఒకరోగమే. కాని డాక్టరకు సర్జమలకు లొంగేదాఅది? "మాన్పుటకంటె అటంకపరచుట మేలని" ఎనిమిది గ్రెయినుల క్వైనైన్ డాక్టరుగారు సూదిలో కెక్కించి సిద్ధపరిచారు. ముందేమా గాత్ర్యమున్నా సూదిమందన్నా చక్రాంకితాలన్నా అందరికిభయమే. "ఎంత కష్టమొచ్చిందమ్మాయి!" అని అనుకుంటూ రాఘవమ్మగారు మొంగ మూపలకు త్రిప్పుకున్నారు. నాకు శూలఎద్దుపడున్నలాగ పడుంది కమల పెడమొగము పెట్టుకుని. "వూ. పర్వాలేదులే. అంతాక్షణంమని గణపతిరావు పైకి గాంభీర్యంగా అన్నా లోపనూది 'కజక్'అని కమలండదండను ప్రవేశిస్తుందని తడబడక పోలేదు. కాని డాక్టరుగారు నదురూ బెదురూలేక బుట్టకు దబ్బలంగ్రుచ్చినట్లు కమలందండకు సూదినెక్కించారు. "అ!—ఆ'— అమ్మా! అని కమలం గుడ్లంబడి వొక్కసారి నీళ్లుతెచ్చుకుంది. అంతాక్షణం. కాని కమలకు తాతముత్తాతలు జ్ఞాపకమొచ్చారు ఆక్షణంలో. "సరి. బిల్లు రేపు పంపుతాలెండి"అని డాక్టరుగారు సెలవుపుచ్చుకున్నారు.

౪

ఎవరుతీసుకున్న గోతులో వారేపడ్తారు అనుసామెతెక్కడకుపోతుంది? డాక్టరుగారిచ్చిన యింజెక్షన్ కమలకు వొంటికెక్కింది. అరగంటకు తలనొప్పి అంకురించింది. మరొకఅరగంటకు అపరిమితమైన జ్వరంకాయడం మొదలుపెట్టింది. ఇంజెక్షన్ యిచ్చినచోట బొప్పికట్టి చెయ్యి స్వాధీనంలోలేకుండాపోయింది. రోగమొచ్చినట్లు నటించినందుకు రోగ మిప్పుడు నిజంగానే తగుల్కొంది. పట్టిసే వొంకపట్లు వేసుకున్న ఫలితం వృధాగాపోతుందా? ఆపసోపాలు పడుతూవుంది కమల. ఆవిడమనస్సు పరిపరివిధాల పోతూవుంది. తనవారెవరు దగ్గరలోలేరు. క్రమేణజ్వరం హెచ్చడమేకాని తగ్గటంలేదు. పైపుపశాంతులు గణపతిరావు, అతనిఅక్క ఎంతచేస్తేనేమి? అసలు రోగము ఆడబిడ్డపై మండిపాటు. డాక్టరిచ్చింది మలేరియాజ్వరానికింజెక్షను. చెవు

డుపోవడానికి కన్నాడగొట్టి పట్టయింది. ఢిక్కమొహమేసుకుని రాఘవమ్మ మరదలుకు తలనొక్కుతూ కూర్చుంది. గణపతిరావు దగ్గర కుర్చిలో కూలబడి లోపల తపిస్తున్నా పైకిమాత్రం "ఆ! పర్వాలేదులే. యిట్లాగే రోగాలు ఎక్కువవుతాయి తగ్గేముందు" అని అక్కగారికి ధైర్యం చెపుతున్నాడు. "ఏమిటి గడబోరా గణపతి!...ఒక్కసారివెళ్లి మీమందు వల్ల జ్వరం ఎక్కువయిందయ్యా!' అని డాక్టరుగారితో చెప్పి మళ్లీతీసుకుని రారా అతన్ని" అంది రాఘవమ్మగుండెలు నీరయేలాగ. "ఏమిటలా కంగారుపడ్తావు"అని తడబడుతు లేచాడు గణపతిరావు. ఒకటికి రెండుసార్లు పిలిస్తే డాక్టర్లకు కోపమొస్తుంది. అయినా అవసరమొచ్చినప్పుడు తప్పుతుందాపిలవడం?

గణిపతిరావు కాలీడ్చుకుంటూ డాక్టరుగారింటి కెళ్లి యింజెక్షన్ యిచ్చినతరువాత జ్వరం ఎక్కువయిందని చెప్పేటప్పటికి, డాక్టరు త్రాచుపాములాగలేచి నాయింజెక్షన్ వల్ల జ్వరంవచ్చిందా? వెళ్ళి ఇంకో డాక్టర్ను చూసుకో అని కూర్చున్నకుర్చీ అదిరేలాగ కేకవేసారు. "మాసినకన్ను విప్పకుండా పండుకుందండి, వొక్కసారి రావాలండీ" అని గణపతిరావు విన్నవించుకుంటే "మరేమి మునిగిపోయింది లేదు. రేపుప్రొద్దున్న వస్తానులే" అని మూతిత్రిప్పుకున్నారు డాక్టరుగారు.

'డాక్టరు రానుపొమ్మన్నా'డని చెప్పుకోవడం అదీ చిన్నతనమే, అందుచేత "డాక్టరువస్తారు...... వచ్చేవేళయింది"అని గణపతిరావు కాలంగడుపుతున్నాడు. కాని డాక్టరువచ్చిందిలేదు, చేసిందిలేదు. ఇంతట్లో ప్రక్కింటిపుల్లమ్మవచ్చి "ఇదేమి! భైరవాచారిచేత మందిప్పించకూడదా? మనవీథినే వున్నాడే" అంటే అతన్నితీసుకుని వచ్చాడుగణపతిరావు. ఆచారిగారు పట్టెనామాలతో ప్రవేశించి రోగివాడి పరీక్షించి "ఇది శీతపైత్యజ్వరము. ఇంగ్లీషువైద్యులకేమి తెల్సు దీనినికుదర్చడం! మాకుప్పికట్లు కొంపలు నిలబెట్టేవండి"అని నంచి ఒక్కసారి కుదిలించారు. "ఎందుకయ్యా! ప్రగల్భాలు. మందియ్యగలవా? లేవా?" అని పుల్లమ్మ దబాయించడిగితే "ఆ! ఎంతమాట సెలవిచ్చారు"అని నల్లకుప్పినితీసి "యిది వజ్రపుకునకండి. వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత జ్వరాదులను క్షణంలో హరిస్తుందని" గాంభీర్యంగా చెప్పి చిటికవేసారు. సోలెడు జీలకఱ్ఱరసంలో అనగింజలో అరపైయవవంతు కుప్పిగిల్లి, వేసి కాయకాసిన వ్రేలితో కలపెట్టి "మామందుమీద గురివుంచి పుచ్చుకోండి"అని కమలానికి ఆసోలెడురసం గొంతుకులో కెక్కించాడు.

ఎట్లాగయితేనేమి జీలకఱ్ఱరసంవల్లో, నల్లకుప్పి మాహాత్మ్యంవల్లో, యింజెక్షన్ మందు సర్దుకోవడం వల్లో, లేక అన్నిటివల్లో కమలానికిజ్వరం దిగజారి చమటపట్టింది. తెల్లవారి మూడుగంటలయేటప్పటికి మంచినిద్రకూడ పట్టింది. రాఘవమ్మగారు భైరవాచారి హస్తవాసి మంచిదని వచ్చినవారందరితో చెప్పుకోవడం మొదలుపెట్టింది.

ఉదయం స్టైతస్కోపుతో డాక్టరుగారు యింటికొచ్చేటప్పటికి మందులసంచితో ఆచార్యులవారు సిద్ధపడ్డారు. "వీడెవడు!" అని డాక్టరుగారు స్టెతస్కోపుచెయ్యిని ఆచార్యులవారి కేసిచూపి అంటే, 'తోలుగొట్టాల వైద్యులముకామండి' అని భైరవాచారిగారు కరిచేఅంత గట్టిగాఅన్నారు. పుంజూపుంజూ కలయబడితే ఆపుంజాను ఆవైపునుంచి యీపుంజాను యీవైపునుంచి లాగేసెయ్యొచ్చుకాని వైద్యులువైద్యులు తారసిల్లితే వారినిలాగేవాళ్లెవరు? వారే తప్పుకుపోవాలె. డాక్టరుగారు కంటిజోళ్లతో ఆచార్యులవారిని చూస్తే, ఆచార్యులవారు పట్టెనామాలు కరిగేలాగ డాక్టరుగారిని చూసారు. గణపతిరావు కిక్కురుమనకుండ నిలుచున్నాడు. లేకపోతే ఏముంది? ఆబోతు ఆబోతు దెబ్బలాడి మధ్యనున్న లేగదూడ కాళ్లిరుగకొట్టిన సామెతలాగవుతుంది. చూసిచూసి డాక్టరుగారు చ్రరున దిగిపోయారు మేడమెట్లు. జయించిన కోడిపుంజు గోడెక్కికూసినట్లు కీచిగా కుర్చీలోకూర్చుని వొక్కసకిలింపు సకిలించారు భైరవాచార్యులవారు. "ఇంతే ఇంగ్లీషు వైద్యులు హ్యాటు, బూటు, సూటుతప్ప మరేమి

పసలేదు.........(కమలంవాడి చూస్తూ) ఎలావుం దన్నారు రాత్రి......వాడి దివ్యంగావుంది...జ్వరం గిరం ఏమీలేదు." ఏమి పథ్యం పెట్టమంటారని రాఘవమ్మ అడిగితే 'ఏమి పెట్టకండి. లంఘనం పరమౌషధం' మిరియాలకషాయం గ్లాసుడిప్పుడివ్వండి. సాయంత్రం గ్లాసుడివ్వండి. ఇంతేయివాలకు.'

౫

జ్వరంతగ్గి మూడుదినాలయింది. కాని వైద్యుల వారు పథ్యం పెట్టరు. "అకలికి కొట్టుకులాడి పోతుం దయ్యా" అని రాఘవమ్మ "అంటే "లంఘనం పరమౌషధం" వుంచరమ్మా! యివాలకూడా ఏమిమునిగి పోయింది" అని భైరవాచార్యులవారు స్పష్టముగా చెప్పినారు. నానాటికి కమలానికి నీరస మెక్కువ గోవుతూవుంది. ఆగోమయంలో పడిందావిడ. లేవ డానికి శక్తిలేదు. మాట్లాడడానికి వోపికలేదు. ఎవ రంతటే నూయితయిందో ఆరాఘవమ్మగారే ఆవిడకు యిప్పుడుగతయారు. ఆవిడ్ని చూసి యీవిడేడుస్తుంది. యీవిడ్ని చూసి ఆవిడేడుస్తుంది. వీళ్లిద్దర్ని చూసి గణ పతిరావు లోలోపల ఏడుస్తున్నాడు.

చివరకు శ్రుతిమించి రాగంలోకు దేదాకవచ్చింది. కమలకు ఆందోళన ఎక్కువయిపోయింది. కండ్లెంబ డినీరు ఆదేకార్చడం మొదలుపెట్టింది. "పర్వాలే దులే, అమ్మా!" అని రాఘవమ్మ అంటుందేకాని ఆవి డకు అపరిమితమైన దుఃఖమొచ్చేసింది. ఒకరినొకరు కౌగలించుకున్నారు. కౌగలిలో ఏమాహాత్మ్యముందో ఎవరుచెప్పగలరు? కమలాన్నివదలి రాఘవమ్మ లేవదు, రాఘవమ్మను కమలంవదలదు. గణపతిరావు వీరిగోలచూసి కంగారుపడటం తప్ప చేసేదేది కని పించదు. ఇరుగుపొరుగు అమ్మలక్కలువచ్చి "ఇదేమి టమ్మా! కొంచం చిట్టుడుకునీరు పట్టమ్మా, ప్రాణంనీర సించిదమ్మా" అంటే గబగబ రాఘవమ్మ నీరుకాచి గిద్దెడునీరు పట్టింది కమలకు.

కొంతసేపటికి కమల తెప్పరిల్లింది. రాఘవమ్మకు అమితసంతోషమయింది. "పాడువైద్యుడు పథ్యంపె ట్టనిచ్చాడుకాడు. నిష్కారణంగా నీరసించింది" అని నొచ్చుకుంది రాఘవమ్మ. మరిగంటకు గ్లాసెడుజావ కాచి పట్టించిందికమలకు. కమల క్రమేప తేరుకుంది. కాని అప్పటికౌగలిమాహాత్మ్యమేమిటో రాఘవమ్మ నువదలి కాసేపన్నా వదలలేకుండావుంది కమల. రాఘవమ్మ కమలం ముంగురులుదువ్వుతూ "ఎంత చిక్కిపోయా వమ్మాయి! రెండుదినాలలోనే నీత ల్లిదండ్రులుంటే ఎంతనొచ్చుకుందురో" అని అంటే "మీరుమాత్రంకారా?" అని కమల అంది.

౬

మరినాలుగురోజులకు కమల పూర్ణారోగ్యవతైంది. రాఘవమ్మ తమలపాకుల నమలుచు పండుకుంటే ప్రక్కన కమల విసురుతూ కూర్చుంది. "అమ్మాయి! రేపుసాయంత్రం బండికి నేను వెళ్లిపోతాను. నీకు కులాసాగా వుందికదా" అని రాఘవమ్మ చెప్పితే "అప్పుడే వెళ్తారా?" అని కమల ఆవిడ్ని కౌగలించు కుని ఏడవటం మొదలు పెట్టింది.

ఇంతట్లో గణపతిరావు ఉత్తర మొకటి డాక్టరు గారి బిల్లొకటిపట్టుకుని ప్రవేశించాడు అక్కడకు. వీళ్లనుచూసి "ఇదేమిటన్నాడు?"

కమల:—చూసారా? అప్పుడే వెళ్లిపోతారట.

గణ:—వెళ్లక కూర్చుంటారా? ఏదో వెల్తూ వెల్తూ ఇక్కడ దిగింది ఒకపూట వుండిపోదామని. నీయింట్లో కాపురంచెయ్యడానికి రాలేదు.

కమల:—నాయిల్లొకటి, ఆవిడిల్లొకటినా?

గణ:—(కమలను విభ్రాంతితో చూసాడు మొహం చెప్పబట్టి నచ్చుకదూ లోపల ప్రేమతో అందో లేక బడాయికందో.)

రాఘ:—అదేమి టబ్బాయి! చేతిలోనిది వుత్తరమా. మళ్లీ అమ్మాయి వ్రాసిందా రమ్మనమని తక్షణం.

గణ:—ఇదివుత్తరం. అవును. రేపుమీఅల్లుడుగారు సాయింత్రంబండికి సామర్లకోట వస్తారట. నిన్ను రేపు పంపమన్నారు.

కమల;—అదేమిటి యింకొకవుత్తరం.

గణ:—అదా! డాక్టరుగారుపంపిన బిల్లు.

కమల:—లేనిరోగాన్ని పుట్టించినందుకా?

రాఘు:—ఎంతయింది?

కమల:—రెండుసార్లు వచ్చినందుకు పదిరూపాయలు, యిన్‌జెక్షనుకు అయిదురూపాయలు—మొత్తం పదిహేనురూపాయల ముడుపు.

రాఘు:—రోగాలను ఎక్కువచేసినా బిల్లుల పంప డంలో ఏమారరు డాక్టర్లు.

రాఘవమ్మ ప్రయాణం స్థిరపడింది. ఆమరునాటి "పాయింత్రానికే" కమలానికి పిచ్చిరెత్తినట్లుగా వుంది రాఘవమ్మను వదలడానికి. బండిఎక్కుతూ రాఘవమ్మ "కమలం వెళ్లివస్తాను" అని చెప్పగా కమలం ఒక్కసారి కన్నీళ్లు తెచ్చుకుంది. వచ్చిన దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది.

గణపతిరావు అక్కను రైలులో ఎక్కించి యింటికివచ్చేసరికి కమలంమొహం ఎఱ్ఱబారి కందగడ్డలా వుంది. కన్నులు వాచియున్నాయి. "ఇదేమిటని?" గణపతిరావడిగితే, "వదిన బండిఎక్కిందా" అని కమలం దుఃఖాన్ని ఆపుకోలేక ఆపుకోలేకఅంది.

"ఆడవాళ్లకు కోపమెచ్చినా నిలువలేము ప్రేమ పుట్టినా నిలువలేము. ఇదెప్పటినుంచి యింతప్రేమ" అన్నాడు గణపతిరావు.

కమల:—వదినకునాపై యింతప్రేమవుందని అనుకో లేదు. ఆవిడను నేనేల చాకరీచెయ్యాలని మాత్రి బిగించుకుని వుండుకున్నందుకు ప్రాయశ్చిత్తం బాగానే అయింది.

గణ:—ఏమయిందేమిటి?

కమ:—మీరు డాక్టరును పిలిపించి యింజెక్షన్ యిప్పించారు. అందువల్ల లేనిరోగం బయలు దేరింది. ఆచార్యులవారు తిండిపెట్టకమాడ్చారు. శ్రుతిమించి రాగంలో పడ్డట్టయింది. ఆవిడను చూసి నేను నన్నుచూసిఖిఆడ కౌగలించుకుని ఏడ్చాము. అదేమిటో ఆవిడ్ని చూస్తే మాఅక్కయ్యను చూసినట్లుగావుంది. ఆవిడమీద నాకు మొదట అసహ్యంఎందుకు పుట్టిందో తెలియకుం డావుంది.

గణ:—ఇప్పటికన్నా తెలిసిందా?

కమల:—ఆహా! అనుభవమయితే గాని అన్నీ తెలియవు.

## సంక్రాంతి: స్త్రీలు

శ్రీమతి దేశరాజు భారతీదేవిగారు

సీ. పూజకై వలసిన పువ్వులగొనిరాగ
ప్రొద్దునవెడలెడు పొలతియోర్తు,
ముంగిటిలోపల రంగవల్లులదీర్చ
గడగుచుండెడునట్టి కాంతయోర్తు,
గోమయంబును దెచ్చి గొబ్బిళ్లుగాజేసి
వాకిటనుంచెడు వనితయోర్తు,
కమనీయకోమలకంఠంబు పైకెత్తి
యింపుగాపాడెడు యింతియోర్తు,
గీ. చెల్వమొప్పార సంక్రాంతి చేడెలెల్ల,
వీథివీథుల గుమ్మరి వేడ్కతోడ,
పేరటంబునకై గ్రామపణతిగముల,
పిలచుచుందురు కన్నుల నింపుగదుర.

సీ. మురిపెంబుగా మేన ముదుకచీరను శీవి
ధరియించినదియొక్క తలిరుబోణి
పువ్వులసద్దిన పొల్పగురైకను
గుస్తరించిన దొక్కకోమలాంగి,
ముత్యాలుగూర్చిన మురిపెంపుహారమ్ము
గీలించినది యొక్క కీరవాణి
కస్తూరితిలకమ్ము కళకళలాడంగ
మోమునుంచిన దొక్క ముద్దరాలు,
గీ. సకియలెల్లరుగూడుచు సంతసమున
నరుగుచున్నారు వింత సత్యంతభక్తి
ఓలలాడింప సంక్రాంతివేళలందు
గౌరిదేవినియత్యంత గౌరవమున.

# పచ్చికనే

[గీతిక]

కవి కొండల వేంకటరావుగారు బి. ఏ; బి. యల్.

దాక్కుని వుంటాయి—దారంట—గడ్డి ని
నక్కుని వుంటాయి—
తలపఁగ రానిపూలు,
పిలువఁగఁ బోని పూలు,
నిలుపఁగలేని పూలు,
దాక్కుని వుంటాయి—దారంట—గడ్డి ని
నక్కుని వుంటాయి—
గ్రుక్కెడు వాననీళ్లకు
పక్కన నవ్వుతాయి,
ఉక్కఁగఁ గాసంతుంటె
త్రొక్కట పడతాయి.
దాక్కుని వుంటాయి—దారంట—గడ్డి ని
నక్కుని వుంటాయి—
లెక్కకురావో లక్ష,
చిక్కవు మాలనుగ్రుచ్చ,
ఇక్కడ నక్కడఁ బచ్చఁ
జక్కనఁ జూస్తాయి. ॥
దాక్కుని చూస్తాయి...దారంట...గడ్డి ని
నక్కుని చూస్తాయి—

ఒక్కడ నడుస్తూవుంటే
చుక్కలు పొడుస్తూవుంటే
మక్కున కూర్చ్యామంటాయి
ఎక్కడో యెందుకో చెప్పవు
దాక్కుని వుంటాయి-దారంట-గడ్డి
నక్కుని వుంటాయి—

మంచుబిందువు పడిన
ఎంచి బాష్పమువిడిన
అంచులఁ గాస్తాయి
వంచక మోస్తాయి
నిదాక్కుని వుంటాయి-దారంట-గడ్డి ని
నక్కుని వుంటాయి—

## పతిప్రాణ

ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దరు వారు

అది శరత్కాలము. రాత్రి ప్రథమయామము గడచుచుండెను. సుధా తుందిలములు కౌముదీవీచికలు విశ్వసౌందర్యసందేశము దిశాఫలకములపైని చిత్రించుచుండెను. సమీరబాలుడు గేయములనే చెట్లయాకులలో జేరి సణుగుకొనుచున్నాడు. దక్షిణమునుండి వాయుతరగలలో కొట్టుకొనివచ్చు శ్రీగంధ మధురసౌరభము సృష్టియంతయు నావరించినది.

ఇది యంతయు నొక జీర్ణపర్ణకుటీరమునందలి విషాదగాథలో నైవర్ణ్యము జెందినది. సృష్టిసౌందర్యమీదృశ్యమును తిలకించి ముగ్ధమై, దీనమై, కడకు కృత్రిమమైపోయినది. ఒక అమాయికురాలగు నిల్లాలి యంతిమ సాధ్వీత్వప్రదర్శనము జరుగుచుండెను. ఆమె జీవితమంతయు పరమపవిత్రమును, సేవావినమ్రమును జేసుకొన్నది. జీవితాంతమున కామెమిగుల్చుకొన్నది పతి ప్రేమయొక్కటియే. భౌతికజీవనవ్యవస్థలో సర్వము నిరాశాహతమైన భాగమే గడచిపోయినది. ప్రేమఫలములని భ్రమించిన మధురసంతానము నశించి దుఃఖమే ప్రసాదించియుండెను.ఆమె అంతిమశ్వాసలు చాలతీవ్రముగ జీవితమును ముగించుచుండెను. అవయవములు మృత్యుబాధాభరమున వక్రీభూతము లగుచుండెను. కన్నులు తేజోవిహీనములై పోయెను. అవిశ్రుతమృత్యుకల్లోలములో, కుటీరము నంతయు క్రమ్ముకొనిన దీనబాంధవుల ఆక్రందనములో నామెహృదయము ప్రియాన్వేషణము సేయుచుండెను. ఆతనిముఖ మొక్కమారుచూచి, తన హృదయఫలకాంకితుడగు మూర్తితో పోల్చుకొని కన్నులు మూసుకొన దలంచినది. ఇది ప్రకటన మెట్లగును? ప్రేమకు ప్రకటనతో బనిలేదు. దానికి కార్యక్రమములేదు. అది స్వయంప్రకాశితము. ఆదర్శమహితము.

ఆమెహృదయాధిపతి నిర్జీవుడై సమీపించెను. అప్పటికే ఆమె యువ కాశములన్నియు ముగిసిపోవుచుండెను. ఆతనికన్నులలో వ్రాసియున్న స్థిర స్థాయికమగు కృతజ్ఞవృత్తము మాత్రము చదువుకొన్నది. అత డామెను జగత్పితారాధనమునకు గద్గదితస్వరములో ప్రేరేచెను. "నాజీవితసర్వస్వము దేని కొరకంకితము సేయబడినదో అట్టిపతిప్రేమారాధనమే నాకు తరణోపాయము." ఈవాక్య మాతనిదేహమును, హృదయమును భేదించుకొనిపోయినది. ఇకేమియు బలుకలేదు. చైతన్యశూన్యమగుచున్న హృదయము, ఆమె ఆత్మశాంతికొరకెత్తినదోయిలి—అత డచలపాషాణమువలె నిలచిపోయినాడు. కవోష్ణమైన అమె వియోగాశ్రువులతో నాతనిదోయిలి ఆర్ద్రమైపోయినది. హతప్రయత్నములైన అహస్తములు పతిచరణముల వరకును చాచుకొనలేక తారుచునట్లేయాగి పోయినవి.

# అస్పృశ్యత

శ్రీమతి చిలకపాటి భారతీదేవి గారు

శ్లో. బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయో వర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తి తు పంచమః.

—మనుస్మృతి.

ఆ వాక్యము ననుసరించి యనాదినుండియు వర్ణచతుష్టయమే యీ దేశమందు స్పష్టముగ తెలియవచ్చుచున్నది. కాని పంచమవర్ణమెక్కడను నే స్మృతియందును కానరాదు. ఇటులుండ మానవజాతి ననుసరించి సమానహక్కులుగల నొక తెగవారిని పంచములని నామంబిడి వారిని నస్పృశ్యులగ నెన్నుట కడుంగడు శోచనీయము. భారతయుద్ధారంభమున పరస్పరవిరుద్ధములగు హింసాహింసలనెడి ధర్మముల జిక్కుకొని కర్తవ్యమూఢుడగు నర్జునకుగలిగిన సందర్భము లోకవిదితము. అదేవిధమున ప్రకృతమున మనభారతదేశమునంగల యస్పృశ్యత విషయమై చాతుర్వర్ణ్యజనులకుగల కర్తవ్యాకర్తవ్యవిషయికధర్మసందేహముం బాపుట ముఖ్యవిషయము.

శ్లో. అథచేత్త్వమిమంధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తతస్స్వధర్మంకీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి.

నీవు నీకులధర్మమగు యుద్ధముచేయనేని స్వధర్మమును, కీర్తిని పోగొట్టుకొని పాపమునందుదువని యుపదేశించి హింసదూష్యమైనదయినను నిష్కామముతో కర్మచేయించెను. అర్జునుడు పుణ్యాత్ముడగుటచే భగవానుడు ప్రత్యక్షముగనిలచి కార్యక్రమము నడిపించి యదేవిధమున కాలానుసారముగ ధర్మసూక్ష్మముల నెఱిగి కార్యమునాచరింపవలసినదను విషయముతో గీతను వెల్లడించెను. కాన నీసంకటసమయమున న్యాయమైన, నిర్వైరమయిన నిష్కామమున సమత్వబుద్ధితో గీతాశాస్త్రము పరిశీలించితిమేని యస్పృశ్యతా విషయమై భారతీయులకు, అందునను బ్రాహ్మణులకుగల కర్తవ్యమూఢత సులభశైలిని విడిపోగలదని ధైర్యముతో వక్కాణించెద. “అహింసాసత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః” అని మనువు ఉదాహరించిన మానవసామాన్యధర్మములలో మొదటిదియగు హింసను శాస్త్రసమ్మతముగ సమత్వబుద్ధితోడ పరిశీలించితిమేని కర్తవ్యత తేటపడగలదు. హింసయనగా ఒకజంతువును జంపుటయేగాదు, తనతో సమానమైన నే ప్రాణియొక్క శరీరమునకుగాని, ఆత్మకుగాని, గౌరవమునకు భంగమును గలిగించుటకుగాని, లేక అవమానపరచుటగాని, సచేతనమగు నే ప్రాణికిగాని పీడగలిగించినను హింసయే యగును.

శ్లో. తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్ర మశుభా నసురేష్వేవ యోనిషు॥
ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిం.

లోకములకశుభములగు కర్మలజేయుచు ద్వేషబుద్ధిగలవారును, క్రూరులునునగు నీ నరాధములను పాపయోనులయందే యెప్పుడును పడవేయుదును. ఇట్లు ప్రతిజన్మయందు నాసురీయోనులయందే జన్మమొందు మూఢులు నన్నెన్నెపుడును చేరక యధోగతి పాలగుదురని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకుపదేశించు నెపమున

మనలనుద్బోధించుచున్నది. ఆగీతాశ్లోకము నిత్యమూపఠించువారమయ్యు నీయస్పృశ్యతా స్పృశ్యతల విషయమై మందబుద్ధిగల వారమగుట శోచనీయము. నిజముగ విచారించిన నీయస్పృశ్యత యెక్కడనుండి వచ్చినది? వేదములందుగాని, గీతలయందుగాని, భగవంతునిచే యెన్నబడని యీపంచమవర్ణ మెవరేర్పర చిరి? ఏస్మృతివాక్యమునో యథార్థము చేసుకొని మానవజాతి సమానమగు నాహారాది వ్యవహారముగల యీతెగవారిని అస్పృశ్యులని పశువులకన్నను, శునకాదిజంతువులకన్నను, నీచముగచూచుట అధర్మము. పశువులు జాతిచే మనకన్న భేధముకలవయినను వానిని మనపిల్లలవలె, సోదరులవలె ప్రేమించుచున్నాము. ప్రేమించుటయేగాక వానిమూత్రపురీషములను మనచేతులతో తీయుచున్నాము. కావున్న శాస్త్రిముచే గోవు పవిత్రమైనదిగాన జాతిభేధము లెంచక యాగోవును ప్రేమతో పోషించుట యుచితమైనను మహిషాదుల కీమహిమయు, పవిత్రతయు నెక్కడనుండివచ్చినది? ఆవిషయమై విచారించిన మానసములందలి యత్యధిక ప్రేమయే మూలకారణము. అపవిత్రమగు కాకి పెంటకాళ్లతో త్రొక్కినను నావస్త్రములను మడివస్త్రము లని దర్భాసనములలో జాగ్రత పెట్టుచున్నారు. పంచముడు సమీపించిన యావస్త్రములను పనికిరావని యెంచి మడిలోగాకున్నను యితరగృహకృత్యముల యందైనను ధరించరు. కుక్క మిగుల హీనజాతిదైనను అన్నపురాశిఎంగిలిచేసినను నాపైపున కొంతయన్నము మాత్రమువదలి మిగిలినదానిని ఉపయోగపరచ వచ్చు నని పెద్దలు చెప్పుదురు.

శ్లో. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతానిచాత్మని
ఈక్షతేయోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః.

అనున్యాయమున యోగయుక్తులగు సమస్తభగవత్తునందు సమదృష్టిగల మహాత్ములు తమజీవనమే సమస్తభూతములందును సర్వభూతములయందుండు జీవుడే తమయందున్నాడనియు నిశ్చయజ్ఞానముతో నుండుటనిజమేకాని పైనుదాహరింపబడిన పెద్దలీసమబుద్ధితో, నిర్వైరబుద్ధితో, నిష్కామబుద్ధితో చెప్పి రందమా! అటులతలచుట పొరపాటు. ఏలయన నాయన్నపురాశియొద్దనున్న తాటాకులదడిసందులోనుండి పంచముడుకనుపించిన మాత్రమున నాయన్నము నిషిద్ధమని తలచెదరు. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని అనున్యాయమిపుడేమయినది? శునకమునకు చెప్పిన సామెత యిపుడేమయినది?

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.

అనుగీతాప్రమాణము ననుసరించి లోకమును నోడకు ఎదురైన సుడిగుండమును బోలిన యీయస్పృశ్య తను తొలగించుటకై సాయపడుడు, కార్చిచ్చునుకతించు నీయంటరానితనమును పారద్రోలుడు, కాన నీయస్పృశతను తొలగించుట యను నెపమున సనాతనములగు కులాచారముల మరువకుడు, సముద్రప్రయా ణముచేసిన సోదరులకు ప్రాయశ్చిత్తమును విధింపుడని వేడినను నేమియుపట్టు విడువనివారమై యాప్రయాణ ములనెంత యాపగలిగినామో అటులనే ఈయస్పృశ్యతానిరసనమును ఆపలేమని దృఢముగ నెఱుంగవలయును. ఈదినమునకాకున్నను, ఈసంవత్సరమునగాకున్న నెప్పటికయిన నస్పృశ్యతను తొలగించి సంపూర్ణస్వరాజ్య మును పొందుట నిశ్చయమని యెఱుంగవలయును.

శ్లో. అపహాయ నిజం కర్మ కృష్ణకృష్ణేతి వాదినః
తేహరేర్ద్వేషిణఃపాపాః ధర్మార్థం జన్మయుద్ధరేః.

తమస్వధర్మోక్తములనుమాని నిమిత్తమాత్రము కృష్ణకృష్ణయని నుడువుచు కూర్చుండువారాహారికి ద్వేషులు, పాపులునగుదురు. ఏలవనగా హరియొక్క అవతారములైనను ధర్మరక్షణార్థమెయే యున్నవి. మానవుడు వర్ణాశ్రమానుసారమగు కర్మనాచరించిననేగాని తానేవిధమగు ఇతరులకు సేవజేసినను వ్యర్థమనియు నది కార్యకారికాజాలదనియు మీదుమిక్కిలి పాపకరమగుననియు తెలియవలయును. కాన దేశోద్ధరణమునకై గాంధీమహాత్ముడుపదేశించిన యహింసాయుతసహాయనిరాకరణతత్వము నెఱింగి దానియంగమగు నీయస్పృశ్యతానివారణమును నెలకొల్పనెంచు పుణ్యాత్ములు ప్రథమమున తమయాత్మశుద్ధి నెక్కువ జాగరూకతతో నొనరించుకొనవలయును. స్వయంతీర్ణ పరాన్ స్తారయతి. తన్నుతరించగలవాడై యితరుల తరింపగలడు. కాన నీయుద్యమమున యస్పృశ్యతానిరసనము నవలంబింపదలచినవారు.

శ్లో. బ్రహ్మక్షత్రియవైశ్యానాం శూద్రాణాంచపరంతప
కర్మాణిప్రవిభక్తానిస్వభావప్రభవైర్గుణైః.

అను గీతావాక్యము ననుసరించి చాతుర్వర్ణ్యులకు విహితమగు కర్మలయందు శ్రద్ధాళువులై యుండవలయును. అస్పృశ్యతను తొలగించుట యనగా పంచముల దగ్గరకు రానిచ్చుటగాని వారితోకలసి భుజించుటయు సంబంధబాంధవ్యము లాచరించుటయు కాదని గుర్తించవలెను. త్రైవర్ణికేతరులవలెనే చూడవలయును.

శ్లో॥ యత్నేకృతే యది న సిద్ధ్యతి కోత్ర దోషః

మనముప్రయత్నించినను కార్యసిద్ధి కాకపోయినని చింతనొందతగదు.

శ్లో. నజానపదికందుఃఖమేకశ్శోచితుమర్హతి
అశోచన్ప్రతికుర్వీత యది పశ్యేదుపక్రమ్.

సాధారణముగ ననుభవించదగిన దుఃఖమునుగురించి విచారింపతగదు. దాని నివారణకై తనకేమయిన ఉపాయముతోచిన దానినాచరింపవలెనని నారదుడు మనకుఁ దెలిపెను, కాన దేశారిష్టమును తొలగించుటకు సాధనభూతమగు అస్పృశ్యతను తొలగించుటకై ప్రయత్నించుట అవసరము. కాననెన్ని యిడుమలనైనను సహించికార్యసిద్ధినొందించుట మనయవశ్యకర్తవ్యము అనిమనము నిశ్చయించుకొనవలయునని నారదవాక్యము వలన తెలియుచున్నది.

## రాటపుపాటలు

శ్రీమతి ఇనగంటి రత్నమ్మగారు

౨౩

మంచిగంధపుచక్క మంచునాచీకు
మాంచాలదేహము మాటలాచీకు.

౨౪

పుట్టింటివారంత భూమిమీదుంటే
పున్నపుచంద్రుడికి పూజ నేచేస్తూ.

౨౫

పున్నాపువెన్నెల్లు పూనికాయంగ
రవ్వల్లకాముడా రాకు మావాడ
వస్తునేవాడలకు తెస్తునిందల్లు.



కేశవస్వామి దేవాలయము: సోమనాథపురము

సోమనాథపురము శ్రీరంగపట్టణమునకు ఇరువది మైళ్ల దూరమున కావేరీతీరమున ఉన్నది. అచ్చటి కేశవస్వామి దేవాలయము సుప్రసిద్ధమైనది. దానియందలి శిల్పనైపుణ్యము వర్ణనాతీతము. క్రీస్తుశకము 1254 మొదలు 1291 వఱకు హొయసల రాజ్యపాలకుడుగానుండి మూడవ నరసింహరాజుదగ్గర ఉన్నత రాజకీయోద్యోగిగనున్న సోమనాథుడు అను వానిచే క్రీస్తుశకము 1268–వ సంవత్సరమున నిర్మింపబడినట్లు శాసనాద్యాధారముల వలన నిర్ణయింపనగును. ఈ దేవాలయముయొక్క ముఖవీక్షణము ఇచ్చట ముద్రింపబడినది.

౨౬
రాత్రిళ్లురాగమ్మ పగలుభోగమ్మ
రామానుజకూటమ్మ నేబుట్టిననగరు.

౨౭
ఆదివారమిల్లలికి అరుగేరుపరచి
ఆకుతోటనేబోదు అత్తింటికొరకు
బుధవారమిల్లలికి బూదేరుపరచి
పూలతోటనేబోదు పుట్టింటికొరకు.

౨౮
అల్లనేరేడుపండు అల్లుడివళ్లు
ఆరట్లగజనిమ్మ అమ్మాయివళ్లు.

౨౯
అత్తవారిల్లంటే అక్కాప్ప నీకు
అద్దమంటిమొగము అగ్గిదాకింది.

౩౦
కూర్చుండి మాయమ్మ యేమేమిగోరు
కురచగుమ్మడిపండ్లు కూతుళ్ళగోరు
అంగడి మాయయ్య యేమేమిగోరు
అంచుపచ్చడాల అల్లుళ్ళగోరు.

౩౧
వడ్రంగులిద్దరు వాదమేసుకుని
వచ్చిరికన్నవారి వంటిళ్ళుదీర్చ.

౩౨
వల్లకాడుదున్నించి వనమువేయించి
వచ్చిరికన్నవారు వంశపాలకులు
నాగజెముడును దున్ని నాటించికంద
నాకైన సైదోడు రాముడొచ్చేను.

౩౩
పున్నమ్మనాటిది పులిబాసపెరుగు
పులవదే మాపెరట పూలవాసనలు.

౩౪
చిలకవెళ్ళిపోతు గూడేమిజేసా
చిత్తమొకచోటుంటె శివుడేమిజేసా
హంసవెళ్ళిపోతు గూడేమిజేసు
అపరబుద్ధులు బుడితే యెవరేమిజేసు?

౩౫
అందచందములేని ఆడకూతురికి
అందమేరుపరుచు అప్రత్తిమాను.

౩౬
దండంబుదండంబు దండురాజులుకి
వరదండబిరుదులుకి వడ్డిరాజులుకి.

౩౭
కోదండరామువలె అన్నయ్యవస్తే
కొండలవలెమెరయు రెండుభుజముల్లు.

౩౮
గాజులశెట్టి మావాడలకువస్తే
గాజులకిపోరెట్టు గారాబుపట్టి.

౩౯
గుత్తికొండద్దాలు, గుడ్డగాజుల్లు
గుత్తపుమాచిన్ని లక్ష్మిచేతులకి.
తాడికొండద్దాలు తగుటుబిళ్లలు
తగునమ్మ మాచిన్ని లక్ష్మిచేతులుకి.

౪౦
కొట్టముచప్పుడాయె కోడెలుచెదరె
గోతిబోరుతలుప మీటువారెవరె
వారింటిఅల్లుడు వయ్యారికాడు
మల్లెలబోరుతలుపు గిరుసతీసె.

౪౧
మల్లన్న సీభూమి చల్లనిభూమి
మళ్లుకట్టకపండు మంచిరాజనము.

# ఇక నెంతకాలముండునో?

శ్రీమతి పలివెల శాంతమ్మగారు

భారతనారీమణులారా! ఆదినుండి స్త్రీలకుగల కష్టములు ఆలోచించగా నెంతవారికైనను మనసు నీరైపోవును. కాని పురుషులకుమాత్రము వారిమనస్సు నీరైపోవుటకు బదులు కఠినమగును. స్త్రీలనిన బానిసలు, స్త్రీలనిన తెలివిలేనివారు, స్త్రీలనిన యంత్రములు, స్త్రీలనిన దుర్బలురుఅనియే తలంచెదరు. కాని పురుషులకన్న ధైర్యసాహసములందును, తెలివిజ్ఞానములందును స్త్రీలే ఎక్కువవారని కలనైననమ్మరు.

సౌఖ్యములు అనుభవించుట పురుషులవంతు కష్టములు అనుభవించుట స్త్రీలవంతు. ఒక స్త్రీకి ఆడపిల్ల పుట్టెనేని; మొగపిల్లవాడు పుట్టినంతసంతోషము అతండ్రికుండనే ఉండదు. అది అటులుండ ఆడపిల్లను కనినందుకు ఆభార్యను కొట్టడము, తిట్టడము, కఠినముగాఏలుట మొదలయిన చిహ్నలేగాని; అయ్యో భగవంతుడీయాడుబిడ్డనిచ్చినాడు. ఇంతేచాలును అని సంతోషించని మగవారు ఈభరతఖండములో చాలామందికలరు. ఆడుబిడ్డను మగబిడ్డను ఐదారుసంవత్సరములు వచ్చువచ్చేవరకు ఇంచుమించొకరీతిగనే చూచెదరు. అక్కడనుండి ఆడబిడ్డను తల్లిదగ్గర ప్రొయ్యిపనికిఅప్పగించి మగపిల్లవానికి మంచిబట్టలువేసి షికారుకు తండ్రి తీసుకవెళ్ళను. ఆరీతిగానే ఆడపిల్లను షికారుకు తీసుకొనివెళ్ళమని భార్యభర్తనెంత బ్రతిమలాడినను నడవలేదనియు, భయపడుననియు సాకులుచెప్పి తప్పించుకొనిపోయే మగవారు మన భరతఖండములో అనేకమందిగలరు.

ఇక ఆడుబిడ్డకష్టములనుగూర్చి ఆలోచించుదము. ఆడబిడ్డల కేడెనిమిదేండ్లు వచ్చిరాకముందే వంటపనులకు నిర్మింతురు. ఇంట్లో అంట్లుతోమడము వంటలువండడము ఈమొదలయిన పనులలో బాగుగా నలిపివేయుచు ఎక్కడికి కదలనీయకుండా వారిని అణిచివేయుదురు. వారు ఎక్కడకు కదలకుండ ఒకమూలలో ఉండుటవలన వారికి కాస్తసాగక కాళ్ళలోసత్తువలేక బలహీనులవుట, ఒకేదిక్కున లభించెడిగాలి పీల్చుటవల్ల ఉబ్బసము, క్షయ మొదలగు వ్యాధులు సంభవించుట, వారు అనేకమైన సంగతులు చూడకుండ యుండుటవలన లోకానుభవము పూర్తిగాలేకపోవుట ఈవిధముగా పూర్తిగా పాడైపోవుదురు. అక్కడనుండి ఆమెకు పదకొండుపండ్రెండుసత్సరములు వచ్చుసరికి ఆమెను ఒకసంసారిచేయునంతపనులు వచ్చునట్లుగా తయారుచేయుదురు. ఆమె పెద్దవారిలెక్కలోకూడ చేర్చబడును. అక్కడనుండి ఆమెకు నెలనెలకు చెప్పరానంత బాధ అనుభవించవలసివచ్చును గదా! ఇక ఆబాలిక నత్తవారింటికి పంపెదరు. సంసారపుభారమంతా ఆమెమీద నేపడును. ఇక ఆమెబరువుకన్నా రెండురెట్లు బరువుగల నీళ్ళబిందెఒకటి ఆమెతలపైబెట్టి నీళ్ళకు బంపెదరు. ఈ బిందెలు ఎత్తుకొనుటలోను దింపుకొనుటలోను గుండెలలో నొప్పిలేచిన తాను బ్రతుకుదినములన్నియు ఆవిధముగా బాధపడవలసినదే. ఆమెకు అత్తలేదా! సరి. అత్తఉన్న ప్రతికోడలు అత్తకు లోబడియుండవలసినదే! అత్తఅనినకోడలకు భయము, కోడలనిన అత్తకుకోపము. మరి ఈ"అత్తాకోడలు", అను మాటలలో ఏమి మహాత్యమున్నదో ఏరికి తెలియదు. "అమ్మా ఆది తినవద్దని తల్లి చెప్పిన ఇదితింటే జబ్బుచేయునుగాబోలునని కుమార్తె అపస్తువును తినదు. అమాటే అత్త కోడలితో చెప్పిన నేనుతింటే ఓర్వలేక మాయత్త అన్నదని కోడలు ఊహించును. "అమ్మా నాతలనొప్పిగానున్నది కొంచెము మంచిగంధము అరగదీయుము" అని కుమార్తె తల్లితో చెప్పిన తల్లి అయ్యో! బిడ్డకు ఎంతబాధగానున్నదో అని త్వరలో ఎంతోపరిచర్య చేయును. అదే మాట అంతకన్న విధేయతతో కోడలు అత్తగారితో చెప్పిన నీకు నేను పరిచర్యచేయవలయునా? అని ఎంతోసేపు కలహించి పిదప ఇంకా కోపముపోక కుమారునితో చెప్పి ఆమెను శిక్షించును. ఆవిషయము న్యాయమాలోచించెడు భర్త అయిన న్యాయము ఆలోచించి ఇద్దరిని సమాధానపరచును. కొంతమంది భార్యలో తప్పులేదని తెలిసియు తల్లిమీదయుండు ప్రేమ చొప్పున భార్యనుగద్దించి కొట్టేమొగవారు ఈభరతఖండములోనే కలరు. అత్తలేనికోడండ్లకు ఆడపడుచులైన ఉందురు. వారివిషయము భార్యలో తప్పులేనప్పటికిని చెల్లెలుమీద యుండు ప్రేమతోనైనను లేక ఇతరులుచూచి మెచ్చునట్లుగాను భార్యలను

దూషించేభర్తలుకూడా అనేకమంది కలరు. భాగ్యవశమున ఆమె గర్భముదాల్చెననుకొందము. మూడు నాలుగు నెలలనుండియో, లేక అంతకుముందునుండియో తిండితినకపోవడము, తినిన ఇమడకపోవడము జరుగును. ఇక ఆమెకు తొమ్మిదిమాసములు నిండువరకు ఆబాధ, తొమ్మిది నెలలునిండిన, ప్రసవించు సమయములో చనిపోవునో బ్రతుకునో అది భగవంతునికెరుక. ఆనొప్పుల బాధలు సహించవలయును. తల్లిచనిపోయిన బిడ్డకుకష్టము, బిడ్డచనిపోయిన తొమ్మిది నెలలు గర్భముమోసినది. కష్టముల కోర్చితినిగాని బిడ్డదక్కలేదు కదా అనేవిచారము తల్లికి మిక్కుటముగా ఉండునుగదా! తల్లిబిడ్డ సజీవులైయున్నారనుకొందము. ఆమెకు బిడ్డయను సంతోషమేగాని కష్టములు మిక్కుటముగానేయుండును. రాత్రులయందు బిడ్డకు వెచ్చని బట్టలువేసి నిద్రించి పండుకొనును. ఇంతలో బిడ్డ పాలకులేచును. ఆబిడ్డకుపాలుఇచ్చి నిద్రబుచ్చినవెంటనే నీరుడువిడచును. మరలా పొడిబట్టలువేసి నిద్రబుచ్చిన మరికొంతసేపటికే బయటికి విడుచును. ఆబట్టమార్చిమరలా పరుండిన ఇంతలో పాలకులేచును. ఈవిధముగా రాత్రంతయు జరుగుచున్న ఇక ఆమెకునిద్రఎక్కడిది? రాత్రులయందు తొమ్మిది లేక ఎనిమిదిగంటలు నిద్రపోవలయునని ఆరోగ్యవిషయము డాక్టర్లుచెప్పిన ఆమెకు అందులోసగమైన నిద్రదొరకనియెడల ఆమె ఆరోగ్యమెక్కడ? పోనీ రాత్రులయందు బిడ్డతోతల్లి కష్టపడుతూయుండ పైగానిద్రకు ఆటంకమని భర్త ఇంకా అక్కడ ఉన్నవారు సణుగుదురు. ఆబాధకుపైగా ఈబాధయొకటి. ఆమెఎంతో పథ్యముకూడా చేయవలయునుగదా! మరి.

ఇకఆమె తెల్లవారకముందులేచి ప్రాచిపనులన్ని చేసికొని వంటలు వండుకొనవలయును. ఇంకాదాని తోతృప్తినొందక భర్తవారిచే చాకిరీచేయించుకొనుట పనులుచేయుటవల్ల శరీరము నొప్పిపట్టిన త్వరలో పనులుచేయలేకపోవును. ఇక ఆమెవైపు కొంచెము కనికరము చూపుటకుబదులు సోమరి, చురుకుతనము లేనిదనియు పేర్లుపెట్టుట. ఈవిధముగా బిడ్డలున్న స్త్రీలకు కష్టములున్న ఇకబిడ్డలులేనిస్త్రీలనో, వారుగొడ్రాండ్రు ఆమెముఖముచూస్తే పాపము. ఇంకాఆమెనుగూర్చి అపుత్రస్య గతిర్నాస్తి అనికూడా కల్పించారు. పైగామూలిగే నక్కమీద తాటికాయపడ్డట్టు బిడ్డలుకలగలేదని విచారించుచున్న స్త్రీమీద ఈమాటలు. ఇక బిడ్డలుకనని భార్యను భర్త ప్రేమించునా? ఆమెనుచూచిన ఇతరులేసహించలేకుంటే ఇక భర్తమాత్రము ఓర్చగలడా?

ఇక భర్త చనిపోయిన భార్యగతో? అనిచెప్పనేలేము. భర్తపోయిన భార్యలకు మారుపేర్లు చాలాపెట్టారు మహాత్ములు. ముండ, విధవ ఇంకాఅనేక పేర్లుగలవు. ఆమెకు విచారమెక్కువ. ఆమె ఏమిఅలంకరించుకొనదు. ఎందుకు? భర్తలేడని విచారమువలననే. ఆమె అవసరమైన పనివలననో లేక ఏవిషయమైనను మంచియుద్దేశముతో ఎవరితోనైనను మాట్లాడిన అనేకతంటాలు తగుల్కొనును. ఈవిషయములో కొంతమంది మరలా వివాహము చేసుకొందురు. కొంతమంది భర్తమీదయుండు ప్రేమచొప్పన మరలా వివాహమాడుట కిష్టపడరు. బ్రాహ్మణులలో భర్తలుపోయిన భార్యలకుండుకష్టములు ఈలోకములో నరకమనియే చెప్పెదరు.

పైకష్టములాలోచించి ప్రేమతోనేమి, భక్తితోనేమి, పైకష్టములు సంభవించుననుభయముతోనేమి ఎటువంటి భర్తలైనను పువ్వులలోపెట్టి పూజించవలసినదే. పైకష్టములాలోచించి పెండ్లిచేసుకొనుట మానిన వారినిచూచిన మగవారికి పరిహాసము. వారుఎవరితో ఏవిషయము మాట్లాడినను అనుమానము. వారు మంచియుద్దేశములతో ఉన్నను అనేకవిధములగు పేరులుకల్పించడము. ఈవిధముగా పెండ్లిగానిస్త్రీలకు కష్టములు.

ఇక పురుషుల సుఖములాలోచింతము. రాజు ఇంటిలోమొదలు పేదవాని ఇంటివరకు మగబిడ్డపుట్టిన ఉండుసంతోషము ఆడబిడ్డపుట్టిన ఉండనే ఉండదు. వారికైదారు వత్సరములు ప్రాయము వచ్చుసరికి వారికి

విద్యగరుపుట ఈవిషయములో తల్లిదండ్రుల ప్రాణములనైనా అమ్మి బాలుని చదివించెదరు. వారు ఎక్కడకు వెళ్లినను గద్దించక పోవడము. వారుషికారులు, అర్ధరాత్రులందు చూచెడి డ్రామాలు, సినిమాలు మొదలగు వినోదార్థములగువాటిని చూచుటకు అర్ధరాత్రులందు వెళ్లినవారిని గద్దించక వారికికావలసినసొమ్ము ఇచ్చుటను ఈవిధముగా తల్లిదండ్రులు గారాబముతో వానిని పెంచెదరు. అతడు పెద్దవాడైనతరువాత పెండ్లిచేయడము ఇక అతనికి భార్యదొరుకును. ఆమెను ఏలుట ఆమెమీద అధికారము చేయుట. ఆమెనుకొట్టుట మొదలగుపనులు చేయుటకు అతనికి అధికారము దొరుకును. స్త్రీలు పురుషులకన్న ఈవిధముగా కష్టములు పడుచున్నారు. కాన ఈవిధముగా కొంతమంది మగవారు మనలను బాధించుచున్నప్పటికి కొంతమంది మహనీయులు స్త్రీలనిన మాతలనియు, అన్నిజన్మములలో స్త్రీజన్మమే గొప్పది అనిచెప్పుచున్నారుగాన మనము ఆ పేరును సార్థకముచేసుకొనుటకు ప్రయత్నించవలయునని నాకోరిక.

## పౌష్యసంభావనము

హరి రాధాకృష్ణమూర్తిగారు

కఁనుబత్తిం దెలివొందు లేనలసింగారంబుఁగ్గై సేసి పూ
మడులం జాలులువారు తేనియలతో మత్తిల్లిరాయంచ తుం
డుడుకుం బల్కులమాటలాడి కడలం దోరంబులొంవంట లి
మ్మడిగాఁ బంచుట నాతియాకడలి మామన్నాగ నిన్నెన్నదన్.

తెలతెలవారకే చెలులుదిద్దిన ముగ్గులపైన గొబ్బిళుల్
పొలుపుగఁబెట్టి 'గొబ్బెమరో పొందికజేయువె మొమ్మొకాని' యన్
బలుకులఁ బల్కుకన్నియల పజ్జను సంకురుమయ్యచేరి వా
రలమురిపించు ప్రొద్దులివి రాగలవే నినువీడి క్రొన్నెలా.

ఆలుమగళ్లు వేరుబడనైనవి కాపురముల్ మరెన్నిరో
నాళులు నీకడం గలుగునా మరిమచ్చికమందులంచు మా
గోలలు నిన్నుకోరిరివెగో కలయించితి కాపురాలు నీ
మేలిమునుంగు పచ్చలయి మిక్కిలిగా మనుగాతమోసకీ!

పచ్చవిల్తుని తల్లి మచ్చికం బరపు వ
చ్చనిచేనుఁగోయు నీజతనమేమి
పంక్తితో నేవేళఁబరిపాటినొందు మ్రాఁ
కును మోడుఁజేయు నీకులుకిదేమి

పవలెల్ల వెలిగించు పగటివేలుపునుక్కు
నడగించు నీ మంచుపడలివేమి
పలుము త్రియముల పేరులుఁగోరు ముద్దరా
లికిక్రొవలన్న గిల్లింతలేమి

ఎండనక వానయనక తానుండువరకు
బనిఁజెలఁగురైతు చలిచేత వణకనేమి
పీనినన్నిటిఁ గనఁగ మాపీట నీవు
లచ్చియనిపించుకొను తొలిలచ్చివేమొ?

మొసలిపట్టిన నీకునైన పసలదక్క
వగవకయ ప్రజల్ పండుగుపంఁగనుచు
వాకిళులముగ్గులిడి పిండివంటకముల
మెక్కెదరు- వారికేమొగ్గు మెలఁచినావొ!

# సంభావన

ఆలూరు రామచంద్రయ్యగారు బి. ఏ.

నైజాము రాష్ట్రమునకు చెందిన గద్వాలసంస్థానమున ప్రతియేటను సంభావన జరుగుచున్నది. ప్రాచీన హైందవాచారములపై నాధారపడిన ఈవాడుక విజయనగర సామ్రాజ్యము ఉన్నతస్థితియందున్న కాలము నుండి గలదని ప్రతీతి. ఆంధ్రదేశమునుండివచ్చి సభకూడిన పండితోత్తములగు భూసురుల కిటీవలనే గద్వాల రాణి అల్లుడు పట్టభద్రుడు కాబోవు తన మైనరు కుమారుని తరఫున రు. 15,000 విరాళ మొసగెను.

ఈయాచారమునుగూర్చిన గాథను టైమ్సు ఆఫ్ ఇండియా ప్రత్యేక విలేఖరి యీవిధముగ జెప్పుచున్నాడు: రెండువందల సంవత్సరములకు పూర్వము గద్వాలునకు మహారాజ సోమనాద్రిభూపాలుడు అధిపతిగనుండెను. అతడు ఇప్పటికిని చెక్కుచెదరకయుండు కోటను కట్టించుచుండెను. అందుగోడ కొకభాగము యెన్నిసార్లు కట్టించినను కూలిపోవుచుండెను. దేవత లాగ్రహించిరనియు, వారిని శాంతిపఱచిన గానిగోడలు నిలువవనియు తీర్మానమైనది. రాజు తన ఆస్థానజ్యోతిష్కులరావించి సలహాకోరెను. వారును యోచించి నరబలియిచ్చిన గాని గత్యంతరము లేదనిరి. మరియు బలియొసగబడువాడు భూసురుడుగ నుండవలయుననియు, కపాలము చిన్నదిగను, కుశాగ్రబుద్ధిగలవాడుగ నుండవలెననియు తెలిపిరి. ఇట్టి ద్విజన్ముడు దొరకుటకరుదు గాన రాజు మిక్కిలి దుఃఖించి యెట్టకేలకు తానొక విద్వత్సభజరిపించునట్లును, తర్కమునందు జయించిన భూసురునకు విరాళ మొసంగునట్లును చారులచేత దేశమందంతటను చాటింపించెను. అనేక దేశములనుండి పండితులరుదెంచిరి. గద్వాలు కాశియయ్యెను. రాజుగారిభవనములో ఎచ్చటఁజూచినను బ్రాహ్మణులే. దేవతలే తనకు సహాయపడిరోయనునట్లు అందు మామిడితలయు మంచిపాండిత్యమునుగల బ్రాహ్మణుడొకడు రాజునకగపడెను. ఇతని వాసస్థానము కాంచీపురము. పేరు కేశవాచారి. ఈయన తర్కమునందందరిని అవలీలగ జయింపగల్గెను. అపరిమితానందభరితుడై రాజాతనికి లక్షరూప్యములును యితర కానుకలనొసంగి అతనియందలి గౌరవమును చూపుటకోయనునట్లు అతనిని యెప్పుడును తనవద్దనే యుండునట్లు కోరెను.

ఒకనాడు సోమనాద్రిభూపాలుడు నూతనముగ నిర్మింపబడు కోటను చూపుటకై కేశవాచారి నాహ్వానించెను. కేశవాచారి రాజుచేచూపబడి ఇదివరకు నేలకూలిన గోడలక్రింద త్రవ్వబడినపల్లమును తొంగి చూచుచుండెను. ఇదే సమయమని రాజు తనకత్తితో ఒక్కవ్రేటున కేశవాచారి శిరముఖండించి మొండెము నాపల్లములో బడద్రోసెను. మరల పల్లమునుపూడ్చి గోడలనెత్తించెను. ఈసారి శిలవలె దృఢముగ గోడలు నిలచినవి. రాజు సంతసముతో నింటికి బయలుదేరెను.

కాని పాపము అతని సంతసమంతటితో అడుగంటెను. అతనికై యుంచబడు అహారమంతయు మలినమగుచుండెను. అన్నమంతయు పురుగులుగ మారుచుండెను. ఆకలికి తాళజాలక పస్తుచేత రాజు మృత్యుదేవత నాహ్వానించుచుండెను. రాజుగారి అవస్థఁజూచి జనులందరు వ్యసనపడజొచ్చిరి. "బ్రాహ్మణవధ మహాపాతకము కాబట్టి రాజు అట్టికృత్యమును మనసునందైనను తలపెట్టరాదు" అను మనుధర్మసూత్రరహస్యమును రాజుగ్రహించెను. ఇట్టి సమయమున కేశవాచారి రాజుకలలో అగుపడి నీవు నన్నుమోసగించి చంపితివి కాబట్టి నీవెనుక రాజ్యమేలుటకు పురుషసంతతి లేక నీవు మరణింతువు గాకయని శపించెను. మరల కొంత శాంతమొంది బంగారుతో నావిగ్రహమును చేయించి, ఒక దేవాలయము కట్టించి, ప్రతిసంవత్సరమును భూసురులను నీవును నీసంతతివారును సంభావనలిచ్చుచో నీయాత్మకు మంచిగతి కలదని నుడివెను.

రాజుమేల్కాంచి తక్షణమే ఒకదేవాలయము నిర్మించి కేశవాచారి విగ్రహమును బంగారముతో చేయించి ప్రతిష్ఠించెను. అంతియగాక తనరాజధానికి కేశవనగరమని పేరిడెను. అప్పటినుండియు గద్వాలు సంస్థానమునకు ఆడుసంతతివారే అధిపతులగుచున్నారు. గతమహారాజునైతము మగసంతానము లేకనే మరణించెను. సంస్థానము ప్రభుత్వపోషణక్రింద యుంచబడి యిటీవలనే రాణిసాహెబాకోరికపై కొన్నిషరతుల నేర్పరచి, నైజాముప్రభువు సంస్థానము నామె వశముగావించెను.

రెండు శతాబ్దములనుండియు, ప్రతియేటను బ్రాహ్మణులను రావించి విద్వత్సభలుజరిపి, గెలుపొందిన వారికి బహుమతులిచ్చుట గద్వాలులో జరుగుచున్నది. ఇటీవలజరిగిన సభకు అనేకులువచ్చి తమ పాండిత్యమును ప్రకటించిరి. వచ్చిన ధీమంతులను తెల్లని వస్త్రములపై కూర్చుండ నియమించి సభముగియగనే వారి పాద ధూళినిసేకరించి గద్వాలుకుటుంబీకు లందరు తిలకము నిడికొందురు. ఇది వారిపెద్దగావించిన అకార్యమునకై తాముజేయు పరిహారము.

## ప్రాతఃపక్షి పాటలు

శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

౧

ఎంతపిచ్చివాడో తాలక్ష్మణుండు
అడవుల తిరిగేటి యన్నకోసంబు
మురిపాలదొంతిని తనదైనయింతి
సామ్రాజ్యసౌఖ్యాలువీడి తా చనెను.
సేవాత్మబుద్ధికి చెలగునే సీమ?
భక్తిని, శ్రద్ధను, కొలువంగ గలమె?
భ్రాతృప్రేమకు నేకలక్ష్యంబు నతడె.

౨

దేశదేశాలను బాంధవు లుంద్రు
లచ్చుమన్నను బోలుభ్రాత యెందుండు?
భ్రాతృసేవాబద్ధభావనాసక్తి
అలిని, సౌఖ్యాన్ని, అయోధ్యవిడచె.

౩

కైకను జంపంగ కత్తినిదూసి
భరతుని ననుమానబుద్ధితో జూచె
నిద్రయు, భద్రయు, నాహారనియతి
ఎఱుగక సేవించె నన్న నో హో హో?

౪

తద్భ్రాతృభక్తికి పారంబు కలదె?

౫

ఊర్మిళ తానెంత తెలివిమాలినది
పతిమాటవిని తాను పడియుండె నింట
అన్నంబు, పానంబు, సౌఖ్యంబువిడచి
ఒంటరియై తాను వనటను బొందె.

౬

ఊర్మిళదెంతటి యుత్తమబుద్ధి?
సీతనుమించిన దివ్యవిస్ఫూర్తి
ప్రాణవిభు నాపతిని శిరసునదాల్చి
పదునాలుగేండులు పతివిరహమ్ము
వహియించి సహియించి వర్ణ్యమారీతి
పతివలె నింద్రియజేత్రియై వరలె.




శ్రీమతి పిండిప్రోలు కొండయాంబ గారు

౧

బాలికలు అందరూ ఒకచోటచేరి ఒక్కొక్క స్తంభం వద్దనిలిచి ఆడుకొనునప్పుడు, చప్పట్లు వేసుకొనే టప్పుడు యీమాటలుచెప్పి తలకట్టు అన్న పదమువచ్చే పిల్ల ఓడినట్టుగా అందరూ పండి మిగిలిన పిల్లని దొంగగా ఎన్నుకొందురు.

నాలుగు స్తంబాలాట.
నడిమింకి, తోడిమింకి
తప్పక తనపేరెవరంటే
కాకరసీసర, కొబ్బరితలకట్టు.

౨

ఇద్దరుబాలికలు ఒకచేయి ఒకరుపట్టుకొని గిరగిర తిరుగుతూ యీమాటలు అంటూ ఆడుకొందురు.

విసిరీ విసిరీ పేలపిండి
విసరలేను జొన్నపిండి
మాఅవ్వ సవరం మాకుతే
మాదేవుడి గిన్నె మాకుతే.

౩

పాపాయిని ఒడిలో కూర్చొపెట్టుకొని యిట్లు ముద్దులాడుచుండిన బిడ్డ పకపక నవ్వును.

అమ్మలగన్న నాన్న
అంబలిగిన్నె నాన్న
వజ్రాలతల్లుల నాన్న
వరహాలపేరుల నాన్న
వలకబొబ్బల నాన్న
కాసులపేరుల నాన్న
కన్నతల్లుల నాన్న.

౪

రెండుసంవత్సరముల బాలురు బాలికలు ఉడుతను చూచి యిట్లు పాడుతూ గెంతులువైచి ఆడుకొనుచుందురు.

ఉసుత ఉడుత హూత్తు
ఎక్కడకెళ్లా హూత్తు
బజారుకెళ్లా నూత్తు
ఏమిటితెచ్చా వ్రూత్తు
బెల్లంతెచ్చా నూత్తు
అయితే, నీకు కొంచెం
నాకు కొంచెం.



# పాకకళ

—పాగాఖిరి—

వాసనగల బియ్యమొక శేరు, శనగపప్పు మూడర్ధపావులు ఈరెంటిని చక్కగాకడిగి ఆరబోసి యుంచి 2½ శేర్లు పంచదార లేతపాకము వచ్చునట్లు మరగనిచ్చి అది చక్కగావడియగట్టి మరియొక పాత్రలోబోసి పొయిమీదబెట్టి ½ శేరునీళ్లుదానిలో బోసి మరగనిచ్చుచుండవలయును. ఈపానకమిట్లు మరుగుచుండగా బాణలిలో చాలినంతనెయ్యిబోసి దానిలో బియ్యము, పప్పును వదునుతప్పకుండా వేయించి వాటి పానకములోచేసి మూతబెట్టవలెను. ఇట్లువేసినవి చక్కగా పక్వమగుటను కనిపెట్టి పావుశేరు నెయ్యిగాని లేక వెన్నగాని 1 తులము యాలకులపొడి, ద్రాక్ష, జీడిపప్పువేయవలెను. అధికముగా భుజించినచో గురుత్వమును ఇంచుక మలబద్ధము చేయును. శరీరమునకు చలువనిచ్చి కాంతిని గలుగచేయును.

—కోకా పంకజమ్మ.

—పువ్వు పిండి వంట—

ఒకశేరు మైదాపిండితెచ్చి పల్చగా దోసెలపిండి లాగున కలుపవలెను. ఒకశేరు చక్కెర లేతపాకము పట్టి వుంచుకోవలెను. బాణెలమూకుడులో ఒక శేరు నెయ్యిపోసి కాగినపిమ్మట గులాబీగుత్తిని (పువ్వు కోరమును) నేతిలోముంచి కొంచెము కాలనిచ్చితీసి వెంటనే కలిపివుంచుకొనిన పిండిలో సగమువరకు ముంచి తిరుగ నేతిలో ముంచవలెను. అప్పుడు పువ్వులు రాలును. ఇట్లే గులాబీగుత్తిని (పువ్వుకోరమును) కాగిననేతిలోముంచుచు, తిరిగి పిండిలోముంచి మరల నేతిలో ముంచుచుండిన పువ్వులురాలును. వాటిని కొంచెము దోరగావేగనిచ్చి తీసి పాకములోవేసి అయిదునిమిషములుంచి తీయవలెను. పువ్వుకోరములు అన్నిపట్టణములలోచేసి అమ్మెదరు.

—నాయని కమలరత్నము.

—పేసంగి మెట్లు—

2 ఆఠాకులబియ్యము నానబెట్టి పిండికొట్టవలెను. 1 ఆఠాకు శనగపప్పు చిమడకుండగను వలుకు లేకుండగను ఉడుకబెట్టి వార్చి ఆరబెట్టవలెను. ఆరబెట్టినపప్పు రెండుగిన్నెలు, పిండి ఒకగిన్నె కొలచి రోటిలోవేసి కొద్దిగ ఉప్పువేసి మెత్తగరుబ్బవలెను. రుబ్బునపుడు నేయిపోయుచు చాల మెత్తగరుబ్బవలెను. ఒకఆకుపైన రుబ్బినపిండి చిన్నచిన్నముద్దలుగతీసి ఒకముద్దనుపెట్టి చిన్నపూరీవలె చేతితో మెల్లగచేసి అందుకొద్దిగచక్కెరపూర్ణముపెట్టి మడువవలెను. అట్లుమడచిన దానిని నేతిలో ఒక్కటొక్కటిగవేసి దోరగవేయించి తీయవలెను. వేయించునప్పుడు చట్రముతో నేతిని వానిపైకి చిమ్మిన బాగుగ గుల్లబారును.

—తాయి రత్నమాల.

—సొరకాయ ఆవ—

లేతసొరకాయ చెక్కుదీసి సన్నముక్కలుగా తరిగి పచ్చిమిరపకాయలు ముక్కలుగా తరిగి రెండును వేర్వేరుగాకొంచెమునూనెవేసి కొద్దిగా

వాడ్చి ఆరబెట్టవలెను. తరువాత ఒక అల్యూమినియము పాత్రలోగాని రాచిప్పలోగాని కొంచెము చింతపండు నానబెట్టి చిక్కగా పులుసుపిసికి వుంచుకోవలెను. తర్వాత ఆవాలు కొంచెము నూరివుంచి ఇంగువ నానబెట్టి వుంచుకోవలెను. పైపులుసులో నూరి ఆవపిండి తగుపాటివుప్పు మిరప్పొడి పసుపుపొడి యింగువపాలు వాడ్చిన పచ్చిమిరపముక్కలు వేసి కలిపి వుంచి నూనె కొంచెము కాచి మిరపకాయముక్కలు మెంతులు ఆవాలు తిరుగబోత వేయించి కలిపి వొక పూట వూరనిచ్చిన తర్వాత వేసుకొని భోంచేసిన రొండల రుచిగానుండును.

—జి. యల్. సావిత్రమ్మ.

—బొరుగుల హుళక్కి—

ఒక సేరు బొరుగులు నీళ్ళలో వేసి నాననీయకుండా వడితూపోసుకొనుకు సేది. ఒక గిన్నెలో ఒక పలం నెయ్యి వేసి పొయ్యిమీదవుంచేది. పచ్చిమిరపకాయలు, ఎల్లగడ్డలు సన్నసన్న ముక్కలుగా తరిగి వుంచుకు సేది. పచ్చికొబ్బరిగాని లేక ఎండుకొబ్బరగాని తురిమి వుంచుకు సేది. ఆవాలు, మినపప్పు, కరేపాకు పొయ్యిమీదవున్న గిన్నెలో తిరుగబోత వేసిన తర్వాత పైబొరుగులను పోయవలెను. ఉప్పును పొడిచేసి తగుమాత్రము చల్లవలయును. అంగడిశనగపప్పు మెత్తగాపొడిచేసి చల్లవలయును. ఒకనిమిషము మూతమూసి రెండుపర్యాయములు కలియబెట్టి దించుకొనునపుడు కొద్దిగా నిమ్మపండ్లరసమునుపిండి దించవలయును. ఉదయముపూట కాఫీతో కూడ ఫలహారముగాగాని, ఎండవేళ ఫలహారముగాగాని వేడివేడిగా భుజించిన మెత్తగాను బహురుచికరముగాను వుండి తేలికగా జీర్ణమగును. దీనినే బొరుగుల హుళక్కి అనెదరు.

—యస్. సుబ్బరత్నమ్మ.

—పడమటిసీమ వత్తుడుపోళీలు—

1 సేరు శనగపప్పునకు ¾ సేరు గోధుమపిండి (అనగా తోకగోధుమలు విసిరినపిండి)ని, కొంచెము సున్నము పసుపు నీటిలో కలిపి వసంతము కలిపి గోధుమపిండిలోపోసి కలిపి జానెడు సాగునంత పదునుగా ముద్దచేసి వుంచుకోవలెను. తర్వాత శనగపప్పును పొయ్యిమీద ఎసరుపెట్టి ఉడికించి బాగుగా వుడికినతర్వాత నీళ్ళువంచి పప్పులో ½ వీశ బెల్లంకలిపి రోటిలో వేసి రుబ్బివుంచుకు సేది. పూర్ణములో యాలక్కాయలపొడి, కొబ్బరకోరు, మంచిమామిడిపప్పు సన్నగాతుంచివేసి కలిపి పెద్దనిమ్మపండంత ముద్దలుగా జేసి పైజెప్పిన గోధుమపిండిపలైజేసి చేతికి అంటుకోకుండా చమురు నెయ్యి చేసుకోవలెను. పల్లెలో పూర్ణము పెట్టి ముద్దచేసివుంచేది. తర్వాత పీటగాని మిట్టపళ్ళెము బోర్ల వేసిగాని వుంచి దానిమీద మూరెడుగుడ్డ తడిపి గట్టిగాపిండి పళ్ళెముమీదగాని పీటమీదగాని వేసి గుడ్డమీద పచ్చిపిండిచల్లి పూర్ణముపొదిపిన ముద్దను గుడ్డమీదపెట్టి అప్పడములకోడుపుతో సన్నగా వత్తవలెను. తర్వాత పొయ్యిమీద పెనమువేసి కాలనిచ్చి తడిగుడ్డ చమురులో తడిపి పెనముమీదరాచి వత్తినదానిని పెనముమీద ఎఱ్ఱగా కాల్చవలెను. ఇట్లనే పూర్ణమును పెట్టి గోధుమపిండితో పొదిపి వత్తి పెనముమీద కాల్చవలెను. తర్వాత కాలినపోళీలు చల్లారినతర్వాత మనము తినునప్పుడు నెయ్యి వేసుకొని ముద్దచేసి తినిన బహురుచిగానుండును. సయించినరొండల పాలుకూడాపోసుకొని తినవచ్చును.

—జి. యల్. సావిత్రమ్మ.

—మాల్పూరీ—

గోధుమలలో ముందుగా కొంచెము నీళ్ళుపోసి దంచవలెను. తదుపరి ఎండపోసి చెరిగి బాగుచేసిన తరువాత దానికి సరిపోయినగోధుమలు నీటిలో నానపెట్టవలెను. బాగుగా నానిన తరువాత నీరులేకుండ శుభ్రముగాకడిగి ఆగోధుమలకు సరిపడినంత పంచదార వేసి పాలుపోసి రుబ్బవలెను. మెత్తగా రుబ్బినముద్దను ఒక మూతివెడల్పుగాఉన్న గిన్నెలోఉంచి తరువాత పొయ్యిమీద పెనము వేసి బాగుగ వేడిపడిన తరువాత కొంచెము నెయ్యిపోసి తరువాత పైచెప్పినముద్ద అట్టుమాదిరిగాచేసి పెనముమీద వేయవలెను. బాగుగ రెండుప్రక్కల కాలినతరువాత అట్లకర్రలో చిన్నచిన్నరంధ్రము చేసి దానిమీద మరికొంచెము నెయ్యి పోయవలయును. తరువాత దానిని భుజించిన చాలా రుచికరముగా ఉండును.

—సనకా శ్రీ దేవమ్మ.

# శ్రీ పాండురంగ!

శ్రీమతి కురుగంటి వేంకటలక్ష్మమ్మగారు

పరిపరివిధంబులను నిన్ను ప్రస్తుతింప
పలుకవేలను నాతండ్రి! భక్తవరద!
సురుచిరాలంకార! మోహసుందరాంగ!
పరమపావనచరిత! శ్రీపాండురంగ!
బ్రహ్మరుద్రేంద్ర! భూషితపరమపురుష!
వేదవేదాంతసన్నుత! విశ్వమయుడ!
తాపసార్చితనారద! తపసిస్తోత్ర!
పరమపావనచరిత శ్రీపాండురంగ!
భక్తవర్యుల బ్రోచెడి ప్రభుడవనుచు
దీనులను వేగగాచెడి దేవుడవని
నీదు దరి జేరియుంటిని నిక్కముగను
పరమపావనచరిత! శ్రీపాండురంగ!
వినుతికెక్కిన యట్టి కావేరితీర
మందువసియుంచి నీదగు మందహాస
రుచులచే నెల్లభక్తుల బ్రోతువెపుడు
పరమపావనచరిత! శ్రీపాండురంగ!

నందసూనుడవై యూలమండలోన
మురళి మ్రోగించినట్టి నీముద్దుమోము
కనులజూపవదేమి మోహకలుషహరణ!
పరమపావనచరిత! శ్రీపాండురంగ!
పాపజాలంబు లన్నిటి పారద్రోల
ప్రభుడవీవంచు దెలిపిరి బ్రహ్మవిదులు
నమ్మియుంటిని నిన్ను నా నెమ్మనమున
పరమపావనచరిత! శ్రీపాండురంగ!
మకరి చేజిక్కి కరిరాజు మంగళాంగ!
భక్తిమొఱని నిన్ను వేడగ ముక్తినిచ్చి
పలుకవేలను నేనిట్లు బ్రతిమలాడ
పరమపావనచరిత! శ్రీపాండురంగ!
శబరియిచ్చుఫలమును దిని సంతసమున
మోక్షమొసగిన యట్టి మోహమోహనాంగ
నీలనీరదశ్యామాంగ! నిగమవినుత!
పరమపావనచరిత! శ్రీపాండురంగ!

# సంక్రాంతి

డాక్టరు టి. జియ్యరుదాసుగారు

శిరమునందునకలశంబు చేతులందు
చిరుతతాళంబుతాంబుర చిందులొలుక
అడుగడుగునకు 'మాధవా' యనుచు బాడు
చరుగుదెంచెడి హరిదాసు డవతరించె.
ప్రావృడానిలసంఘాతపాతములకు
మలినమైనట్టిగృహములు మార్గమందు
విరియబూచినబంతిపూసరులతోడ
విలసితములయ్యె సంక్రాంతి వెలసినంత.

ఈశరత్కాలవాయువు లెగసియెగసి
ప్రక్కలంటించునంతటి బాధయిడిన
ముగ్గులను బెట్టగుమ్మాల ముందరకును
భామలరుదెంచిరీతొలిజామునందె.
మొన్నదాకనునీటనుమునిగియున్న
పచ్చపచ్చనిపైరులు పసిడివన్నె
దాల్చికొనిభూమికోరగ వందనపురస్స
రముగ స్వాగతమ్మొసగ సంక్రాంతికోఱకు.

# స్త్రీలు : బ్రహ్మసమాజము

శ్రీమతి పాకల సౌభాగ్యవతి గారు

భరతవర్షము అధోగతి పాల్పడుటకు ముఖ్యకారణములలో నొక్కటి స్త్రీల దురవస్థయని చెప్పక తప్పదు. స్త్రీలు విద్యావిహీనలై, దాసీసమలై, పురుషుల కామోపశాంతికిని, ఊడిగమునకును ప్రత్యేకించి ఉన్నంతకాలము పురుషులుమతిచెడి, తమగమ్యస్థానమును మరచి, కర్తవ్యమునకు దూరులై, తప్పుడుదారుల పట్టకమానరు. దేశము ధీమంతులైన విదేశీయుల వశమౌను. జాతిధర్మము మంటకలియును.

స్త్రీ ప్రకృతిస్వరూపిణియని మనవారు పదేపదే వచింపుచుందురు. ఆమె, ఆధ్యాత్మిక సంపన్నురాలని కూడా వారు గమనింపకున్నారు. ఆసంగతి వారుమరచిరి. వేదకాలమును మరచినను, బౌద్ధయుగము కల్లయయినను, పునఃపునః స్మరణీయములైన పురాణగాథలందైనను లక్ష్మి, సరస్వతి, పార్వతుల కెంత ప్రాముఖ్యము గాంచిరో గమనింపవచ్చును. లక్ష్మిలేని యైశ్వర్యమా, సరస్వతిలేని విద్యయా, పార్వతిలేని సంపదయా? కళలకుతల్లి, కృషికిమూలము, తపమునకు నిలకడయు నెవరో?

వేదఋక్కులు రచించినవారిలో కొందరు స్త్రీలుకలరు. ఉపనిషత్తులకాలమున గార్గి, మైత్రేయులు బ్రహ్మజ్ఞానమున దారిచూపినవారైరి. బౌద్ధయుగమున గౌతమబుద్ధుని భార్యయే ఆధ్యాత్మికసామ్రాజ్యమునకు వెన్నెముకయైనది! సింహళమున బౌద్ధమతస్థాపనకు వెడలిన ఇరువురిలోనొకరు స్త్రీ. ఇస్లాముమతస్థాపకుడైన మహమ్మదు సత్యాన్వేషణ చేయు సమయమున భీతచేతస్కుడై వెనుకంజవేయజూయని సందేహించినవాడు, ఆయనకు ధైర్యముపురికొల్పి ముందునకునడపించినది యొకవనితమాత్రమే. ఏసుక్రీస్తును శిలువవేసినవాడు ఆయన పేరానపెట్టుకొనిన దిగ్గజములవంటి పన్నిద్దరుశిష్యులును ఆయనను విడనాడి వెనుకంజవేసిరి. పురుషులెచ్చోట పరాజితులైరో అచ్చట స్త్రీవిశ్వాసము ధర్మమును కాపాడినది. మేరీ మెగ్డలీను లేనిక్రైస్తవమతము గతియెటులుండెడిదో!

ఇట్టి స్త్రీ మహిమను తెలుసుకొనిన నవయుగరాజఋషి రామమోహనరాయలు నవ్యభారతమున స్త్రీలకు అగ్రస్థానమొసగ సమకట్టెను. ఆయన పురుషులకన్నను స్త్రీల కధికగౌరవమొసగెడువాడు. తనయెదుటకువచ్చిన స్త్రీ కూర్చొననిదే తాను కూర్చుండెడివాడుకాడు. స్త్రీలయభివృద్ధిని అనుసరించియే జాతీయ అభివృద్ధి యుండునని నమ్మినవాడు. పురుషులెంతముందునకు పరుగులిడినను, స్త్రీలు తమతో రాకున్న, అట్టిపరుగు నిష్ప్రయోజనమని నమ్మినవాడు, స్త్రీలకు ప్రత్యేకహక్కులు, ఆస్తి, స్వాతంత్ర్యము ఉండవలెనని పాటుపడినవాడు.

స్త్రీలకును ప్రత్యేకమానవత్వముకలదు. వారు పురుషుల తోమనీడలేకారు. వారికిని ఆత్మలుకలవు. వారికిని ఈశ్వరవాంఛగలదు. పురుషుడే దైవము, పురుషునితో చావు-అను దురాచారమును ఖండించినది రామమోహనరాయలు. సృష్టి శక్తితో ప్రారంభమైనదని పురాణములు చెప్పుచున్నవి. శారీరకశాస్త్రజ్ఞులు కూడ నేడు స్త్రీముందు, పురుషుడు వెనుకయని తెలుసుకొనినారు. ప్రకృతి పురుషుని ప్రకటించుచున్నది. ప్రకృతిలేని పురుషుడు దేహధారుల కభావ్యమగుచున్నాడు.

పరిశుద్ధాత్మ లింగాతీతమైనను, పరమేశ్వరుని అర్ధనారీశ్వరునిగా వర్ణించియున్నారు. ఆత్మజ్ఞానమును పురుషుడు పురుషత్వముగుండాను, స్త్రీ స్త్రీత్వముగుండాను పొందవలయును. పురుషుడు, బుద్ధికి ప్రాముఖ్యము నొసంగుచున్నాడు. స్త్రీ, యటులగాక హృదయమునకు ప్రాముఖ్యము నొసగుచున్నది. హృదయశీలతలేనిబుద్ధి, కుటిలత్వమునకు కారణమగుచున్నది. ధైర్యము, క్రోధము, కఠినత్వము పురుషలక్షణములు.

శాంతి, జీవకారుణ్యము, క్షమ, సంతృప్తి స్త్రీలక్షణములు. ఉన్మత్తత, అన్యాయము, మానవకల్యాణమునకు బద్ధవైరులు. ఇవి పురుషులచే పోషింపబడుచున్నయవి. ప్రకృతిబద్ధమైన జీవుని మర్మము తెలుసుకొని, బలాత్కారముగా వశపరచుకొని, పురుషుడు లోకము నేలుచున్నాడు. ఆత్మసామ్రాజ్యమునకు బలాత్కారము పనికిరాదు. మానవకల్యాణము ఆత్మసామ్రాజ్యముతోడిదే. ఇట్టిసామ్రాజ్యము స్థాపింపవలెనన్న, స్త్రీలు కర్తవ్యమును వహింపవలసియుండును. ఇందులకు పురుషులు సర్వసామాన్యముగా తోడ్పడరు. తోడ్పడకపోవుటయేగాక అడ్డంకులను కల్గింతురు.

స్త్రీలు త్యాగసాహసులు. వారు భౌతికవైభవముతో తృప్తిచెందజాలరు. ఆత్మానందమువారికి ప్రాణాధారవాయువు. మానసంరక్షణకు ప్రాణమిచ్చువారు స్త్రీలని చెప్పిన దానికర్థమిదియే. వారికి కావలసినది అమృతము. మృతమును వాంఛించువాడు పురుషుడు. చంపుట, చావవెరచుట, వానికభ్యాసవిన్యాసములు నాగరికత యంతయు నేడు మారణయంత్రనిర్మాణమునందు విరబిసి, విసుగుచెందుచున్నది. స్త్రీ, పురుషునివిడువజాలక, ఇట్టికృత్యముల చేయకొనినది. కాని యామె కట్టిపనులలో విశ్వాసములేదు. మహానీయులగు పురుషులకుగూడ నట్టిపనులలో విశ్వాసముపోయినది. స్త్రీలకు పురుషులు నేడు వివిధదేశములలోను పరిసమాన హక్కులనొసంగుటకు సమకట్టిన, అది వారి కవసరమైనది కావుననే. పురుషునికి సాధ్యముకానిది స్త్రీసాధింపవలసియున్నది. పురుషులతో సమముగా నడచుటకాదు స్త్రీలకర్తవ్యము. తమ ప్రత్యేకతను గ్రహించి, అమృతముగ్రహించి, మానవకోటి కద్దానిని ప్రసాదింపవలసియున్నది. ఇయ్యదియే బ్రహ్మసమాజము స్త్రీలకుయిచ్చిన సందేశము. కవిసార్వభౌముడును, నేటి బ్రహ్మమత ప్రధానాచార్యుడునైన, రవీంద్రనాథఠాకూరుగారిట్లు సెలవిచ్చియున్నారు:—

Men have been losing their freedom and their humanity in order to fit themselves for vast mechanical organisations." "Men have got into the habit of thinking that this turning-out power has something of the nature of Perfection in itself.*** It is difficult for them to see where truth is missing in their present ideal of progress."

అధికారమదాంధతవలన తమ స్వతంత్రమును, మానవత్వమును యెట్లుల కోల్పోవుచున్నారో, పురుషులు తెలుసుకొనలేకున్నారు.

"But woman cannot be pushed back for good. For she is not less necessary in civilization than man but possibly more||so.*** It is not that woman is merely seeking her freedom of livelihood, struggling against man's monopoly of business, but against man's monopoly of civilzation where he is breaking her heart every day and desolating her life."

స్త్రీలను పురుషులణచి వేయలేరు. నాగరికతకు పురుషునికన్న, స్త్రీ అత్యావశ్యకమైనది. స్త్రీలు పురుషులతో పోటీచేసిన, వారి స్వాతంత్ర్యము ఉదరపోషణకేగాక నాగరికతను సంరక్షించుటకుగూడ పనికి వచ్చును. ప్రస్తుతపరిస్థితులలో పురుషులు స్త్రీలను వెరచుచున్నారు—వారి హృదయకోమలత్వమును ధ్వంసముచేసి, వారి జీవితములను నాశనముచేయుచున్నారు.

రవీంద్రుడు మంత్రద్రష్టయై, భవిష్యత్తున నాగరికత నూతనరూపమును దాల్చుననియు, అందులకు కారణము స్త్రీల నుస్వాభావికోన్నత్యమేయగుననియు చెప్పుచు, స్త్రీలను తమ విధివిధాయకములకు సిద్ధంగవలయునని ప్రబోధించుచున్నాడు. ఇట్టి కార్యము జరుగనున్న, పురుషుడే దైవమని కూర్చుండుట పనికిరాదు. స్త్రీలు స్వయంకృషివలన ధ్యానము, భక్తి, ప్రార్థనలద్వారా ఈశ్వరు నుపాసింపవలయును. అప్పుడుగాని ఈశ్వరుడనుగ్రహించి మానవకల్యాణమునకు తోడ్పడడు. ధర్మమునకు నూతనవికాసములను తెచ్చుటకు స్త్రీలు ప్రత్యేకముగా ఏకాంతమునను, సమిష్టిగను ఈశ్వరుని పూజింపవలయును.

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## జోలపాట

శ్రీరామచంద్రుడే సీతవల్లభుడు
దశరథపుత్రుడే జనకుఅల్లుడు
చిన్నది సీతమ్మ శ్రీరాముపిడిచి
పదినెలలుతానుండె అశోకక్రింద.
పట్టెమాఅబ్బాయి మాటలుచూచి
పట్నవర్తకులంత పగడాలుయిచ్చె
అబ్బాయి నీవంద్రు నీవాడవంద్రు
నీయింకువారిలో నిమ్మపండంద్రు

శ్రీమతి కల్పటపు రుక్మిణమ్మగారు

మాడంతదీపంబు మాడలకువెలుగు
మారాజుఅబ్బాయి మాకళ్ల వెలుగు
ఆనాడు నలరాజు అడవులనేగె
సతినివిడిచి తానుదాసుడయ్యె.
నిద్రపో అబ్బాయి నిద్రపోవయ్యా
బలభద్ర నాతండ్రి పవళించవయ్యా
చిన్నారి అబ్బాయి చిందులుచూచి
మెచ్చుకొందురు నిన్ను మేనమామల్లు.

## వడ్లదంపుపాట

వడ్లుదంచంగానె వచ్చెచుట్టమ్ము
పొమ్మన్న పోడాయె వరికూటివాపి
వరికూటివాపికి వంకాయవండి
వాణ్ణిపొమ్మండు నేనుతిండూను.

## జ్ఞానధనమే ధనము ముద్దా విశ్వనాథము గారు (కవితా సమితి)

ఒకప్పుడు లక్ష్మీసరస్వతు లిద్దరికీ పంతంవచ్చింది నేనుగొప్పదానంటే నేను గొప్పదాన్నని. ఎవరి పస వారుచూపించడానికి పూనుకున్నారు. సరేనని, ముందు లక్ష్మి, ఒకకూలివాడిని వరించింది. "చూసుకో వీడిని భాగ్యంలో ఎత్తి ముంచుతా"నంది సరస్వతితో. అంతట వాడు పొలంలో ఒక నుయ్యి తియ్యడం ప్రారంభించాడు. త్రవ్వుతున్నకొద్దీ మట్టిరావడంమానేసి రత్నాలు అవ్వీ వచ్చేయి. "ఇదేవిటే? ఎంత త్రవ్వినా వెధవరాళ్లు వస్తున్నాయి?" అని విసుక్కొని వాటిని గంపలతో అవతల పారపోస్తుండే వాడు. లోకు లివన్నీ పట్టుకుపోయి, బాగుపడుతూ వచ్చారు. ఇల్లా కొన్నాళ్లయేసరికి సరస్వతివచ్చి "ఏమే అక్కా! నామజా చూపించమంటావా? ఇదిగో, చూడు" మన్నది. అంటూ ఒక పురుషుని వేషంవేసుకొని వచ్చి, ఆకూలివాడితో, "అరే, అబ్బీ చూడు! నీకు పది రూపాయలిస్తాను, ఈజాబ్బునాకియ్యి!" అని అడిగింది. అపళంగా సంతోషంతో

అవి ఇచ్చేశి. వాటి విలువ తెలుసుకున్నాడు. ఇదివఱకు గంపలతో పట్టుకుపోయిన వాళ్లందఱి దగ్గఱనుంచి ఆరాళ్లన్నీ వాపసు తీసికొన్నాడు. హాయిగా ఆరాళ్ళు ఎక్కువ ఖరీదుకు అమ్ముకుని, అప్పటినుంచీ సుఖజీవనం చేశాడు. "డబ్బుంటే లాభమేమిటి, వినియోగించుకోగల జ్ఞానం లేనప్పుడు?" అని లక్ష్మిని దెప్పి పొడిచి, తనప్రభావమే ఎక్కువని నిరూపించింది సరస్వతి.

౨. కథలు

## వెర్రిగొల్లవానికథ

జమ్మి శేషగిరిరావుగారు బి. ఏ; యల్. టి.

ఒకవూళ్ళో ఒకవెర్రిగొల్లపిల్లవాడు ఉన్నాడు. వాడితండ్రికి ఒకమేకలమందవుంది. తండ్రిరోజూ మేకలమందను మేపుకుంటూవుండేవాడు. పిల్లవాడు యింటివద్ద ఆడుకొంటూవుండేవాడు. ఒకనాడు గొల్లబోయని తల్లి—నూరేళ్ళదిలెండి—దానికి కాలుమీద కురుపులేసింది. వెర్రిగొల్లపిల్లవాడిని యీగలు తోలుతూవుండమని కూచోపెట్టి గొల్లబోయడు మేకలను కాచుకోడానికి వెళ్లాడు. ఈలోగా వెర్రిగొల్లవాడు కాస్తసేపు విసిరినట్టేవిసిరి, ఈగలు ఎంతకీపోవడంలేదని చెప్పి ఒకసేపాళ్ళబడితెను తీసుకువచ్చి నాయనమ్మ పుండుమీదవాలిన యీగలని చావమోదాడు. దాంతో యీగలు చావడమేగాకుండా ముసలమ్మపుండు మరింత మోపయింది. గొల్లబోయడు యింటికివచ్చేసరికి శోకన్నాలుపెటుతూంది. సంగతి తెలుసుకొని కొడుకునితిట్టి మర్నాడునుంచీ మేకలని కాయవలసిందని చెప్పాడు గొల్లబోయడు. తెల్లవారింది. వెర్రిగొల్లవాడు మేకలను తోలుకొని ఊరిబయటకువెళ్లాడు. గొల్లబోయడు వానితో వూరిబయటదాకావచ్చి అన్నంచట్టిని ఒకచెట్టుకొమ్మకుకట్టి "నాయనా! ఆకలికాగానే అన్నంతినుఅని చెప్పి యింటికివెళ్లాడు. వెర్రిగొల్లవాడు పండ్రెండుగంటలదాకా యిటూఅటూతిరిగి ఆడుకొని చెట్టుక్రిందికొచ్చి అన్నంమూట అందుకోబోయాడు. అది అందలేదు. చెట్టెక్కడంవాడికి చేతగాదు గనుక కిందనుంచి ఒకరాయి పెట్టికొట్టాడు. అన్నవున్నచట్టి పగిలిపోయి అన్నంఅంతా నేలమీదపడిపోయింది. కొంచెంమజ్జిగచినుకులు పడుతోవుంటే నోరుజాపి ఆమజ్జిగచినుకులు చప్పరించాడు. వాడికికోపంవచ్చింది. మేకలవేపుచూచాడు "మానాన్నతో చెపుతారా?" అని వాటినిఅడిగాడు. అవి యీగలు వాలడంచేత, చెబుతామన్నట్టు, తలలువూపినాయి. "ఆ శ్రేసి! మానాన్నతో చెబుతారా" అని తనకత్తిపెట్టి వానివన్నిటినీ తెగనరికాడు. సాయింత్రానికి గొల్లబోయడువచ్చి చూడగా అన్నిమేకలుచచ్చి వున్నాయి. కొడుకునడిగి సంగతిగ్రహించి పట్నంలోకివెళ్ళి 'రూక' కొకమేక చొప్పున అమ్మకురమ్మన్నాడు. వెర్రిగొల్లవాడు వొక్కొక్క మేకనే బుజానవేసికొని "రూకకో మేకోయి! రూకకో మేకోయి" అంటూఅమ్మినాడు. ఒకగడియలో అన్ని మేకలూ ఖర్చుఅయినాయి. ఆరూకలమూటను తీసుకొచ్చి చూరులోపెట్టి, తిండితిని పరున్నాడు చాలాకష్టపడినంత ఆయాసంచేత! యింతట్లో తండ్రి వాడినిలేపి రూకలమూట తెమ్మన్నాడు. వాడువెళ్ళి చూచేసరికి ఎలకలారూకలన్నిటినీ పటపటకొరుకుతూ తింటున్నాయి. "మీపొగరు యిలావుందా! చూడండి! మీపనిపట్టిస్తా"నని కిరసనాయిలుబుడ్డి తీసుకొచ్చి చూరుఅంటించాడు. చూరుఅంటుకుని యిల్లుకాలుతోవుంటే "చావండి! వెధవఎలకల్లారా!" అంటూ గంతులువేస్తున్నాడు. తండ్రి యిదిచూచి ఎల్లాగో యిల్లుఆర్పుకొని, సంగతితెలుసుకొని తనకొడుకు ఎందుకూ పనికిరాని వెధవఅని గ్రహించి వానిమెడకొక గుంజకట్టి కాలువలో పారవేశాడు. "పనివాణ్ణివచ్చాను పట్టం

డోయ్!" అంటూ అరవమని చెప్పాడు. వెర్రిగొల్లవాడు అల్లాఅరుస్తో కొట్టుకుపోతున్నాడు. వకచోట కొందరు దొంగలు దొంగతనం చేయడానికి తమకింకొకమనిషి కావాలని చూస్తున్నారు. వీడి అరుపువిని "వోరేయి! మేంపనిచేస్తావురా" అన్నారు. "ఏపనైనా చేస్తాను. పైకెత్తండిఅన్నాడు వెర్రిగొల్లవాడు. వాళ్ళుపైకెత్తివి తమతోకూడా తీసుకుపోయారు. ఆదొంగలు వకరియింటికికన్నం తవ్వి వెర్రిగొల్లవాడిని లోపలికిపంపి లోపలయేమేమివుందో జాగ్రత్తగా చూచివచ్చి తమతో చెప్పమన్నారు. సరేననివాడు అన్నగా వంటయింట్లోకివెళ్ళి అక్కడవున్న దేవతార్చనపెట్టెలోవున్న శంఖమున్నూ జేగంటయున్నూ చూచి, ఆశంఖంపూదుతో జేగంట వాయించడం మొదలుపెట్టాడు. ఈలోగా యింటివారంతాలేచి దొంగలను పట్టుకొని చావమోది, వంటయింటిలోకివచ్చి చూచేసరికి వెర్రిగొల్లవాడింకా శంఖంపూదుతో సేవున్నాడు. వాడిని అడిగి సంగతి తెల్సుకొని వాడేగదా తమసొమ్మును దొంగలు ఎత్తుకుపోకుండా కాపాడినాడని గురిగి, వాడికి రోజూ అన్నంపెడుతో దగ్గర నౌఖరుగా ఉంచుకొన్నారు.

# రాజానుగ్రహము : రాష్ట్రానుగ్రహము

ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యసోమయాజులుగారు

అనగనగా ఒకవూళ్ళో ఒకమహారాజుండేవాడు. ఆయనదొద్ద మంచితెలివిగలమంత్రి, కట్టడిగల నౌఖర్లుండేవారు. వాళ్ళందరు తెలివితేటలుగా నౌఖరీచేసుకొనుచున్నారు. ఆవూళ్ళో ఒకఆచార్లవారు రాజాగారి ప్రాపకమును సంపాదించుకుని జీవిస్తూయున్నాడు. తానొక గొప్పపండితుడనని ఆతనికి కొంచెము గోరోజనముండేది. అతిక్రమముగాబలిసి నౌఖర్లయనుమతిలేకకుండ రాజాగారిని దర్శించటము మొదలు పెట్టాడు. ఇదిచూస్తే వీళ్ళందరికి గుబ్బగాఉండేది. ఈపటాలమంతా ఒకరోజున సభచేసి ఆచార్లవార్ని యెట్లావంచిందామాయని ఆలోచించారు. ఆయనతో సంగతంతా మొఱపెట్టుకున్నారు. ఆకట్టినమంత్రి ఊరుకొనక తనకుండేకోపము వెలిబుచ్చుచు "మీరొకఉపాయము చెపుతానుచేస్తారా" అన్నాడు. "చిత్తము ప్రభూ!" యన్నారు వీళ్ళంతా. "మీరందరూ కట్టుకట్టి లోనికిరానియ్యకుండాయుండాలి" అన్నాడు మంత్రి. "అలాగే" నని వాళ్ళువెళ్ళిపోయారు. మర్నాడు మామూలప్రకారం ఆచార్లవారు బయలుదేరారు దర్బారుకి. ద్వారముకడకు వచ్చేసరికి నలువురుజవానులు అడ్డగించుకుని వెనక్కితరిమేశారు. ఆచార్లవారు ఇంటికిపోయి బెంగపెట్టుకుకూర్చున్నాడు. మామూలుగావచ్చే ఆచార్లవారు రాకపోవుటచేత రాజాగారి కేమియు తోచుటలేదు. మంత్రినిపిలిచి "ఆచార్లవారు రాకపోవుటకు కారణమేమి" యన్నాడు. "నాకు తెలియదు ప్రభూ!" అన్నాడుమంత్రి. వెంటనే కబురుపంపించారు. మంత్రి పన్నుగడచేత ఆబంట్రోతు అటూయిటూతిరిగి మరలవచ్చి "జబ్బుగానున్నది" యన్నాడు. నిజమేయనుకుని రాజాగారు ఊరకున్నారు. ఒకవారము జరిగిపోయింది. రాజాగారు మరల కబురంపించారు. ఈసారీ అట్లాగేవచ్చింది జవాబు. "ఇది బాగులే"దని రాజవైద్యులను "చికిత్సచేయు"మని ఆజ్ఞాపించాడు రాజాగారు. కపటనాటకకర్తయగు మంత్రి వారికేదో బోధించి చికిత్సచేయనియ్యక "చాలాజబ్బుగానున్న"దని వాళ్ళచేత రాజాగారికి చెప్పించాడు. అదివిని రాజాగారు మంత్రియుక్తముగా ఆచార్లవారిని చూచుటకు బయలుదేరినారు. ఇంతలోనే ఒకనౌఖరు "ఆచార్లవారు మరణించినా"రని రాజాగారికి చెప్పినాడు. అదివిని నిజమేకాబోలునని రాజాగారు నమ్మి యింటికి మరలించినాడు తనప్రయాణం. ఆచార్లగారికి ఎన్నివిధములచేతను రాజాగారిదర్శనము చిక్కుటలేదు. బెంగపెట్టుకుని పిచ్చియెత్తినవానిరీతిగా తిరుగుచున్నాడు. ఆరాజాగారికి ఏడాదికి రెండుపర్యాయములు

తనదర్శనము ప్రజలకందరకు నిచ్చుటకై ఏనుగుపై నూరేగుచలవాటుయుండెడిది. అట్టిసమయ మెప్పుడువస్తుందాయని వేచియున్నాడు ఆచార్లు. ఒకనాడు ఆమహోత్సవముకూడా లట స్థించింది. "దొరికినదిరాసందు" అనుకున్నాడు. రాజుగారు యేనుగు మీద ఊరేగుచున్నారు. ఒకఫర్లాంగుదూరానవిలచి "ఏమండో రాజుగారూ! మీనౌఖర్లు నన్ను తమదర్శనం చెయ్యనిచ్చుటలేదండో" అని అఱవటంమొదలుపెట్టాడు. ఈమాటలు మంత్రిచెవినిపడ్డాయి. ఇద్దరునౌఖర్లను పిలచి "వాడిని దూరముగా తీసుకుపొ"మ్మన్నాడు. ఇద్దరు చేరి యొకరెక్క పట్టుకుని ఆచార్లువారిని దూరముగా తీసుకుపోయి నాలుగుపోట్లుపొడిచారు. "బాబో! నాకు రాజుగారిదర్శన మక్కరలేదు. ఇంటికిపోతా. వదిలిపెట్టం"డని బ్రతిమాలుకున్నాడు. వాళ్ళు "పోనీ"యని దయదలిచి వదలిపెట్టారు. ఆచార్లనకెట్లాగైనా రాజుగార్ని చూడాలని పట్టుదల బయలుదేరింది. రాజుగారీవీథి నూరేగుచుండగా తానింకొకవీథికిపోయి రాజుగారావీథికి వస్తారనివిని బాటప్రక్కనున్న చెట్టుకొమ్మపైనెక్కి కూర్చున్నాడు. ఆవీథినుండి రాజుగారు ఊరేగుచున్నారు. చెట్టుకొమ్మ ఏనుగుకు రెండుబారలయెత్తునయున్నది. ఏనుగు ఆచెట్టుక్రిందకొచ్చినది. ఈయదునుకనిపట్టి రాజుగార్ని ఆచార్లుచూచి "ఏమండో రాజుగారూ! నేను ఆచార్యులనండో! మీనౌఖర్లు తమదర్శనం కానియ్యక నిర్బంధించుచున్నారండో" అంటూ బిగ్గఱగాఅఱచాడు. రాజుగారదివిని ఆశ్చర్యముతో "ఏమిటీ ఈవిపరీత" మన్నారు. మంత్రి కేమియు ఆలోచనపట్టినదికాదు. ఒక చిన్నరహస్యము నెవ్వనిచెవిలోనో యూదినాడు. అప్పటివాళ్ళంతా "ఆచార్లువారు దెయ్యమయివచ్చాడు బాబో" యని అఱవటం ప్రారంభించినారు. అయితే! చూస్తారేమిటీ! కొట్టండి! కొట్టండి!" అన్నాడు ప్రభువు. వాళ్లందరూకలసి చచ్చేటట్లు కొట్టారు ఆచార్లుని. కొనయూపిరితోనున్న యాచార్లువరుగెత్తికొనిపోయి "రాజుగారి ప్రాపకమేకాదు. రాజుగారి నౌఖరుల ప్రాపకము కూడాయుండాలి" అనుకుంటూ యిల్లుచేరాడు.

## దశమగ్రహము

కుజ్జా వేంకటసుబ్బారావు చౌదరిగారు

భోగభాగ్యములచే బొలుపొందుధారుణీ
  చక్రమేలెడు రాజచంద్రుడైన
ధర్మావలంబియై, తగవులుదీర్చి ప్ర
  ఖ్యాతుడౌ న్యాయాధికారియైన,
లెక్కింపగారాని రొక్కంబుగడించియుంచి
  తలవాంచకుండిన, ధనికుడైన
పదుగురుమెచ్చ, నుపన్యాసములనిచ్చు,
  వాక్చతురిమగల వక్తయైన,
కానుకలనిడి పాదముల్ గడిగి మాన్య
ములనొసగి బ్రతిమాలి, సమ్మోదమొప్ప
పూజలొనరించి మన్నన బొందకున్న,
పట్టిబాధించు విడిసీకు భాష్యమగునె,
మాన్యజనభంగ మో దశమగ్రహంబ!.

కడుపుచిచ్చున మేని కండలుకృశియించి
  యేప్రొద్దుభోరున యేడ్చునొకడు,
ఆత్మస్వతంత్రంబు నణచిబానిసవలె
  సేవకావృత్తిని జేయునొకడు
మడిమాన్యముల నప్పుకిడి గ్రాసమునకయి
  తిరిపెంబునెత్తుచు తిరుగునొకడు,
ధనమిచ్చిమిద్దెను తనఖానుగొనుమంచు
  ధనికుల వెనువెంట దగులునొకడు
సీనిరాఘాటవృత్తికి నిల్వలేక
మొదటకంపించి జోహారులొసగునొకడు,
అకట యెంతటినిర్దయాత్ముకుడవోయి
మాన్యజనభంగ మో దశమగ్రహంబ!



అవ్వాయి అనాధబాలికా శరణాలయ వార్షికోత్సవము



శ్రీమతి ముత్తులక్ష్మీ రెడ్డిగారు

అవ్వాయి అనాథబాలికా శరణాలయస్థాపకురాలు



## ఏడేండ్ల బాలిక భర్తృవియోగముచే మరణించుట :—

"పదునారేండ్లవయస్కుడును, వివాహితుడును కవలయు నగు రాంబాబను నాకుమారుడు 1932 సం॥ జూలై 1-వ తేదీని పగలు పదునొకొండుగంటలకు మమ్ము పారదుఃఖపారావారమువముంచి పరలోకగతుడయ్యెను; పుత్రవియోగముచే దుఃఖించుచు, నేడేండ్లప్రాయంపు బాలికయగు వానిభార్య కింతబాల్యమున దురంతచింతాభూయిష్టమగు వైధవ్యమును కలుగజేసిన మానిష్కరుణ దైవానుగ్రహమునకు గుందుచుంటిమి. భర్త చనిపోయినక్షణము మొదలు లాపాలబుగ్గల యేడేండ్లబాలిక ఏమిదైవవిలాసమో! ఏమిఆశ్చర్యమో! వారి యంతరాత్మ లెట్టివో! గాని, భోజన మాచరించుటలేదు సరియేగదా, పుడిసెడు నీటినైన ద్రావక నిదురనైన పోకుండెను. ఎంతయో బ్రతిమాలినాము. నాకేమియు నవసరములేదని చెప్పుచు, నిరంతర మన్యథా ధ్యానాయత్త చిత్తయగుచు నుండెడిది. ఎట్టిదైనరోగమును లేదు. రమారమి మూడునెలలకాల మిట్లు జరిగినది. మేమందర మాభార్యాభర్తల యంతరాత్మ లేపూర్వజన్మమునందో నిబిడీకృత ప్రేమపూరితములై యుండెడివనియు, నీజన్మమందు అందొకదానికి నాశనము కలుగుటచే రెండవయంతరాత్మ వియోగచింతచే జలమునైన గ్రోలుట మానెననియు నిశ్చయించుకుని యూరకుంటిమి, గాని పిల్లకుకూడ యాపద సంభవించు ననుభయముచే బలవంతముగా నింతపోదామున్నగు ద్రవపదార్థముల నోటబోయుచుంటిమి. కాని గొంతునైన దదపనీయక వంతయు మరియుచుండెడిది. ఇట్లు కొంతకాలమునకు సరికి యాప్రాణికూడ మమ్ము విడనాడి, తనమనోనాథుని జేర లోకాంతర మేగినది. ఈమెకూడ మరణించినదని యొకకంట శోకబాష్పములును, ఆమె పవిత్రముగ్ధ హృదయమునకు, లోకమన నేమియో యెఱుగ వీలులేని యేడేండ్లప్రాయమందు గతించిన భర్తపై చూపిన యామె పాతివ్రత్యమునకు రెండవకంట నానందబాష్పములును దొలుకాడ, నా మెదహనాదిసంస్కారము లాచరించి, యెద్దియో మహాత్వమీ బాలికయందుండక యిట్టి చిరుప్రాయమున భర్తృవియోగఖిన్నయగుచు నన్నము మానుట తటస్థించదని యూహించి, లౌకికసౌఖ్యముల నిసుమంతయు ననుభవింపవీలులేని సమయమున మృతినొందిన యాబాల్యదంపతులయొక్క పరమపవిత్ర ప్రేమపూరితహృదయులై దివంగతులైన యాముగ్ధదంపతులయొక్క స్మృతిచిహ్నముగా తులసికోట నొకదానినికట్టించి యుత్సవము గావించితిని. పరలోకగతులైన యాయనుంగు పసికూనల యంతరాత్మలకు శాంతిగలుగున ట్లాంధ్రమహాజను లాశీర్వదింతురుగాకయని మనవిచేయుచు కవోష్ణబాష్పకణముల విడుచుచుంటి." —పిల్లా ఆదినారాయణపాత్రుడు.

## కీ. శే. అలపాటి సీతమ్మగారు :—

"కీర్తిశేషురాలైన శ్రీమతి అలపాటి సీతమ్మగారి నివాసము గుంటూరుజిల్లా తెనాలికివారు అయితానగరపురము. ఈమె యొకసంపన్నగృహమున జన్మించినది. ఈయమ అకళంకమగు దైవభక్తిగల విదుషీమణి. నిరంతరసత్కార్యపరాయణి, తన జీవితమంతయు భగవత్కైంకర్యమునందే వినియోగించిన భక్తురాలు. కృష్ణాజిల్లా గొల్లపూడియందు ఒకశివాలయమును ప్రతిష్ఠింపజేసినది. 1912-13 లో అయితానగరపురమునందు

ఒక రామాలయము ముఖమంటపసహితముగ నిర్మించినది. 1929-30 సంవత్సరములలో ఆపురతటాకనికటంబున అమితధనమును వెచ్చించి స్వయప్రయాసలకోర్చి నవగ్రహసహితఉమామహేశ్వరాలయమును అత్యంత సుందరముగ నిర్మింపజేసినది. పెక్కుమంది బీదబాలబాలికలకు ఉచితముగా వివాహములొనర్చి వారియందు దనకుగల ప్రేమ వెల్లడించినది. ఈయమ 1925 సం॥ ఒకభవనమును శ్రీరామగ్రంథాలయమున కుచితముగా నొసంగుటయేగాక స్వయప్రయాసలకోర్చి అతిసుందరముగ పంచముకూడనిర్మించి గ్రంథాలయమునకు శాశ్వతముగనొసంగెను. ఈవిదుషీమణి యొనరించిన సత్కార్యము లెన్నియోగలవు. ఈయమకుగల ధీశక్తి, కార్యదక్షత. వశీకరణశక్తి, భగవద్భక్తి వర్ణనాతీతములు. ఇట్టి యకలంక సౌజన్యనిధియగు విదుషీమణి తనభర్తను తన ప్రేమస్వరూపిణియగు భారతిని తక్కుంగల బంధులోకమును దుఃఖాంబుధిముంచి (టైఫాయిడు జ్వరము వలన) 24-11-32 తేది ఉదయము 8 ఘంటలకు భౌతిక దేహమునువిడచి స్వర్గపురికేగెనని వ్రాయుటకెంతయు చింతించుచున్నాము. ఈసాధ్వి యశోచంద్రికలను పుత్రుడగు సాంబయ్యచౌదరిగారు దిగంతముల వ్యాపింపచేయుగాక! ఈ మెయాత్మకు శాంతికిగలుగుగాక!"

—తాళ్లూరు సీతారామయ్యచౌదరి.

## అస్పృశ్యత ఎక్కడిది:—

"లౌకిక ప్రతినిధియగు మహాత్మాగాంధిగారు అస్పృశ్యత భారతదేశమునకు తీరని కళంకమనియు, తన్నివారణము అత్యావశ్యకమనియు ముక్తకంఠమున పలికియున్నారు. ఆమహావాక్యములకు సనాతనవాదులు ధర్మశాస్త్రముల నాధారములుగా గొనియు గొనకయు తీవ్రవిమర్శనము చేయుచున్నారు. ఇందునిమిత్తమై ఊరక ధనవ్యయముజేసి ధర్మసభలగూడ నేర్పాటుచేసి వాదోపవాదములు పెంచి తుదకు కలహించుచు యేదియును నిర్ధారణజేయకపోవుటయేగాక వారివాదములవలన జనసామాన్యమునకు అవిశ్వాసముగూడ కలుగజేయుచున్నారు. ఇట్టి వాదములకు మనధర్మశాస్త్రములన్ని పుట్టినవి పుట్టినట్లుగాకుండ యొకేమాత్రమున మార్చబడియుండినగదా, యేదోయొక దారియేర్పడుట? ధర్మశాస్త్రములన్నియు భిన్నభిన్న అభిప్రాయములతో నిండియున్నమాట లోకవిదితము. అట్టియెడ గ్రంథములను ఆధారములుగాగొని వర్తమానకాలమునువీడి ధర్మనిర్ణయము చేయబూనుట పరిహాసాస్పదము. అట్లు ధర్మనిర్ణయము చేయుటకువీరు స్మృతులన్నిటిలో మనుస్మృతిని ముఖ్యముగా గ్రహించుచున్నారు. అమానవధర్మశాస్త్రమునుబట్టి ధర్మాధర్మములు నిర్ణయము చేయుటకు కృతయుగమున మనుస్మృతి ప్రమాణము, త్రేతాయుగమున గౌతమస్మృతి ప్రమాణము. ద్వాపరయుగమున శంఖలిఖితస్మృతులు ప్రమాణములు. కలియుగమున పారాశరస్మృతి ప్రమాణము. అని స్పష్టమగుచుండ కలియుగప్రమాణమగు పారాశరస్మృతినివిడిచి కృతయుగప్రమాణమగు మనుస్మృతినియేల ప్రమాణముగ గైకొందురో తెలియకున్నది? పోనీ ఆమనుస్మృతే ప్రమాణగ్రంథమనిన నందు-బ్రాహ్మణఃక్షత్రియోవైశ్యస్త్రయోవర్ణాద్విజాతయః చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితుపంచమః. అను మనువాక్యము ననుసరించి అనాదినుండియు వర్ణచతుష్టయమే యీదేశమున నున్నట్లు తెలియవచ్చుచున్నది. కాని పంచమవర్ణమెక్కడను, యేస్మృతియందును కానరాదు. కావున వీరు శూద్రులలోనివారేకాని ప్రత్యేకజాతి యెంతమాత్రమునుగాదు. శూద్రులే అయినప్పుడు దేవాలయప్రవేశాదులకు ఎట్టి అభ్యంతరమునులేదు. అయితే యీఅస్పృశ్యత ఎక్కడనుండి వచ్చినది? అను శంక బొడముచున్నది. హిందూమతమంతయు అహింసాతత్వముపయి నాధారపడి యున్నది. అట్లాధారపడియుండుటకేగాదు. అహింసాతత్వమే హిందూమతము. కనుకనే హిందూదేశ మన్యదేశముల నాక్రమించి శిరోమకుటమై విరాజిల్లుచున్నది. అట్టి పవిత్రమైన హిందూమతమునకు పూజనీయమైనది గోవు. అట్టిగోవునువధించి హిందూమతమునకు విరుద్ధముగా ప్రవర్తించువారలు అస్పృశ్యులుగా మనవారు పరిగణించుచుండిరి. వారలే అస్పృశ్యులు. మనదేశము అన్యజనాక్రాంతమై తీవ్రసంక్షోభముల మునిగిపోయిన కాలమున ప్రజలు పలుకష్టములకు పాల్పడవలసి

వచ్చెను. అప్పుడు కేవలోపాధికొరకు ప్రజలాయా ప్రభుచిత్తానుసారముగ ప్రవర్తింపక తప్పినదికాదు. కావున మనవారు గత్యంతరములేక వారి చిత్తవృత్తికిదగినట్లు ఎట్టికార్యాచరణమునకైనను వెనుకాడ వీలుగాక పోయెను. అట్టికష్టకాలమున మనలో గొందరు ఆయారాజనిర్బంధములవలననో, క్షుద్బాధావశముననో, మరి యేకారణములవలననో, స్వపక్షసహాకారశూన్యులై గోవధాదులొనర్ప మొదలిడియుండిరి. అందువలన మనవారు వారినిగూడ నప్పటినుండియు అస్పృశ్యులుగ భావించిరి. అంతమాత్రమున అస్పృశ్యులని, అంటరానివారని, చెప్పరానివారని, వినరానివారని, పంచములని వారికి సంఘమునుండి త్రోసివేసి అధఃపాతాళలోకమున పాతివేసిరి. ఇది మానవాభ్యున్నతికి తీరని కళంకము, కళంకమేకాదు; తీరనినష్టము, నష్టమేగాదు ఘోర పాపాచరణముగూడనగును. ఆవిధమున మనము విమర్శించి చూచినచో మనమందరమును పంచములకంటె చాల నికృష్టులమని చెప్పవలసివచ్చును. వృత్తులే దూష్యము గానప్పుడు నిమిత్తమాత్రమున సంక్రమించిన వృత్తి దూష్యమగునా? కావున వారు గోవధను మానివేసినచో శూద్రులగుదురు. అట్లు శూద్రత్వము వచ్చిన పిమ్మట సనాతనవాదులు వారికి దేవాలయప్రవేశాదులకు అభ్యంతరమును చెప్ప వీలులేదుగదా! దానినుండి క్రమముగావారు మహోన్నతదశకు రావీలుకలుగును. దానికేమి? అది అట్లుండనిండు. ఇక యేదియెట్లున్నను ప్రస్తుతము కాలజ్ఞుడును, దేశోపకారియు, దేశబంధువునగు గాంధీమహాత్ముని ఆదేశానుసారము తొలుత పంచములకు దేవాలయప్రవేశాదు లొసంగినచో క్రమముగావారు వృత్తిగాచేయు చున్న గోవధను మానివేసి అచిరకాలమున మనతో సమానముగ తులతూగుదురు. అట్లు వారు మనతో కలిసి మెలసి యుండునట్లు అవకాశములు కలిగించి, వారిచే మహాత్ముడు వారికి ఉపదేశించిన గోవధాదులు మాన్పించి వారికన్నివిధముల సహాకారులయియుండు బాధ్యతగూడ సనాతనాధునాతనవాదుల మీదనే యున్నది. ఇందులకు సనాతనవాదులమనువారు లేనిపోని అపోహలు పెట్టుకొనక కార్యార్థమహాలురై కాలజ్ఞులై కార్యాచరణముపట్ల అన్నివిధములపంచములు మనలో కలియునట్లుచేసి, వారిఅభివృద్ధికి తోడ్పడుదురు గాక!

—స్థానాపతి రుక్మిణమ్మ.

మేరీస్కార్ లీబ్ సతి:—

"మద్రాసునందు ప్రథమవైద్యవిద్యార్థినియు, కాస్టు అండె గోషా చికిత్సాలయపు ప్రథమ సూపరింటెం డెంటును అగు మేరీస్కార్లీబ్ సతిగారి చిత్రరుపము లేడీవెల్లింగ్టన్ మెడికల్ స్కూల్ నందు బహిర్గత మొనర్చుటచే మద్రాసునగరము ఆమెను గౌరవించినది. ఈఆదర్శప్రాయురాలగు స్త్రీ ఆశయములను ప్రస్తుతవిద్యార్థినులు మనమున నుంతురుగాక. స్కార్లీబ్ సతి 1875 వ-సంవత్సరమున వైద్యవిద్యార్థినిగా వైద్యశాలాలలో ప్రవేశముకోరి నప్పటిపరిస్థితు లిప్పటివానికంటె యెంతో భేదముగనుండినవి. ఇప్పు డన్ననో స్త్రీలకు ప్రత్యేకవైద్యపాఠశాలలున్నవి. స్త్రీలకును, బిడ్డలకును ప్రత్యేకచికిత్సాలయము లేర్పడినవి. ఇంక స్త్రీలే పనులన్నియు నిర్వర్తించుచున్నారు. స్కార్లీబ్ సతి జీవితము తెలిసికొనతగినది. మద్రాసు నందు స్త్రీవైద్యులలో నామె మొదటిది. ఆమె భర్తతోను సర్వంతానముతోను, సుఖజీవితమును గడపు చుండియు తన భారతసోదరీమణుల ప్రసవకష్టములజూడజాలక వారిసౌఖ్యమునకు తగుఏర్పాట్లు చేయునంత వఱకు సర్వసుఖములవిడనాడి కష్టజీవితము నవలంబించెను. గవర్నమెంటు మెటర్నిటీఆస్పత్రిసూపరింటెం డెంటు కర్నల్ బ్రాన్ ఫుట్ గారు స్కార్లీబ్ సతికిని, ఆమె సహపాఠులగు మరిముగ్గురు స్త్రీలకును విద్యగర పుట కిష్టపడలేదు. అయినను వారు పరీక్షలందు జయముగాంచిరి. స్కార్లీబ్ సతి ఇంగ్లాండునకు కూడవెళ్ళి లండన్ యం. బి. బి. యస్. పరీక్షయందు గౌరవస్థానముననుత్తీర్ణురాలయ్యెను. చెన్నపట్టణమునకురాగానే ఆమె చికిత్సాశాలను స్థాపించి కొలదికాలములోనే అప్పటి మద్రాసుగవర్నరుగారు వారిసతి మొదలగువారి సాహాయ్యముతో తిరువళిక్కేణియందు స్త్రీలకును శిశువులకును గాను గవర్నమెంటు విక్టోరియాఆస్పత్రిని స్థాపిం

చెను. లేడీవెల్లింగ్డన్ మెడికల్ స్కూల్ పిమ్మట స్థాపింపబడెను. అందిపుడు యల్. యం. పి. పరీక్షకు జదువువిద్యార్థినులు నూర్గురున్నారు. వైద్యకళాశాలయందు స్త్రీవిద్యార్థినులు 70 మందిగలరు. తమగృహకృత్యములను, సాంఘిక సేవ చేయుజాలమికి సాకుగ చెప్పువారు స్కార్ లీబ్ సతిని ఆదర్శముగ దీసికొందురుగాక. డా॥ స్కార్ లీబ్ కాలమున మద్రాసునగరమున కాన్పుకష్టములెట్లుండెనో జిల్లాలయందిపుడట్లున్నవి. నగరములందుకూడ అనారోగ్యస్థలములందునివసించు బీదవారి కారోగ్యవిషయమను బోధఎంతయావసరమో వారిని చూచిన తెలియగలదు. విద్యావతులగు సోదరీమణులు తమ గృహకృత్యములనడుమ కొంతకాలమును సాంఘిక సేవ కర్పింపవలయుననియు, వైద్యపరీక్షలందు తీర్ణులైన స్త్రీలు నగరములందే గుమిగూడక గ్రామములందచ్చటచ్చటచేరి అజ్ఞానభూయిష్ఠులగు గృహముల కానందమును చేకూర్పవలయుననియు మా ప్రార్థన."

*Stri Dharma*

## ఆంధ్రదేశపర్యటనమును గూర్చి:—

యల్. యస్. గుబిల్ సుందరేశంగారు తమ ఆంధ్రదేశపర్యటనమునుగూర్చి హిందూపత్రికలో నిట్లువ్రాసిరి:—

"నేను పలుమరు ఆంధ్రదేశముగుండ ప్రయాణమొనర్చినను ఎచ్చటను ఆగి జనులతో పరిచయము కలిగించుకొనలేదు. ఆంధ్రుల యాచారములను, సంస్థలనుగూర్చి తెలిసికొను కుతూహలముతో నేను గతవారమున నెల్లూరు, బెజవాడ, గుంటూరు, మచిలీపట్టణము, రాజమహేంద్రవరము, కాకినాడ, విశాఖపట్నము, వాల్టేరు మొదలగుపట్టణముల జూచితిని. ఆంధ్రులతో మెలగి ఆంధ్రవిద్యార్థుల కుపన్యసించు అవకాశములు కలిగినవి. నాపర్యటనమున పెక్కుస్థలములందు ఆరోగ్యపరిస్థితులను, రోడ్లను చూచితిని. అన్నిటిలోను బెజవాడ, రాజమహేంద్రవరము ఎక్కువదుస్స్థితియందున్నవని నాయభిప్రాయము. రోడ్లు దుమ్ముతో నిండియుండుటయు, వీధులందు జలదారిగుండములుండుటయు సామాన్యము. పాఠశాలలు కళాశాలలు ఇతర ప్రదేశములందువలెనే చక్కగాపనిచేయుచున్నవి. నూతనవిశ్వవిద్యాలయమునందును, వైస్ చాన్సెలర్ గారగు సర్. యస్. రాధాకృష్ణన్ గారియందును జనులకుగల ప్రేమ కనబడుచునేయున్నది. ఆంధ్రులు నవీనులయందత్యాదరమును జూపుదురు. విద్యావిషయమున కొంతకాలముక్రితము వీరు తమిళులకన్న తక్కువదశయందుండిరేమోకాని ఇప్పుడట్లున్నారనుట సత్యదూరము. సాంఘికవిషయములందు తమిళులకన్న ఆంధ్రులెల్లప్పుడును ముందంజవేయుదురు. హరిజనుల దేవాలయప్రవేశసందర్భమున పెక్కండ్రు సవర్ణాంధ్రులు అనుకూలురుగానుండుట తృప్తికరమగువిషయము. ఆంధ్రస్త్రీలలోకూడ చాలమంది ఇందుల కనుకూలురే. పశ్చిమగోదావరి, గుంటూరుజిల్లాలం దెన్నియో దేవాలయములలోనికి హరిజనులరానిచ్చుట నెందరెరుగుదురు. పిఠాపురం మహారాజా గారు తనకోటయందలి దేవాలయమున హరిజనప్రవేశము నంగీకరించెను. ఆంధ్రమహిళామణులు విద్యయందును, సాంఘికవిషయములందును ఎవరికిని తీసిపోరు. వారికి దేశప్రేమ మెండు. బలవంత మవసరము లేకయేవారు స్వదేశీ, ఖద్దరు వీని నవలంబింతురు. స్త్రీలు నూతనాభిప్రాయములుగలవారలయ్యు ప్రాతఫక్కి ఆభరణములధరింతురు. ఇదియొకచిత్రమే."

## ముగ్గులు:—

"ముగ్గులుఅనుపదము తెలుఁగు చేర్చిన స్త్రీపురుషాదుల కందఱకుఁ దెలిసినదయ్యు దానియుపయోగమునే మఱచుచున్నారు. ప్రతియింటను ప్రతిదినము ఉదయసాయంతనముల యందీముగ్గుల నలంకరించు ఆచారమాదికాలమునుండియు నున్నప్పటికిని యీమధ్య భారతభూమియందీయలవాటు మఱువఁబడియుండుటయేగాక నట్టియలంకారముండుట ప్రాఁతపద్ధతియని తలఁచఁబడుచున్నది. అందువలన నీకళయందభిరుచి యస్తమించిన

దనవచ్చును. ఉత్తరహిందూదేశమునందుకంటె దాక్షిణాత్యులీయాచారమున నెక్కుడుశ్రద్ధ వహించెడివారు. కొన్నికొన్నిసంసారములీయుత్కృష్టపవిత్రతమాచారము నుల్లంఘించినను మధ్యమ, పేదతరగతుల వీపద్ధతిని గౌరవించుచు నేయున్నారు. సామాన్యముగ నుత్తరాది నీపూర్వాచారము సంక్రాంతిమాసము (ధనుర్మాసము) వందభిలాషపూరితులై తమ గృహాంగణములందును, వీథులందును వివిధగ నలంకరింతురు. దక్షిణాదినట్లుగాక ప్రతిదిన ముదయసాయంకాలములయందు కేవలక కొంచెముగనో, లేకయున్నయెడల గొప్పగనో, యీముగ్గులనలంకరింతురు. ముగ్గులవలన ఆయింటికి నవజీవన మేర్పడి నిత్యకల్యాణముగ గన్పట్టుటయేగాక మూఢవిశ్వాసజనకముగ నాయింటికి సిరితానంతటదావచ్చుననియు నట్లుముగ్గులు లేకయుండిన నాయిల్లు కళదక్కి హైందవగృహనిరూపణ కెక్కవయవకాశ మొసగుననియు పూర్వాభిప్రాయము. ఈముగ్గులు పచరించుటయందమితమగు నేర్పు-చాతుర్యము కలదు. బాలికలకును యువతులకు నీకళయందభిరుచియుండుట ముఖ్యము. ఇక వృద్ధులీయాచారమును తమ బిడ్డలకునొసగి వారాచరించునట్లు చూచుట విధాయకము.”

అవ్వై అనాథశరణాలయము :—

అనాథశరణాలయపు కార్యదర్శియు, కోశాధిపతియునగు డా॥ ముత్తులక్ష్మిరెడ్డిగారి నివేదికనుండి క్రిందిభాగములు ముద్రితములు:—

“మాసంస్థకు దాక్షిణాత్యమప్రసిద్ధకవియగు అవ్వైగారి పేరిడబడినది. ఇందన్నివర్ణముల బాలికలను ప్రవేశింపవచ్చును. ఆరోగ్యము, తెలివి, చక్కని నడవడికలవారి నిందుజేర్చుకొందురు. దిక్కులేనివారు రుసుమును చెల్లింపనక్కరలేదు. తలిదండ్రులుగాని, బంధువులుగాని కలవారు తమశక్తికొలది రుసుమును చెల్లింపవచ్చును. ప్రతిబాలికయు కులభేదమును పాటింపక ఇతరబాలికలను తనసమానులనుగా భావించునట్లు చేయుట ఈసంస్థయుద్దేశ్యము. ప్రస్తుతమీసంస్థయందు 7 బ్రాహ్మణబాలికలు, 9 నాయుడులు, 9 మొదలియార్లు, 1 రెడ్డి, 1 మళయాళి, 3 కళావంతులుగలరు. ఈసంస్థ ఒకకమిటీపాలనయందున్నది. ఆకమిటీయందు, డా॥ ముత్తులక్ష్మిరెడ్డి (కార్యదర్శి, కోశాధిపతి) శ్రీమతి రాజీవి శివరావుసతి, డా॥ పారుకుట్టి రామన్ సతి, శ్రీమతులు క. పి. ఆచాయి, జి. విశాలాక్షి, అమ్ముస్వామినాధన్ సతి, సి. యస్. నల్లముత్తు అమ్మాళ్ కన్య, శ్రీమతులు వెంకటప్పసతి, టి. జి. పిళ్లైసతిగార్లు సభ్యులు. ఈబాలికల నడవడియందును, మతవిషయములందును కేమెక్కుడుశ్రద్ధను వహింతుము. ఈసంస్థ 1930 సం॥ జూలై [illegible] పదుగురుకన్యకలతో ప్రారంభింపబడెను. ఇప్పుడు 4 మొదలు 18 సం॥ వయస్సుగలవారు 30 మంది బాలికలున్నారు. వీరిలలో పెద్దవారు చిన్నవారి సౌకర్యములను విచారింతురు గృహకృత్యములు, వంట మొదలగుపనులు చేయుదురు. బాలికలు సమీపపాఠశాలలందు విద్యనభ్యసింతురు. జాతీయబాలికాపాఠశాల, లేడీవెల్లింగ్టన్ శిక్షాశాల, శారద విద్యాలయము, మైలాపూరు కాన్వెంట్ మొదలగు విద్యాలయము లీబాలికలకు జీతములేకను, తక్కువజీతములకును విద్యగరపుచున్నందులకు కమిటీవారు కృతజ్ఞత చూపుచున్నారు. ఈసంస్థ ప్రస్తుతము మైలాపూరు కచ్చేరిరోడ్డునందు నెం. 1 భవనమున స్థాపింపబడినది. గొప్పభవనమునందీసంస్థను స్థాపించి, పెక్కుండ్రుబాలికల ప్రవేశమునకందు సౌకర్యముల నేర్పరచుటయందు త్యాగశీలురు మాకు తోడ్పడుదురుగాక యని ప్రార్థించుచున్నాము. మద్రాసునందు అనాథశరణాలయ మత్యావశ్యకము. బొంబాయి, కలకత్తా, లాహోరు, మొదలగు నగరములందిట్టి సంస్థలున్నవి. ఈనగరముననే మిషనరీల చేజరుపబడుసంస్థలు చాల కలవు. ఈసంస్థను వృద్ధిపరచి పదునెనిమిదేండ్లకు లోపలనుండు బాలబాలికలకు ప్రవేశమొసగి, పోషణలేకగాని, దీనరికముచేగాని ఏబిడ్డను కష్టపడకుండునట్లు చేయుటే మాపరమావధి. “అవ్వైశరణాలయము”నకు విరాళములనొసగి మనబిడ్డల కష్టములబాపి, మనపై బిడ్డలకుగల హక్కును స్థాపింతురని ధర్మతత్పరులగు

జనులనందరిని వేడుకొనుచున్నాము. అందరిబిడ్డలయందును మాకుగల ప్రేమ ప్రాబల్యముచేతను జనసమ్మతిని, సహాయమును బడయగలమను నమ్మకముచేతను మేమీ ధర్మకార్యమునకు పూనుకొంటిమి."

సనాతనులు : చండాలురు:—

"శంకరుడొకనాడు వారణాసియందు మణికర్ణఘట్టమున స్నాతుడై పోవుచుండ మద్యపాత్రనుధరించి నాలుగుకుక్కల వెంటగైకొనివచ్చు ఒకచండాలుఁ డాయన నెదుర్కొని "నాశరీరము మీశరీరమువంటిదే కదా, నాయాత్మ మీయాత్మలచైతన్యమున నొకభాగమేకదా, నన్నేలమీరు దూరమునకుంచెదరు" అని ప్రశ్నించుటయు, శంకరుడంతనిగర్వుడై "ప్రజ్ఞామానుషపంచక" అను ప్రసిద్ధశ్లోకమును పఠించుచు, "తానే పరబ్రహ్మమనియు, అనిత్యమగు శరీరము తానుగాదనియు తెలిసికొన్నవాడే నాగురువు" అనుటయు లోకవిదితమగు విషయము. రామానుజుఁడొకప్పుడు చోళరాజ్యమునందలి దేవాలయముల చూచుచు పోవుచుండి తిరుపలితిరునగరము చేరెను. అంతనాయన దేవాలయప్రదక్షిణ మొనర్చుచుండ నొకచండాలస్త్రీ ఆయనకగపడెను. ఆపలపొమ్మని రామానుజుఁడామెను కోరెను. "ఎదుట తాను పవిత్రబ్రాహ్మణుడు. పార్శ్వముల నొకవైపు దేవాలయము, ఒకవైపు తిరువలికోనెల, మఱొకవైపు పరకాలయను మహాత్ముడు సేవించిన రావిచెట్టు ఉండ నేనెటుపోదును, మహాత్మా!" అని ఆమె నిర్భయముగా నడిగెను. తనయజ్ఞానముచే దైవభక్తుల గుర్తెరుంగ జాలకపోయినందులకు రామానుజుడు చింతించి వైష్ణవమతమున బ్రవేశించి మతమును పవిత్రమొనర్చుమని ఆమెను కోరెను. మహాపూర్ణుడను గురువు మారనేరి నంబియను చండాలసన్యాసి సంస్కారక్రియల నాచరించెనని విని రామానుజుఁడతని కడకేగి "స్వామీ! తామిట్లు ధర్మముతప్పి నటించవచ్చునా?" అని ప్రశ్నించెను. గురువు అందులకు "జటాయువును స్వయముగ దహనమొనర్చిన రామునికన్నను, శూద్రుడగు విదురుని సంస్కారము చేసిన యుధిష్ఠిరునికన్నను నేను గొప్పవాడను కాను" అని చెప్పెనట. అట్టి మహాపూర్ణుని శ్రీరంగమునందలి శ్రీవైష్ణవులు మొదలగువారు దూషించుచుండ ఆయనకుమార్తె యోర్వజాలక తిరుప్పనాళ్వార్ అను చండాలుని తనయందైక్యముచేసికొన్న రంగనాథుని వైష్ణవులెవ్వరును పూజింరాదని పలికెనట. తిరుప్పనాళ్వార్ యను నతఁడొకచండాలుడు. ఆచారవంతులమనువారు అతడు పరిపాలనువందు పడియుండ చండాలురు కొనిపోయి సాకిరనియు, అతడు జన్మచండాలుడుకాడనియు వ్రాసిపెట్టుదురు. ఇతఁ డనుదినమును శ్రీరంగమున రంగనాథదేవాలయద్వారముకడ కరుదెంచి భగవన్నుతి సేయుచుండెను. అర్చకులు అతనిపై రాలురువ్వుచుండిరి. ఒకనాడు రంగనాథుడు ప్రధానార్చకుడగు లోకసారంగమహామునికి స్వప్నమందు కనబడి తనభక్తుని మోసికొనిరమ్మని చెప్పెనట. అర్చకుఁ డంత తిరుప్పనాళ్వార్ను వీపులవెంట తనమూపులపై తెచ్చెను. దేవుడు తనభక్తునకు దర్శనమిచ్చి అతనిని తనలో నైక్యము చేసికొనెను. నల్లానుయనునతఁడు శ్రీరామానుజాచార్యుల శిష్యుడు. ఈయన మైసూరురాజ్యమునందలి యాటవికులకు వైష్ణవమతమును గరపెను. మధురవద్ద వైగేనదియందొకనాడు వైష్ణవచిహ్నములుగల శవము తేలుచుండ అతఁడాశవమును తీరమునకు తెప్పించి దహనమొనర్పించెను. అందులకు వరదరాజస్వామి ఆయనను మెచ్చి నల్లాన్ (అనగా మంచివాడు) అని పేరుపెట్టెను. జనులందరును చండాలశవదహనమొనర్చినందులకు నల్లానును గర్హించిరనియు, వరదరాజస్వామి వారిని నివారించి అతను సద్వర్తనుడని చెప్పెననియు కొందరుచెప్పుటగలదు. శ్రీరామానుజాచార్యులు తిరునారాయణపురమునందలి శ్రీనారాయణుని దేవాలయమును పునరుద్ధరింపదలచెను. స్వప్నమున నారాయణు డగపడి ఉత్సవవిగ్రహము ఢిల్లీపాదుషా నగరునందున్నదని చెప్ప అతిసాహసముతో నచటకేగి తన మహిమచే పాదుషాను మెప్పించి విగ్రహమును గైకొని తిరిగివచ్చునపుడు త్రోవను దొంగలడ్డగించిరి. అచటనున్న చండాలురు కొందరాచార్యులకు సహాయపడి వారిని, విగ్రహమును కాపాడిరి. వారిసహాయ్యమునకు మెచ్చుకొని రామానుజుడు వారికి "తిరుకులతార్" అను పేరునొసగుటయేగాక బెలూరు; శ్రీరం

గము, మేల్ కోట దేవాలయములలోనికి సంవత్సరమున కొకమారు దేవపూజకు రానిచ్చునట్లు చేసెను. అనంతపురముజిల్లాలో కదిరి నరసింహస్వామి దేవాలయమునందుకూడ అనాదిగా చండాలురు పూజసల్పి ముడుపుల నర్పించు ఆచారముకలదు."

—*The Hindu.*

సదాపచెట్టు:—

"సదాపచెట్టు భారతదేశమం దన్నిప్రాంతములలోను దొరకును. ఈచెట్టు రెండు లేక రెండున్నర అడుగులకన్న నెక్కుడెత్తున పెరుగదు. సన్ననిరెమ్మలుగలిగి గుజ్జగనుండును. ఈచెట్టు చూపున కందముగనుండును. తక్కువ పరిమాణమును గలిగియుండినను ఆకులు వాటినిర్మాణాకృతియు ములగఆకులను పోలియుండును. ఈచెట్టు మొదటినుండి తుదవరకును ఒకవిధమగు గాఢమగు గంధమును గలిగియుండును. ఆకును ముట్టిన హస్తము అధమము పదునైదునిముసములవరకైనను వాసనను గలిగియుండును. ఈచెట్టుయొక్క గంధమింపుగనుండదు. ఈసదాపచెట్టు ప్రాచ్యప్రతీచీవైద్యవిధానములందు స్థానముగలిగియున్నది. దీనికి లాటిన్ భాషలో Ruta Graveolens అనియు ఆంగ్లములో Garden Rue (గార్డన్ రూ) అనియు పేర్లుకలవు. సంస్కృతమున నీయోషధికి శతపుష్ప, మిసి, మిశ్రేయ, హింసోయ, సదాపు మున్నగు నామములు కలవు. దీనిపచ్చియాకు చేదుగను, కారముగను, వెగటుగనుండును. వేరు చిరుచేదు గలిగియుండును. ఈయోషధియొక్క ప్రతిభాగమును వైద్యులచే నుపయోగింపబడుచున్నది. అంతియేగాక భూతవైద్యులుకూడ దీనిపై నెక్కువగ నాధారపడియుందురు. భూతభయము నివర్తించుటకు సదాపఆకులధూపము వేయుచుందురు. దీనివలన భూతభయము నివర్తియగునని వారు నమ్ముచుందురు. ఈఓషధి మేహము, వాతము, శ్లేష్మము, పైత్యము మొదలుగాగల శారీరవ్యవస్థలపైన పనిచేయుటలో ప్రసిద్ధిగన్నది. సమయానుకూలవర్తనమును ప్రదర్శించు నీయోషధిని వైద్యులు తరుచువాడుచుందురు. ఇంక నీయోషధియొక్క నేరు వేరుభాగము లెటులుపయోగింపవచ్చునో యెట్టిగుణములను గలిగియున్నవో తెలిపెదము. సదాపతాకు పలువిధములుగ నుపయోగింపబడుచున్నది. దీనియొక్క గుణప్రధాన్యతవలననే యిన్నివిధముల నీపత్రముపయోగింపబడుచున్నదని మరియొకమారు చెప్పవచ్చును. సదాపఆకులనించుక ఆముదముతో వెచ్చచేసి గడ్డకుకట్టునెడ గడ్డలుహరించును. ప్రథమదశయందున్న గడ్డల కీయాకులు కట్టబడునెడ నవిత్వరలోనే పక్వస్థితికి కొనిరాబడును. సదాపపత్రముల (యెండినవిగాని పచ్చివిగాని) యొక్కరసములేక కషాయము ఆసనమువెంట వస్తి (పిచ్చికారీ) చేసినయెడ బిడ్డలకు అజీర్ణమువలన గల్గిన ఈడ్పులు (Convulsions) నివారణమగును. పచ్చియాకులనూరి బ్రాంది, సారాయి, చిగురుసారాయి యీ ద్రవములలో నెద్దానిలోగాని కలిపి పక్షవాతమువచ్చినవారికి ప్రథమదశలో నుపయోగించిన ఆవ్యాధి కుదురును. ఎండుటాకుల చూర్ణము బిడ్డలకువచ్చు దగ్గును నివారించును. సదాపపత్రములను నీడనుంచియే యెండబెట్టి చూర్ణముచేసి చాతుర్జాతములతో (ఏలకులు, లవంగములు, దాల్చినిచెక్క, నాగకేసరములు) కలిపియిచ్చినచో అగ్నిమాంద్యము (Dyspepsia) కుదురును. ఎండుటాకులచూర్ణముతో హారతికర్పూరము, తాటిబెల్లము, పటికపంచదారకలిపియిచ్చిన గర్భస్రావము గలుగును. పచ్చియాకులరసమును బిడ్డలకొసగునెడ కడుపులోనున్న నులిపురుగులు బయటబడును. ఈ ఆకులొకకట్టగాకట్టి బిడ్డలగుండియలపైనుంచిననే నులిపురుగునచ్చివేయునని చెప్పబడియున్నది. సదాపఆకులను బట్టిబెట్టునెడ (Distill) ఒకవిధమైన తైలము బయలుదేరును. ఈ తైలము చాలయుపయోగమైనదని ప్రాచ్యపాశ్చాత్యవైద్యులచే నంగీకరింపబడినది. ఈ తైలమునకు ఒకవిధమగు వాసనగలదు. దీనికి కొంతవరకు మత్తునిచ్చు గుణముగలదనవచ్చును. దీనివాసనయందే జీర్ణమును కలిగించుశక్తియున్నదని నిర్ధారణచేయబడినది."

—డాక్టర్ యస్. శేషగిరిరావు యల్. ఐ. యమ్.




**115 ఏండ్ల వృద్ధుడు :—**

హైదరాబాదులో మసీదుపాలకుడుగనుండిన మౌలానాసయ్యదు అబ్దులురషీదు గారీ నడుమ చనిపోయిరి. చనిపోవునరికి వారివయస్సు 115 ఏండ్లు, ఇరువై సంవత్సరములసగటు ఆయుర్దాయముగల భారతీయులలో ఇన్ని ఏండ్లవఱకు బ్రతికియుండుట ఆశ్చర్యకరమే.

**పాటవినుటకు పాములు వచ్చినవి :—**

కాలికట్టువద్దనున్న చేవయ్యూరునకొంతమంది సైనికులుండిరి. వారు రాత్రులయందు ప్లాటుబ్యాండు వాయించుచుండెడివారు. ఈపాటవినుటకు వరుసగా రెండురోజులు పాములువచ్చినవి. పాటపాడునపుడు భయములేక వచ్చెడివి. ఇట్లు వచ్చినవాటిని పదహారుపాములనుపట్టి చంపిరి.

**ఒక విచిత్రమైన కుక్క :—**

అర్మూరు తాలూకాలోచేరిన నికాల్పురమందు నొకబ్రాహ్మణుడు గోదావరియొడ్డున సంవత్సర పర్యంతము భజన చేయుచుండెను. ఒకకుక్క యెచ్చటినుండియో వచ్చినది. భజనపరులతోబాటు గోదావరిస్నానమునకు సంవత్సరపర్యంతము పోవుచుండెను. మొన్న కార్తీకబహుళ పంచమినాడు గోపాలకాల్వ సమాప్తి రోజునకూడ అది గ్రామజనులతో గోదావరీస్నానము చేసివచ్చుచు మార్గమధ్యమున మృతినొందెను. భజనపరులాకుక్కను మరల గోదావరిలో ముంచి పుష్పములతో నలంకరించి భజనతో సమాధిగావించిరి. తాలూకా ప్రాంతజనులు ఈవిచిత్రసారమేయ మరణమునకు దుఃఖించుచున్నారు. —గోలకొండపత్రిక.

**పామును ముద్దుగొనిన పడతి :—**

పోహాకాంగులనుండి పాయామ్మోక్ అను సర్పవిషచికిత్సకుడును, అతనిభార్య మాహ్లోయును, అతని కుమార్తెయు రంగూనునకువచ్చి టివోలీనాటకశాలయందు సర్పములలో నతివిషసర్పమగు నాగసర్పముపై తమకుగల యధికారప్రదర్శనము గావించుచున్నారు. దుష్టసర్పమును ముద్దుపెట్టుకొనుటను జూచుటకిది మొదటితూరి. 12 అడుగులకుపైగా నిడివిగల యొక నాగసర్పమును మాహ్లో తన దేహముచుట్టును చుట్టుకొననిచ్చుట యేగాక ఇట్టిసర్పములను మూటిని ఆమె ముద్దుపెట్టుకొనును. కోరలదెరచి సర్పములంతన్ను కఱచుటకు ప్రయత్నించినపుడు డామె అతిమెలకువతో తప్పించుకొనును. ఈపాములకు విషపూరితములగు దీర్ఘములగు కోఱ్ఱలను తీసివేయలేదు. మాహ్లోను జూచిన ఈపాములకు ఉత్సాహము. ఒకటొకటిగావవి బుట్టలోనుండి తమపడ

గలనుజారి ఇట్టటుకొంచెను యీగి అతిత్వరగా మార్లానుకొట్టును. కాని ఆమె తెలివితో కోలదెబ్బను తప్పించుకొనును. మార్లా నాట్యమారంభించినపుడు సర్పములుకూడ పడగలెత్తి నాట్యమాడును. పిమ్మట మార్లా వానిని ముద్దుపెట్టుకొనును. ప్రదర్శనము అత్యద్భుతముగనుండెను. ఇరువురి సాహసము, నైపుణ్యము, ధైర్యము మిళితమైయుండెను. మార్లా తనముఖమును సర్పములవద్ద నుంచినపుడవి యూరకుండుట కడు చిత్రము.

చేపకడుపున శిశుశవము :—

పాట్నాజిల్లాయందు కొందరు జెస్తాలుకా పెద్దచేపను పట్టిరి. దానికి మొప్పలు లావుగనుండుటచేతను, చేపచాల పెద్దదగుటచేతను చేపలుగొనువారందరును దానిచుట్టును మూగిరి. ఫ్రాన్ ఫూజ్ మార్కెట్టు చేపల వ్యాపారియొకడా చేపనుకొని దానిని కోయింపగా దానియుదరమున పూర్ణావయవములుగల మగశిశువు విగతజీవియై యుండెను.

జపానుదేశపు "షైలాక్కు" :—

జపానుదేశములో ఒకానొక క్రూరుడు జూదమున దనకోటువడిన యేడుపౌనుల రొక్కమును చెల్లింపలేని పేదవానివద్దనుండి బాకీకిబదులుగా వానిచేతివ్రేళ్లను నాల్గింటిని పుచ్చుకొనుటకు సమ్మతించెను. వ్రేళ్లను పోగొట్టుకొన్నవానిని పోలీసునిర్బంధముతో ఆసుపత్రికి తెచ్చిరి. అతనిని ఎన్నిమారుల ప్రశ్నించినను ఆక్రూరుని పేరుగాని చిరునామాగాని చెప్పుట కంగీకరింపడయ్యెను. ఋణమునకై వ్రేళ్లను కోసి పుచ్చుకొన్న ఆక్రూరుడు "షేక్స్పియరు మర్చెంటు ఆఫ్ వెనీసు నాటకమునం బ్రసిద్ధుడయిన షైలాక్కు"ను దలపించుచున్నాడు.

732 పౌనుల స్త్రీలోకాంతరగతయగుట :—

వర్జీనియా వాస్తవ్యురాలగు మిస్ ఆల్వైన్ బ్లట్ అనునామె నలుబదియేండ్ల ప్రాయమున అకాలమరణము జెందినది. ప్రపంచమున కంతకును స్థూలతమురాలగునీమె యీప్రాయమున 732 పౌనులు తూగినది!

గంటకు 195 మైళ్లు ప్రయాణముచేయు టపావాయు విమానము:—

బ్రిటనులో గంటకు 195 మైళ్లు ప్రయాణముచేయగల టపావాయువిమానము తయారగుచున్నది. దీనిలో రెండుగదులుండును. ఒకటి విమానము నడుపువారి కిద్దరకుజాలినదిగను, రెండవది టపాలుంచుటకును నేర్పరుపబడును. మొదటిగదియందు ఒకడు విమానమును నడుపునప్పుడు రెండవవాడు పరుండుటకు ఏర్పాటుచేయబడినది. విమానము నడచునప్పుడు టపాపనులు చూచుచుండుటకును, టపాలుదింపుటకును తిరుగా పుచ్చుకొనుటకును తగినయేర్పాటులు జరుగుచున్నవి.

గొడుగులనద్దెకిచ్చు రైలుకంపెనీలు :—

ఆంగ్లదేశమున యల్. యమ్. యస్. రైల్వేవారు ప్రయాణికులకన్ని సౌకర్యములను కల్పించుచున్నారు. రైలునుండి ఇంటికిపోవునపుడు వానకురియుచున్నయెడల 2 షిల్లింగుల డిపాజిట్టు 6 పెన్నీల అద్దెను చెల్లించి రైల్వేవారివద్ద గొడుగులను బడయవచ్చును. వారమురోజులకుపైగా గొడుగునుంచుకొన్నవారు ఒకషిల్లింగు నెక్కువగ చెల్లింపవలసియుందురు.

జూదమాడి భార్యను గోల్పోయిన కలియుగ ధర్మరాజు :—

జూదమునందు భార్యనోడుట చిత్రముగ కన్పించినను వార్సాయందట్టిది జరిగినది. ఇరువదారు సంవత్సరముల పోలెండు యువకుడొకడు నిరుద్యోగముచే దిక్కుతోచక అనుదినమును జూదమాడుచుండెను. చాల నష్టపడి తుదకు భార్యనొడ్డి ఓడిపోయెను. జూదమువకుగాను భార్యను 4 షిల్లింగులు 6 పెన్నీల కిమ్మకువేసెను.

గలనుజూచి ఇట్టటుకొంచెను ఊగి అతిత్వరగా మాహ్లానుకొట్టును. కాని ఆమె తెలివితో కోలలదెబ్బను తప్పించుకొనును. మాహ్లా నాట్యమారంభించినపుడు సర్పములుకూడ పడగలుజూచి నాట్యమాడును. పిమ్మట మాహ్లా వానిని ముద్దుపెట్టుకొనును. ప్రదర్శనము అత్యద్భుతముగనుండెను. ఇరువు నిదానము, నైపుణ్యము, ధైర్యము మిళితమైయుండెను. మాహ్లా తననుఖమును సర్పములవద్ద నుంచినపుడవి యూరకుండుట కడు చిత్రము.

చేపకడుపున శిశుశవము :—

పాట్నాజిల్లాయందు కొందరు జెస్తాలోక పెద్ద చేపనుపట్టిరి. దానికడుపుచాల లావుగనుండుటచేతను, చేపచాల పెద్దదగుటచేతను చేపలగొనువారెందరును దానిచుట్టును మూగిరి. ఫ్రాన్‌ఫ్రాంక్ మార్కెటు చేపల వ్యాపారియొకడా చేపనుకొని దానిని కోయింపగా దానియుదరమున పూర్ణావయవములుగల మగశిశువు విగతజీవుడై యుండెను.

జపానుదేశపు "షైలాక్కు" :—

జపానుదేశములో ఒకానొక క్రూరుఁడు జూదమునఁ దనకోటుపడిన యేడుపౌనుల రొక్కమునఁ జెల్లింపలేని పేదవానివద్దనుండి బాకీకిబదులుగా వానిచేతివ్రేళ్లను నాల్గింటిని పుచ్చుకొనుటకు సమ్మతించెను. వ్రేళులను పోగొట్టుకొన్నవానిని పోలీసునిర్బంధముతో ఆసుపత్రికి తెచ్చిరి. అతనిని ఎన్నిమారుల ప్రశ్నించినను అక్రూరుని పేరుగాని చిరునామాగాని చెప్పుట కంగీకరింపఁ డయ్యెను. ఋణమునకై వ్రేళ్లను కోసి పుచ్చుకొన్న అక్రూరుఁడు "షేక్స్పియరు మర్చెంటు ఆఫ్ వెనీసు నాటకమునఁ బ్రసిద్ధుఁడయిన షైలాక్కు"ను దలపించుచున్నాడు.

732 పౌనుల స్త్రీ లోకాంతరగతయగుట :—

వర్జీనియా వాస్తవ్యురాలగు మిస్ ఆల్బైన్ బ్లబ్ అనునామె నలుబదియేండ్ల ప్రాయమున అకాలమరణమును బొందినది. ప్రపంచమున కంతకును స్థూలతమురాలగునీమె యీప్రాయమున 732 పౌనులు తూగినది!

గంటకు 195 మైళ్లు ప్రయాణముచేయు టపావాయు విమానము :—

బ్రిటనులో గంటకు 195 మైళ్లు ప్రయాణముచేయఁగల టపావాయువిమానము తయారగుచున్నది. దీనిలో రెండుగదులుండును. ఒకటి విమానము నడుపువారి కిద్దరకుఁజాలినదిగను, రెండవది టపాయుంచుటకును నేర్పరుపఁబడును. మొదటిగదియందు ఒకఁడు విమానమును నడుపునప్పుడు రెండవవాఁడు పరుండుటకు ఏర్పాటుచేయఁబడినది. విమానము నడచునప్పుడు టపాపనులు చూచుచుండుటకును, టపాలుదింపుటకును తిరుగా పుచ్చుకొనుటకును తగినయేర్పాటులు జరుగుచున్నవి.

గొడుగుల నద్దెకిచ్చు రైలుకంపెనీలు :—

ఆంగ్లదేశమున యల్. యమ్. యస్. రైల్వేవారు ప్రయాణికులకన్ని సౌకర్యములను కల్పించుచున్నారు. రైలునుండి ఇంటికిపోవునపుడు వానకురియుచున్నయెడల 2 షిల్లింగుల డిపాజిట్‌ను 6 పెన్నీల అద్దెను చెల్లించి రైల్వేవారివద్ద గొడుగులను బడయవచ్చును. వారమురోజులకుపైగా గొడుగునుంచుకొన్నవారు ఒకషిల్లింగు హెచ్చుగ చెల్లింపవలసియుందురు.

జూదమాడి భార్యను గోల్పోయిన కలియుగ ధర్మరాజు :—

జూదమునందు భార్యనోడుట చిత్రముగ కన్పించినను వార్సాయందట్టిది జరిగినది. ఇరువదారు సంవత్సరముల పోలెండు యువకుడొకడు నిరుద్యోగముచే దిక్కుతోచక అనుదినమును జూదమాడుచుండెను. చాల నష్టపడి తుదకు భార్యనొడ్డి ఓడిపోయెను. జూదమునకుగాను భార్యను 4 షిల్లింగులు 6 పెన్నీల కిమ్మతుచేసిరి.

# డైరి

## నవంబరు

19:—లండనునుండి కేపుటవునకు తక్కువకాలములో నైమానిక ప్రయాణమును సలిపిన ఎమీజాన్సన్ గారిని అభినందించుచు జార్జిసార్వభౌములు తంతివార్త నంపిరి.

:—వేలూరు. చెరసాలలో శ్రీమతి జో శెటి భారతమ్మగారు ప్రసవించిరి.

:—వేలూరు. చెరసాలనుండి విడుదలపొంది శ్రీమతి మదుంబ వేంకటమ్మగారు ఏలూరు చేరిరి.

20:—తెనాలి తాలూకానుండి గుంటూరు జిల్లాబోర్డుకు స్త్రీలప్రత్యేకస్థానమునకు సుందరమ్మ, శ్రీదేవి, సుబ్బారామమ్మగార్లు పోటీచేసిరి. సుందరమ్మగారికి 2805 వోట్లు వచ్చినందున ఆమె ఎన్నుకొన బడినట్లు ప్రకటింపబడినది.

21:—బెంగుళూరు. శ్రీ టంగుటూరి ప్రకాశము పంతులుగారి భార్య హనుమాయమ్మగారు హైదరను హిందూ హోటలులో చనిపోయిరి.

:—కలకత్తా. వంగరాష్ట్రమున అస్పృశ్యతా నిర్మూలనమును గూర్చి ఆలోచించుటకు తక్షణము ఎఱవాడకు రావలెనని మహాత్ముడు తంతివార్త నంపుటచే దేశబంధుదాసుగారి చెల్లెలు శ్రీమతి ఊర్మిళాదేవిగారు ఎరవాడకువెళ్లిరి.

22:—లండను. బేగము నూర్జహాను బి. ఏ. గారు ఈవినింగున్యూసు పత్రికలో భారత స్త్రీలప్రతిభను ప్రస్తుతించుచు నొకగొప్ప వ్యాసమువ్రాసిరి.

:—డక్కా. శ్రీమతి నునీ బాలకార్, హేమలతా ఆచార్య, షేక్ సాధుగార్లు కర్తికపురం యూని యన్ కోర్టును పికెటింగు చేసినందులకు మూడేసి, ఆరేసినెలలు కఠిన శిక్షనుపొందిరి.

:—మున్షిగంజ్. శ్రీమతులు చపలాసుందరి, ఇందుమతి మిత్రగార్లు అబ్దుల్లా పూరుయూనియన్ కోర్టులో అరష్టుచేయబడిరి.

23:—ఏలూరు. శ్రీమతి దామరాజు లక్ష్మమ్మగారు పశ్చిమ గోదావరి జిల్లాబోర్డునకు సభ్యురాలుగా నెన్ను కొనబడిరి.

:—సుమారు 25 గురు సి. తరగతి స్త్రీరాజకీయ ఖైదీలు వేలూరు సెంట్రలు జెయిలునుండి కన్ననూరు జెయిలుకు మార్చబడిరి.

24:—అహమదాబాదు. మహాత్ముని ఆశ్రమ నివాసియు, గుజరాతు కాంగ్రెసు 32-వ నియంతయునగు శ్రీమతి తారాబెన్ మోడీగారిని కాంగ్రెసు ప్రచారము సలుపుచుండగా అరెష్టుచేసిరి.

25:—నరసాపురము తాలూకానుండి పశ్చిమ గోదావరిజిల్లా బోర్డుకు శ్రీమతి పెల్లూరి రత్నమ్మగారు సభ్యురాలుగా నెన్నుకొనబడిరి.

:—మాధవరము. గరల్సుస్కూలులో శ్రీమతి పోడూరి శేషమ్మగారి ఆధిపత్యమున జరిగిన స్త్రీలకు, బహిరంగసభలో శ్రీమతి డాక్టరు ఆచంట లక్ష్మీదేవి ఎం. బి. బి. ఎస్. గారు స్త్రీవిద్యాభివృద్ధిని గూర్చియు, పంచమ సమస్యనుగూర్చియు ఉపన్యసించిరి.

26:—లండను. గిల్డుహాలులో శ్రీమతి బేగము షానవాజుగారు ఉపన్యసించిరి. ఈహాలులో ఉపన్యసించిన భారత స్త్రీలలో ఈమెయేప్రథమురాలు.

:—కరాచీ. సింధురాష్ట్ర కాంగ్రెసు కమిటీ డిక్టేటరు అను పేరుతో వ్యవహరించిన సీతాబాయిగారికి రెండు నెలలుశిక్ష విధింపబడెను.

27:—లండను. "చివరకు దొరతనము వారిటుల నిర్ణయించినను లోథియను కమిటీవారి నివేదికలో తెలుపబడిన సంఖ్యకు స్త్రీలప్రాతినిధ్యము తగ్గగూడదు" అని బేగము షానవాజుగారు టైమ్సు పత్రికకు వ్రాసిరి.

పశ్చిమ బంగాళా మహిళాసభ కలకత్తా హంస్లీ కాలేజియందు జరిగెను. శ్రీమతి హేమలతాదేవి గారధ్యక్షత వహించిరి.

28:—బొంబాయి. గాంధిగారి సతి శ్రీమతి బేలాబేనుగారితో కాలికట్టుకు ప్రయాణమైరి. బేలబేనుగారు సబర్మతి ఆశ్రమనివాసి. కొన్నిసంవత్సరములు మలబారునందుండి వచ్చెను. గురువయ్యూరు దేవాలయము సందర్భమున కేరళ రాష్ట్రమునందు వీరుసంచారము చేయుదురు.

:—కలకత్తా. సత్యబలాదేవియును, ఇంకను 6-గురు స్త్రీవాలెంటీర్లును క్లయివు వీధిలో ఊరేగింపు జరుపుచుండగా అరెస్టుచేయబడిరి. వీరికి 6 నెలలు కఠినశిక్ష విధింపబడెను.

29:—శ్రీమతి కస్తూరిబాయి శ్రీమతి బెలబేనుగార్లు మదరాసుచేరిరి.

:—కలకత్తా. శివపూరు రాజకీయ మహాసభ జరుపవలెనను ప్రయత్నములో శ్రీమతి కనపాల బానర్జీ అధ్యక్షురాలిని, మరి 25 మందిని అరెష్టుచేసిరి.

:—మున్షిగంజ్. బహీరాంకు సత్యాగ్రహ ఆశ్రమము అక్రమ సంఘమని నిర్ణయించి సదరు ఆశ్రమమును పోలీసువారు వశపఱచుకొని శ్రీమతి సురమాముఖర్జీయను నామెను ఇంకను 5-గురు స్త్రీవాలంటీర్లను అరష్టుచేసిరి.

30:—మదరాసు. తిలకు ఘట్టమున అస్పృశ్యతా నివారణ హరిజనోద్యమములనుగూర్చి శ్రీమతులు కస్తూరిబాయిగాంధి, కజిన్సుసతిగార్లు ఉపన్యసించిరి.

## డిసంబరు

1:—శ్రీమతి కస్తూరిభాయి గాంధిగారు కాలికట్టుచేరిరి.

:—బొంబాయి. హిందుస్థాన సేవాదళపు డైరక్టరగు కే. బి. మెహవగారి భార్యయగు మణిబెను మెహతాగారు ఆర్డినెన్సు ననుసరించి అరెష్టు చేయబడిరి.

:—వేలూరు చెరసాలనుండి విడుదలపొంది శ్రీమతి వేదాంతం కమలాదేవిగారు కాకినాడచేరిరి.

2:—డిల్లి. సుశీలాదేవి వేకడిడి అను స్త్రీ డిల్లీ కుట్రకేసులో పారిపోయిన ముద్దాయి అను అపోహపై అరెష్టుచేయబడి విడుదలచేయబడిరి. ఆమెను డిల్లివిడిచి పొమ్మన్నందున పంజాబుకుపోయెను.

:—శ్రీమతులు తంగిరాల సీతారామమ్మ, పాలకొండేటి శ్యామలాంబగార్లు రాయవెల్లూరు స్త్రీలజయిలు నుండి విడుదలకాబడి మద్రాసుచేరిరి.

:—బరంపురము. రాజమహేంద్రవరము వైశ్య సేవాసదనము అధ్యక్షురాలగు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు స్త్రీసమాజము తరపున దిగుమర్తి వారియింటివద్ద సభజరిపిరి.

3:—శ్రీమతులు కస్తూరిబాయిగాంధి, ఊర్మిళాదేవిగార్లు పట్టంబిచేరిరి.

:—లాహూరు. శ్రీమతి సుమిత్రదేవిగారు, క్రి. లా. స. చట్టము 17 ప్రకారము 6 నెలలు కఠినశిక్ష రూ. 50 జరిమానాయు డిల్లీ మాజస్ట్రీటుచే విధించబడెను. ఈమె కుటుంబమువారందరు ప్రభుత్వ ప్రతికూలురు కావున యీమెకు తక్కువశిక్ష వేయుట నిరుపయోగమని మేజస్ట్రీటు తీర్పులో చెప్పియుండెను. ఈమె అపీలుచేయగ న్యా॥ జయులాలుగారు విచారించి, ఆమెకు శిక్ష విధించునపుడు ఆమె చేసిన నేరమునుబట్టియే నిర్ణయించవలెను గాని, వారి కుటుంబ చరిత్రనుబట్టి శిక్షించుట న్యాయముకాదని జడ్జిగారు దెలిపిరి. ఇపుడనుభవించిన శిక్ష చాలునని విడుదలచేసిరి.

4:— మధుర. శ్రీమతి సుభద్రమ్మగారు రాజకీయ ఖైదీస్థానిక కారాగారమునుండి గవర్నమెంటు ఆసుపత్రికి టైఫాయిడు జ్వర చికిత్సకై మార్చబడిరి.

5:— రాయవేలూరు జయిలునుండి బెజవాడనివాసినియగు శ్రీమతి రామానుజమ్మగారు విడుదల అయిరి.

7:— మదరాసు. శ్రీమతి కజిన్సు సతిగారిని అరెస్టు చేసి వదలివైచిరి.

:— వేలూరు. డా. పిచ్చుముత్తమ్మాళ్ గారు, శ్రీమతి వ. నాగరత్నమ్మభుగార్లు జెయిలునుండి విడుదల నొందిరి.

8.— తిరూరులో ఊర్మిళాదేవిగారును, పలనుచేరిలో కస్తూరిబాయిగారును ఉపన్యసించిరి.

9:— మదరాసు. శ్రీమతి కజిన్సు సతిగారిని అడయారులో అరెస్టుచేసిరి.

:— అగస్టు 10-వ తేది బళ్లారిలో అరెస్టు అయి నాలుగు మాసముల శిక్షకైన సి. జ్ఞానసుపాంది నెల్లూరి జయిల్లో శిక్షపూర్తి చేసుకొని విడుదల అయిరి. కేకూరుకు ప్రయాణమైరి.

10:— వేలూరు. శ్రీమతి అన్నపూర్ణమ్మగారు కృష్ణా జిల్లానివాసియగు సి. తరగతి ఖైదీ స్త్రీలజయిలునుండి విడుదల చేయబడెను.

:— మదరాసు. శ్రీమతి కజిన్సు సతిగారికి ఏడాదిశిక్ష.

:— బెంగులా. ఏమీ జాన్సన్ గారు మెంపా మెడీన్‌కు అనుకొనిన దానికంటె ఆమెముందుగనే చేరిరి.

:— కృష్ణా జిల్లా నివాసురాలు శ్రీమతి వెంకమ్మగారు రాయవేలూరు జెయిలునుండి విడుదలచేయబడిరి.

:— బెజవాడ. అంజనాదేవి ఆశ్రమ ద్వితీయ వార్షికోత్సవము.

11:— చెన్నపురి. తిరువల్లిక్కేణి 'మినర్వా' ట్యూటోరియల్ కాలేజీలో శ్రీమతి రంగయ్య కన్య ఆంధ్ర విద్యార్థులను ఒకకుటుంబము వారివలె మనవలెనని హెచ్చరించెను.

:— శ్రీమతి కస్తూరిబాయిగాంధి, ఊర్మిళాదేవిగార్లు క్విలాండికిబోయిరి.

:— కల్లికోట. స్వదేశిప్రదర్శన మండలివారి తృతీయ ప్రదర్శనమునకు శ్రీమతి అమ్ముస్వామినాధన్ గారు ప్రారంభోత్సవము జరిపిరి.

13:— అహమదాబాదు. సంఘ సంస్కరణసంఘపు ఉపాధ్యక్షురాలగు శ్రీమతి లేడి విద్యాగౌరి రమణాబాయిగారి పిటీషనుపై 14 సంవత్సరముల వయస్సుగల జైయినుబాలిక వివాహము నిషేధించుచు జిల్లాజడ్జిగారు ఇంజంక్షను ఉత్తరవునొసగిరి.

:— శ్రీమతి కస్తూరిబాయిగాంధి, ఊర్మిళాదేవిగార్లు మంగుళూరువెళ్లిరి.

:— కలకత్తా. శ్రీమతులు రాణీబాలాదేవి, నిమబాలాదేవిగార్లు క్లైయివువీధిలో ఊరేగింపు జరిపినందులకు చెరి 6 నెలలు కఠినఖైదు విధింపబడిరి.

14:— వేలూరు. ప్రభుగారిసతి (కమలాబాయి అనునామె) విడుదలచేయబడెను. ఈమె భర్త ఆజెయిలులోనే యున్నాడు. ఈమె అయనతో మాట్లాడివచ్చెను.

15:— మాండివిడో. స్త్రీలకుకూడ ఓటింగు అధికారము ఇవ్వబడవలెనను చట్టము ఉరూగ్వే పార్లమెంటులో గాకింపబడెను.

:— వల్లువనాడు తాలూకాలో బోర్డువారు శ్రీమతులు కస్తూరిభాయిగాంధి, ఊర్మిళాదేవిగార్లను సన్మానించిరి.

17:— కూనూరు. శ్రీమతి పి. కృష్ణమీనన్ అధ్యక్షతను జరిగినసభలో గురువయ్యూరు దేవాలయములోనికి హరిజనుల ప్రవేశము కోరుచు తీర్మానించిరి.

# గ్రంథ పరిచయము

**త్రిలింగలక్షణసారము:—**

ఇదియొక యాంధ్రవ్యాకరణము. ఎస్. ఎస్. ఎల్. సి. బోర్డువారు, నూతనముగాఁ బ్రకటించిన వ్యాకరణప్రణాళిక ననుసరించి వ్రాయఁబడినది. గ్రంథకర్త, "ఉభయభాషాప్రవీణ" బులుసు నరసింహశాస్త్రి గారు. ప్రకాశకులు, ఇ. మా. గోపాలకృష్ణకోను, మధుర. రమారమి 220 పుటలుండును. విద్వాన్ బ్రహ్మశ్రీ గంటిజోగి సోమయాజులు, ఎమ్. ఏ, ఎల్. టి, గారును, ఆంధ్రవ్యాకరణపారంగతులు బ్రహ్మశ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రులువారును, బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్య ఎమ్. ఏ. ఎల్. టి. గారును నీగ్రంథమును చక్కఁగఁ బ్రశంసించి యభిప్రాయముల నిచ్చియున్నారు: శైలి సర్వజనసుబోధమై యున్నది. ఆంధ్రవిద్యార్థులకు మిక్కిలి యుపయోగమయిన గ్రంథములలో ఇదియొకటి. ఉన్నతపాఠశాలావిద్యార్థుల వ్యాకరణజ్ఞానాభివృద్ధికి మిక్కిలి తోడ్పడఁగలదని మావిశ్వాసము. వలయువారు, "ఇ. మా. గోపాలకృష్ణకోను, మధుర. (లేక) బ్రాడ్వే, మద్రాసు" కీవిధముగ వ్రాసిఁ బడయఁగలరు.

**శోభావతి:—**

గ్రంథకర్త్రి ఆ. పి. పిరాట్టమ్మగారు. పదియారేడుల లేఁబ్రాయమున నే ఇటువంటి యుత్తమసాంఘిక నవలను రచించిన వీరుమిక్కిలి ప్రశంసనీయులు. శైలి మృదుమధురపదభూయిష్ఠమై, చదివినకొలది చవులూర జేయుచున్నది. సాధారణముగా ప్రతియింటిలోను, భర్తతోఁగలసి సంసారసుఖమనుభవించెదమని గంపెడాశతో నేతెంచిన చిన్నకోడలిని, మెరటుఅత్తలుపెట్టు పలుబాములను గన్నులనుఁగట్టినట్లుగాఁ జిత్రించిన వీరిరచనానైపుణ్యము శ్లాఘాపాత్రము. తనగౌరవానికిఁదగిన సంబంధముగాదని మొదటినుంచి భార్యను నిరసించిన పట్టాభిరామయ్య—ప్రేమనుజంపుకొని భార్యనుదూషించిన క్రూరుఁడైన పట్టాభిరామయ్య—చివరకుఁ దనభార్యయగు శోభావతి సహనము మొదలగు సుగుణపుంజముల చేతనే మనోహరవర్తనము గలిగి, పశ్చాత్తాపతప్తుఁడై భార్యను ప్రేమించును. సుగుణాలవాలయగు శోభావతిపాత్రకు విరుద్ధపాత్ర (Contrasting character) యనఁదగు మాణిక్యమురొక్క గయ్యాళితనము, ముక్కోపము, బాగాఁజిత్రించఁబడినవి. ఈవిషయములో ఈకవయిత్రి త్రొక్కినది షేక్స్పియర్ మహాకవియొక్క పాత్రపోషణారీతులలో నొకటి. ఇందలి సంభాషణలు హృద్యములుగానుండి చదువరులకు గ్రంథపఠనాపేక్ష నినుమడించుచున్నవి. గ్రంథము ప్రతివారు—అందున ప్రతిసోదరియు—చదువదగినది. ఈగ్రంథములు వలయువారు, శ్రీమాన్ శెల్వపిళ్లయ్యగారు, నెం 4, టంకసాల సుబ్బాయిలునాయనివీథి, పాతచాకలిపేట, మద్రాసు.

—కర్లపూడి వేంకటేశ్వర్లు బి. ఏ.

**చిత్రకథలు:—**

2, 3, 4, 5 భాగములు. ఎలిమెంటరీస్కూలు విద్యార్థులకు ఉపయుక్తముగ నుండునట్లు శ్రీ నిడమర్తి సత్యనారాయణమూర్తి బి. ఏ., బి. ఇ. డి గారిచే వ్రాయబడినవి. ఆయాతరగతుల విద్యార్థులు ఆయాకథలను చదివి స్వయముగ అర్థము చేసికొనజాలు సులభశైలిలోనున్నవి. నీతి, ఉన్నతభావములు విద్యార్థుల లేతమనముల హత్తుటకు ఈకథలెంతయు సమర్థములు. మనపురాణములనుండియు, ఆంధ్రకావ్యములనుండియు మాత్రమేగాక విదేశచరిత్రలనుండియు నిందలికథావృత్తములు గైకొనబడినవి. ఈకథావాచకములు పాఠశాలాధికారుల అభిమానమునొందునని నమ్మెదము. ఈభాగములవెల వరుసగా 0-2-6; 0-3-0; 0-5-0; 0-5-0. ప్రకాశకులు వి. వేంకటేశ్వరరావు అండుకో; కైకలూరు, కృష్ణాజిల్లా.

**వీరయువకులు :—**

ఇది యొక అపూర్వమగు చారిత్రకకథాగ్రంథము. ఆంధ్రచారిత్రకగ్రంథమున రసవద్ఘట్టమగు కాకతీయచరిత్రకు సంబంధించినది. ప్రతియాంధ్రుడును చదివితీరవలసిన గ్రంథము. ఇందలి ఆంధ్రవీరయువకులు గావించిన సాహసకృత్యములు అద్భుతావహములు. "కాకతీయులకు వారెల్లప్పుడును పెట్టనికోటలై మెప్పు గాంచిరి. కాని యింతటితో వారివీరనామములు ఆంధ్రవీరులచరిత్రములో నేమూలనో దాగియుండలేదు. వారి నామము లింటిపేరులుగగలిగి వారిపుత్రులును పౌత్రులును వంశపారంపర్యముగ నేఁటికిని కృష్ణాగోదావరీ ప్రాంతదేశమున పేరెన్నికగన్న కుటుంబములయి మెప్పునందుచున్నారు. ఈకుటుంబముల వారిప్పటికిని వారిపూర్వులగు వీవీరయువకుల మహత్కథను శ్రోతలకు కర్ణపేయముగ వర్ణించుచునే యున్నారు. వీరమాచన్నసంతతివారు వీరమాచనేని వారై నారు. ఇట్లితక్కుంగల యాంధ్రవీరుల వంశములవారు అమరనేనివారు; గోగినేనివారు; పిన్నమనేనివారు; పూతినేనివారు; పర్వతనేనివారు; కామినేనివారు; తాతినేనివారు; వల్లభనేనివారు; ఎర్నేనివారు; విక్కిలినేనివారు; మూరకనేనివారు; మైనేనివారు; రామినేనివారు; దొడ్డపనేనివారు; త్రిపురనేనివారు నై వెలయుచున్నారు.' క్రౌనుసైజున 188 పుటలు. ప్రకాశకుడు: శ్రీ. కొండల రావు. బొడిదవారియిల్లు, రాబర్ట్సన్ పేట, మచిలీపట్టణము.

# పత్రికాపరిచయము

**వినోదిని :—**

ఆంగ్లమునందలి టిట్ బిట్సు, ఆన్సర్సు మొదలగు వినోదపత్రికలఛాయను తెనుగున నూతనముగా ప్రచురింపబడుచున్న వినోదినికి మాస్వాగతము నిచ్చుచున్నాము. భాషాభిమానులును, వణిక్పుంగవులును, ఉదారులును, ధనికులునుఅగు శ్రీ పి. గోపాలస్వామినాయుడుగారు దీనికి జనకులగుటచే పత్రిక రొట్టెబాలారిష్టములును లేక నిరంతరాయముగ సాగునమాట నిక్కువము. చందా ఒక్కరూపాయిమాత్రమే యుంచుటచే అందరి అందుబాటునందుండును. 'ఓం'అను సంపాదకీయమున తెలుగుపత్రికలమగూర్చి ఆలోచన రేపు కొన్ని వాక్యములు గలవు. వీసత్రోయి; సేటిపడుచమ్మగారి అధికప్రసంగము; మాకుర్రచేష్టలు; మాయింటివైద్యుడు, మైలాపడ్రామరా, మాలసంక; లోకసంచారము మొదలగువ్యాసములు హాస్యరసమిళితములు. 'నవ్వులాట'అను శీర్షిక క్రింద హాస్యము పుట్టించుచిత్రములు చేర్చబడినవి. మొత్తముమీద తెనుగున ఈపత్రిక పద్ధతి నూతనము. డబుల్ క్రౌను సైజున 32 పుటలు. విరునామా. 234, గోవిందప్పనాయక్ స్ట్రీటు, జి. టి. మదరాసు.

**తీర్పుల పత్రిక :—**

గ్రామకోర్టులు, హైకోర్టులు, ప్రీవీకౌన్సిలు మున్నగున్యాయస్థానములనుగురించియు వానియందు చర్చింపఁబడు చట్టములనుగూర్చియు, ప్రకటింపఁబడు పాక్షికపత్రిక. సంపాదకులు నేలనూతల సుబ్బరాయుడుగారు, బి ఏ., బి. యల్., అడ్వకేటు, నెల్లూరు. ఈపత్రిక గ్రామస్థులకందరికిని, ముఖ్యముగా ప్లీడర్లు, పంచాయతీకోర్టు ప్రెసిడెంట్లు మున్నగువారు చదువఁదగినది. ఇట్టి పత్రికయాంధ్రభాషయందు ఉత్పన్నమగుటకు ఇదియే మొదలని చెప్పవచ్చును. ఇట్టి యీపత్రికను ఆంధ్రులుపోషించి సంపాదకుల యీనూతనోద్యమమును జయప్రదముగ సాగింతురని నమ్ముచున్నాము. చందా సం||కు రు 3-0-0. కొండూరు అప్పయ్య, ధూర్జటి రామయ్య. పబ్లిషర్సు అండ్ ప్రొప్రయిటర్సు, నెల్లూరు.

**ఆంధ్రప్రకాశిక :—**

చరిత్రగల **తెలుగువారపత్రి**కలలో ఆంధ్రప్రకాశికయొకటి. అది యిపుడు పునరుద్ధరింపబడుట కెవరు ఆనందింపరు? డిసెంబరు నాలుగవతేదినుండి అది వారపత్రికగ క్రమముగ ప్రచురింపబడుచున్నది. డబుల్ రాయలుసైజున ఎనిమిదిపుటలు. సంవత్సరపు చందా 2-6-0. విడిసంచిక అణా. తెలుగువారపత్రికలలో నిది మిక్కిలి చవకయైనది. కావున విశేషప్రచారమందుటకు అవకాశముగలదు. పత్రికనీతియు విశాలాశయములనే *వెల్లడించుచున్నది. చిరునామా: ఆంధ్రప్రకాశిక, చాకలపేట, మద్రాసు.*




**స్థానికస్వపరిపాలనచరిత్రయందు నూతనాధ్యాయము:—**

శ్రీమతి రాధాబాయి సుబ్బరాయను సేలము జిల్లాబోర్డు అధ్యక్షతకు అభ్యర్థినిగా నున్నదను విషయమునుగూర్చి గతమాసమున కొన్నిపంక్తులు వ్రాసితిమి. డిసెంబరు 20-వతేదీని సేలముజిల్లాబోర్డు అధ్యక్షునిఎన్నిక జరిగినది. అభ్యర్థులిరువురు: దివాను బహదరు యస్. ఎల్లప్పచెట్టియారు, మదరాసుశాసనసభాసభ్యుడు; శ్రీమతి రాధాబాయి సుబ్బరాయను. మొదటివారికి 30 ఓట్లు; శ్రీమతిగారికి 20 ఓట్లు వచ్చినవి. ఎల్లప్పచెట్టియారు ఎన్నుకొనబడినట్లు ప్రకటింపబడెను. అంతట శ్రీమతి రాధాబాయి లేచి ఇట్లుపన్యసించెను: "ఈఎన్నికలో జయముగాంచిన ఎల్లప్పచెట్టియారును నేను హృదయపూర్వకముగ అభినందించుచున్నాను. ఎల్లప్పచెట్టియారుపై ఎట్టిద్వేషముతోడను నే నీఎన్నికలో పాల్గొనలేదు. తోడిసభికులు కొందరు నన్నుకూడ అభ్యర్థినిగానుండమని కోరుటచే నుంటిని. అదియునుగాక స్త్రీలకీయబడిన ఎన్నికహక్కును పూర్తిగ నుపయోగించుకొనుటను స్త్రీలుగ్రహించునట్లు చేయవలయుననియు నాతలంపు. నేనును నాతోడిసభ్యులును బోర్డుపరిపాలనమున ఎల్లప్పచెట్టియారుకు హృదయపూర్వకముగ తోడ్పడెదము." ఈవాక్యములెంత ఉదారములో! స్థానికసంస్థలలో కొన్నిటియందు పురుషులు తమలోతాము పోటీబడి ఆపోటీలో పుట్టినరవరవలను విడనాడక కావేషీలు పెంచుకొని ఆయాసంస్థల పరిపాలనక్రమమునకు భంగముకలిగించుచున్నారు. వారెల్లరును ఈస్త్రీవచనములను చిత్తగించి ఇకనైన సిగ్గుతెచ్చుకొని స్థానికస్వపరిపాలనచరిత్రయందు నూతనాధ్యాయమును ప్రారంభింతురుగాక!

**పౌరజీవనమునకు జవము పుట్టించు చేఁత:—**

ఓడ ఎక్కువఱకు ఓడమల్లయ్య, ఓడ ఎక్కినతరువాత బోడిమల్లయ్య అనుసామెతకు నేటిస్థానికసంస్థల ఎన్నికలు నిదర్శనమిచ్చుచున్నవి. అభ్యర్థిగా నుండినంతవఱకు ఓటర్లచుట్టు తిరిగి చేయరాని వాగ్దానములుచేసి, చేయలేనికబుర్లు చెప్పి సభ్యులైనపిదప ఓటర్లను ఓరకంటితోనైన చూడకుండు వారితోడనే నేటిస్థానికసంస్థలు నిండాఱియున్నవనుట సత్యసమీపము. ఈగంజాయితోటలో ఒక్కొక్క తులసిమొక్క లేకుండలేదు. చూడుడు. బరంపురము

మ్యునిసిపలుసంఘసభ్యురాలుగా పదిమాసములకు పూర్వము ఎన్నుకొనబడిన శ్రీమతి గంపా శివకాంతమ్మగారు ఈనడుమ తమవార్డు వోటుపేయర్లకు వ్రాసినవిజ్ఞప్తిని. "సోదర సోదరీమణులారా! మీరందరున్ను ఏకగ్రీవముగా నన్ను మీవార్డునకు మ్యునిసిపల్ ప్రతినిధినిగా నెన్నుకొనినందులకు మిక్కిలి కృతజ్ఞురాలను. గత పది మాసములనుండి మీతరపున మ్యునిసిపల్‌సభలో నాశక్తికొలది పనిచేయుచున్నాను. బరంపురము పట్టణముయొక్కయు, ముఖ్యముగా మీ వార్డుయొక్కయు, పారిశుద్ధ్యము, నీటివసతి, ప్రాథమికవిద్య, పన్నులు, మ్యునిసిపలు ఆర్థికము, పరిపాలనము మొదలగు విషయములను గూర్చి మీయభిప్రాయములను అనుభవములను తెలిసికొనిననేగాని నావిధిని పూర్తిగా నెఱవేర్పజాలనని నే నెఱుగుదును. ఈ విషయములనుగూర్చి మీకు సేవచేయుటకు మీ సహకారమును సవినయముగ గోరుచున్నాను. స్త్రీలకు ప్రత్యేకింపబడిన స్థానములలో నొకదానికి నేను ప్రతినిధురాలనుగా ఎన్నుకొనబడినందువలన పురపాలకసంఘమునందు స్త్రీలకు సంబంధించిన విషయములనుగూర్చి పాటుపడుట నాముఖ్యకర్తవ్యము. బాలికాపాఠశాలలు, శిశుసంరక్షణ, ఆరోగ్యము, ఆసుపత్రులు, నీటివసతి మొదలగు విషయములందు స్త్రీలకు బాధ్యత హెచ్చుగానుండుటచే, వాటి అభివృద్ధినిగూర్చి నా సోదరీమణులయొక్క సలహాను, సహాయమును నేను ప్రత్యేకముగా కోరుచున్నాను." ఇట్టి విజ్ఞప్తిని శ్రీమతిగారు తమవార్డులోనున్న ప్రతిగృహమునకునుపంపి ఆయా ఓటరులతో సంప్రదించి తగురీతిని వ్యవహరించుచున్నారు. చేకొన్నపనినింత శుచిభావముతోడను, దీక్షతోడను నిర్వర్తించి స్త్రీలప్రవేశముచే స్థానికసంస్థలుబాగుపడుననుటకు ఉదాహరణముగ చెప్పుకొనగలుగునట్లు చేయుచున్న శ్రీమతి గంపా శివకాంతమ్మగారిని ఎంతయు అభినందించుచున్నాము.

కజిన్సుసతి ఉదారత:—

కజిన్సుసతినామము భారతీయస్త్రీలకు బాగుగ పరిచయమైనదే. ఆమె ఐరిషుజాతిస్త్రీయయ్యు భారతస్త్రీ పునరభ్యుదయమునకు ఏఒక్కభారతస్త్రీకంటెను ఎక్కువ కష్టించినదని చెప్పవచ్చును. భారతస్త్రీపునరభ్యుదయమునకు మాత్రమే ఆమెకష్టించినదని చెప్పనేల? భారతజాతీయోద్యమమునకును ఆమెశక్తికొలది కృషిచేయుచున్నది. ఆకృషిలో ఆమె స్వసుఖమును ఏమఱినది. కారాగారమును స్వీకరించినది. డిసంబరు 10-వ తేదీని ఆమెకు ఏడాది విడికైదుశిక్షవిధింపబడెను. శిక్షవిధించి న్యాయాధికారి ఆమెకు ఐరోపియను స్త్రీలకుతగినసదుపాయములను సమకూర్చవలెనని చెప్పెను. దానికి ఆమె 'ఐరోపియనుస్త్రీలుగూడ భారతీయస్త్రీలవంటివారే. నాకుప్రత్యేకసౌకర్యములు అక్కరలేదు. భారతీయస్త్రీల కొసంగునట్టి సౌకర్యములే నాకును ఒసంగవలయును'అని చెప్పెను. ఈవాక్యములు ఆమె హృదయవైశాల్యమును చూపుచున్నవి.

**స్త్రీలు స్టౌవులను ముట్టరాదు :—**

స్టౌవుమంటలవలన ప్రాణములు గోల్పోయిన స్త్రీలకథ లీనడుమ విశేషముగా దినపత్రికలయందు వినవచ్చుచున్నవి. ఈకథలలో పెక్కింటికి కార్యస్థానము బొంబాయి. అచ్చట ఈవిధముగ మరణించినవారిలో గుజరాతిస్త్రీలసంఖ్య అధికముగనున్నది. డిసెంబరు 12-వతేదీని స్టౌవును ముట్టించుచు ప్రమాదవశమున ఒళ్లుకాలి ఒకానొకబొంబాయి గుజరాతీస్త్రీ మరణించగా విచారించుటకుకూడిన పంచాయతీదారులు విచారణజరిపి ఇట్లు సూచించిరి: "ఇట్టిప్రమాదములు నానాటికి అధికమగుచున్నవి. స్త్రీలు స్టౌవుముట్టించునట్లు చేయువారు నేరస్థులుగ నిర్ణయించుటకు చట్టమునొకటి తయారుచేయుట ఉచితము." ఇట్టి ప్రమాదమును మఱియొకదానిని ఈవఱకు విచారించియుండిన బొంబాయి న్యాయాధికారి యొకడు "పదునాల్గేండ్లకులోబడి స్టౌవు వెలిగించుటలో అనుభవములేని తన భార్యచే స్టౌవుపై వంటచేయించు భర్తను—చట్టము సమ్మతించునో—కొరడాతో కొట్టెదను" అని చెప్పియుండెను. న్యాయాధికారి చెప్పినను, పంచాయతీదారులు చెప్పినను ఈవిషయమున చట్టమొకటి అవశ్యకమనియే. శాసనసభలోని ప్రజాప్రతినిధులు ఈఆందోళనము నందుకొనవలసియున్నది.

**శ్రీ కాళ్లకూరి గోపాలరాయసన్మాననిధి :—**

సుప్రసిద్ధాంధ్ర విద్వత్కవులగు శ్రీకాళ్లకూరి గోపాలరావుగారిని సన్మానించుటకు ప్రయత్నములు సాగుచున్నవనుటకు సంతోషించుచున్నాము. ఈప్రయత్నమును ప్రారంభించినది నెల్లూరు ఆంధ్రసభవారు. వారు ఫిబ్రవరిమాసము మొదటివారములో గోపాలరావుగారి వాల్మీకినాటకమును మదరాసునందు ప్రదర్శించుటకును, ఆసందర్భమున గ్రంథకర్తగారికి సన్మాననిధి సమర్పించుటకును తీర్మానించిరి. ఎటులైనను విద్యాపోషణము జరుగుటయే మాకాంక్షితముగావున ఈతీర్మానమును మేము మనఃపూర్వకముగ ఆమోదించుచున్నాము. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారుమున్నగు ఉదారులగు ఆంధ్రమహాశయులు ఈప్రయత్నమునకు బాసటయైయుండుట శుభసూచకము. ఈసన్మాననిధికి ఆంధ్రులెల్లరు తోడ్పడుదురుగాకయని కోరుచున్నాము. విరాళములను మదరాసు ఎస్ప్లనేడునందలి, మదరాసుడిస్ట్రిక్టు కోఆపరేటివు సెంట్రలుబ్యాంకికి 'పండిత కే. గోపాలరావుపర్సు' లెక్కకు పంపప్రార్థితులు.

**శ్రీ భగవన్నారాయణగారి శిక్షవద్దగుట :—**

అండరుట్రయిలు ప్రిజనరుకు 'గృహలక్ష్మి'నందజేసినందుకుగాను శిక్షను పొందిన శ్రీభగవన్నారాయణగారిని అప్పీలులో విడుదలచేసిరని వినుట కెంతయు సంతసించుచున్నాము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ ప్రపజం టేటివు ఆఫ్ న్యూస్ |
| మచిలీపట్టణము: | సి. వి. అవధాన్లు, ఇన్సూరెన్సుబీరో. |
| హైదరాబాదు: | ఎస్. లక్ష్మిబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్తా మార్కెటురోడ్డు.(మన ప్రాంతపు 1 రూ॥కు స్మాని రూ॥ రూ॥ 1-2-0అగును) |
| నిడదవోలు: | తాటిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు |
| రాజమండ్రి: | ఏ. కృష్ణమూర్తి బ్రదర్సు, న్యూస్ఏజంట్సు. |
| తాడేపల్లిగూడెం: | కాశీరాజు శ్రీరాములుగారు. |
| జరంపురం: | మార్ల్ల బ్రదర్సు. |
| గుంటూరు: | వెల్కం అండు కంపెని. |
| ఏలూరు: | సనకా రాజారావుగారు, పవరుపేట. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| అనకాపల్లి: | గ్రంధి కన్నయ్యపంతులు, గాంధిమార్కెటు. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి. |
| పిఠాపురం: | మొం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. |
| ,, | ఎం. సూర్యరాజు, ఆంధ్రన్యూస్ఏజన్సీ. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు, బుక్ సెల్లర్సు. |
| జేష్మెడ్‌పూరు: | టి. వి. రమణయ్యగారు, 3 టిల్ జుగ రోడ్డు, న్యూ 'L' జోను. |
| మదరాసు: | పై. టి. ఎస్. నారాయణశాస్త్రిగారు, టైపు రైటరు ఏజన్సీ. 364, ఎస్ప్లనేడు. |
| ,, | ఆకుండి వేంకటశాస్త్రిగారు. |
| తణుకు: | వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు. |
| బెజవాడ: | ఆంధ్రాఇన్‌డస్ట్రియల్ స్టోర్సు. |
| అనంతపురము: | శ్రీగోపాలకృష్ణ అండ్ కంపెని, జనరల్ మర్చెంట్సు. |
| నరసాపురము: | కటికల సూర్యారావుగారు. |
| భీమవరము: | అమిరపు శేషాచలశర్మగారు. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాల పెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.